ఆగస్టు 1974



# భారతి


వ్యవస్థాపకులు:

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల రూపాయిన్నర

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకులు

(1938–1972)



ఆగస్టు 1974

సంపుటము : 51 : సంచిక : 8 :

విడిపత్రిక వెల రూపాయిన్నర



నోములు నోచుకుని
వ్రతాలుండి తనదైవమైన
నాగుపాము సహాయంతో
భర్తను కాపాడుకున్న
ఒక అపూర్వ యువతి గాథే
ఆంధ్రప్రదేశ్ అంతటా
ఆగస్ట 15
విడుదల!
నోము
దర్శకత్వం పట్టు
సంగీతం:సత్యం మాటలు ఎన్ ఆర్ నంది
నిర్మాతలు.మురుగన్,కుమరన్,సరవణన్.బాలు
విజయా రిలీజ్
AVM
PRODUCTIONS

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1974


| | | |
|---|---|---|
| పండిత రాయల సుధాలహరి | శ్రీ దివాకర్ల వేంకటావధాని | 1 |
| గుడిమల్లం – శివాలయము | శ్రీ ఐ. కార్తికేయ శర్మ | 7 |
| పుడమి పోలిక | డా. నాయని కృష్ణకుమారి | 12 |
| విజయనగర చరిత్ర | డా. నేలటూరు వేంకటరమణయ్య | 13 |
| స్వరోదయం | శ్రీ గడియారం శేషఫణి శర్మ | 21 |
| సీత కథ | "ఊర్వశి" | 22 |
| తెనుగు మఱుగులు | డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య | 30 |
| అక్షర సంగమం | దేవిప్రియ | 32 |
| పల్స్ ఆవ్ రోడ్ | డా॥ కేశవరెడ్డి | 33 |
| సాహిత్య రసికత | శ్రీ టి. జి. కృష్ణారావు | 38 |
| భారతీయ చిత్రకళలో లక్ష్మి సరస్వతులు రెండూ అపరూప భక్తి భావములు | శ్రీ పిలకా లక్ష్మీ నరసింహమూర్తి | 45 |
| కలగూరగంప | | 49 |
| గ్రంథ విమర్శలు | | 53 |


———

# "అనగనగా ఒక తండ్రి"

ఈ తండ్రి మీరు కావచ్చు నేను కావచ్చు.
ఈనాటి సమాజంలో ఉన్న లక్షలాది
తండ్రులకు ప్రతినిధి యీ చిత్రంలోని తండ్రి.
నేటి యువకుల్లో తరచుగా కన్పించే
బాధ్యతా రహితమైన ప్రవర్తన వల్ల కన్న
తండ్రులు పొందే మానసిక క్షోభకు
ప్రతి బింబమే యీ చిత్రం.

మహేష్ గారు రూప కల్పన చేసిన,
సి.యస్. రావు గారు తీర్చి దిద్దిన, యింత
చక్కని, సహజమైన పాత్ర నాకు లభించటం నా అదృష్టం.
మేమందరం అనుకొన్న విధంగానే యీ తండ్రిని ఆదరించి,
అభిమానిస్తున్న ప్రేక్షక మహాశయులకు
నా హృదయపూర్వక అభినందనలు.



లావణ్య పిక్చర్సు






దర్శకత్వం: సి.యస్.రావు, ... మహేష్
ఆంధ్ర: విజయా కంబైన్స్. ... జయలక్ష్మి పిక్చర్స్ ... జనతా పిక్చర్స్ ...

# పండిత రాయల సుధాలహరి

## శ్రీ దివాకర్ల వేంకటావధాని

చం. విరిసిన తమ్మిపూలకయి వేగు మధువ్రత మోదసీమ దు
స్తరమగు కోకకాంత పరితాపము బాపెడుమందు లేజమున్
జెరచిన కారుచీకటికిఁ జిచ్చు విలోచన పక్షపాతమై
వరలిన దొక్క కాంతి సమవాయము తూరుపుకొండ ప్రక్కగా.

సీ. జలజ హాని యొనర్చు తెలుపైన పచ్చని
యిందుకాంతుల గర్వ మేపు మాపి
చీకటిలోబడి చివుకు లోకము దవ్వు
గా నుండియే తెల్వి గాంచజేసి
జీవుల దైన్య ముచ్ఛిన్నంబు గావింప
ముంజేత గింకణమ్మను ధరించి
క్రమముగా నరుణమౌ కాంతిపుంజముచేత
రారంజితమ్మలై రాణ కెక్కి

గీ. యుదయ కాలమందు నుద్భవ మందుచు
నఖిల జగము వేగ నాక్రమించు
కిరణ సమితి మాకు జిరతరానందము
గలుగజేయుచుండు గాత సతము.

చం. ప్రతిదిన దేవరక్ష సకల ప్రతిబంధక రోగశిక్ష సం
తత జగదంగరక్ష నళిన ప్రకరప్రియ భాగ్యలాక్ష సం
గతముగ భక్త కల్పములుగా బరితప్త సువర్ణ కాంతికిన్
బ్రతులగు భాస్కరాంశువులు నాగురుదోషములన్ హరించుతన్

సీ. భూనభోంతరముల బులిమి గాఢమ్మైన
చీకటి నొక ముద్దజేసి మ్రింగి
యఖిల జగమ్ముల నావరించిన మంచు
నిమిష మాత్రమ్మున నీరు జేసి
యెడబాటుచే బాధపడు కోకకాంతల
యార్తిని బాపు పుణ్యమ్ము గట్టి
బాలప్రవాళ సంపద్రేఖ సవరింప
ముదముతో జేగురు బూత బూసి

గీ. యఖిల లోకపాల కాపద్విమోచన
సన్నుతంబు లగుచు జగతి బ్రాకు

భాను కిరణ సమితి పాపమ్ము లెడలించి
కూర్మి మాకు మేలు గూర్చుగాక!

సీ. ఆకు జొంపమ్ముల నవలీల జీలిచి
నందుల వెంట భూస్థలికి డిగ్గ
తముగాంచి నిడుదలై తనరారుచున్నట్టి
దండములంచుఁ జిత్రముల బ్రమసి
చిలుక పిల్లలు తమ చిన్నారి పదముల
దమివిూరగా బయి దన్నివెట్టి
లేత చివుళ్లపై లీలగా జలియించు
ప్రాలేయ కణముల బక్వమైన

గీ. దాడిమీ బీజముల సొంపు దలచికొనుచు
చంచువుల విప్పజేయు భాస్కరుని దివ్య
కిరణ సముదాయమ్మెలమి మా కిల్బిషముల
బాపి యేవేళ మమ్ము గాపాడుగాక!

చ. పవలు విహారయోగ్యమగు పద్మనివాసము తల్పుదీసి రే
యి విడిసి పీడు చెంగలువ యిండ్లకు దల్పులు మూసివైచి యూ
యవనిని జిల్కి కుంకుమ పుటంబువులఁ దొలిసంజ లక్ష్మికిఁ
దవిలి సపర్యజేయు హరిదశ్వకరంబులు మమ్ము బ్రోచుతన్.

మ. ధరణీపాలక సౌధశృంగములమీదఁ హింగుళాలేపముఁ
దరుషండమ్ముల నూత్నపల్లవ రుచిఁ దాపించి ప్రాలేయపుఁ
గరకల్ కాష్ఠములఁ జ్వలించు ఖదిరాంగారంబులైయుండ సా
గరమున్ జీలిచివచ్చు సూర్యకరముల్ కాపాడుఁగాతఁ మమున్.

సీ. కాశ్మీర చూర్ణంబు గల్పిన నీటిచే
ధరణి నల్వంకల దడుపబడియె
పద్మ కారాగార బంధనంబు సడల్ప
బడి ప్రోయు నున్మత్త బంభరములు
గో సహస్రములు దిక్కులు నాలుగింటికి
విగత శృంఖలములై వెడలిపోయె
వినిపించుచున్నది వివిధ ద్విజకులంబు
కావించు బహుళమౌ కలకలమ్ము

గీ. విమల చిత్తులైన విబుధు లందరి పురా
భవ విబద్ధ పుణ్యఫలమనంగ
ప్రాచియనెడి పడతి ప్రసవించు కొన్నట్టి
సుహిత పుత్రమణికి మానమస్సు.

సీ. వేతువయుగు వేళ వివిధ జీవులకును
జైతన్య సంపద సంతరించి
సాయంతనమ్మున జలధిగర్భము జొచ్చు
నప్పు డయ్యది వేగ నపహరించి
రత్నసానువునకు రమణీయమణిగణ
సుషమా సమృద్ధిని జోడు కొలిపి
విసువుతేక విరామ మసలె కాన్పింపక
యనుదిన వ్రతముగా ననుసరించు

గీ. నిరవధికమై నయట్టి భాస్కరుని కాంతి
నయనసరణికి దూరమ్మునన్ జనించి
క్రమముగా నంతకంతకు గాఢమగుచు
మాకు ప్రత్యక్షమై మమ్ము మనుచుం గాక!

మ. వనజాతంబులు మంచుచేత నిబిడధ్వాంతంబునన్ గండ్లు యా
మినివల్లన్ ద్విజకర్మముల్ చెడుట సంప్రేక్షించి చాటయ్యు న
బ్ధిని వే వెల్వడి వాసవాశ వయికిన్ వేంచేయు లోకైక మి
త్రుని దివ్యప్రభ నా దురాశలకు నంతున్ గూర్చి రక్షించుతన్.

చం. చలికి వపారశోకము శశాంకునకున్ గృశకాంతి రాత్రికిన్
విలయము సర్వదిక్కులకు నీరజపాళికి దెల్వి కల్వ పూ
వులకు విపత్తు సుప్తులకు బోధము గూర్చి నభమ్మునందు దా
నలరు సుప్రత్యుషస్సుర దయామతి సూర్యుడు విశ్వబంధువై.

శా. స్వాపాసక్తు నిద్రరోగుల నిరాశల్ నేత్రపున్ జీకటుల్
పాపస్నిగ్ధుల పాపము ల్దొలచుచున్ ప్రాగాశపై కెక్కు వి
శ్వాపద్రక్షకుడైన సూర్యు డనిశ ప్రస్థాన జాతాబ్జినీ
కోపోచ్చాటన నర్మకోవిదుడు మాకున్ మేలు జేకూర్చుతన్.

మ. సరిదంతర్జల బింబితమ్ము లగుచున్ సమ్యగ్గతిన్ రత్నసుం
దర గీర్వాణనగోర్వి నంతయును ప్రత్యక్షంబు గావించి భూ
సుర సంధ్యార్ఘ్య జలాల కాకసములో జొప్పించి రత్నప్రభల్
ధరపై బర్విన భాస్కరాంశువులు నా తాపమ్ము బోగొట్టుతన్.

చం. పడమటికొండపై మణులు పర్విన ఛత్రము పోల్కి నున్న య
ప్పు డెవని జూచుచుందురు నవోఢలు ప్రోడలు విప్రయుక్తలౌ
పడతులు భీతితో నయనపర్వముగా నతిదైన్య మొప్పు నా
తడు నళినీప్రియుం డిడుత దర్శ్రియపాళికి మాకు ధైర్యమున్.

ఉ. రోదసి నిండ రేయి నవరోధములేక చరించు చీకటిన్
మోది తదీయ రక్తమున నోయన నెల్లెడ రక్తకాంతు లా

సాదన జేయు దేనికయి సంధ్యలలో ద్విజాలర్ఘ్య మిత్తు ర
య్యాదిమ దైవతేజమునకై ఘటియింతుము మానమస్సులన్.

సీ. ఆదిత్యులకు రక్ష యంబురాసులయందు
దలమున్క లిడెడు జంతువుకు నావ
అసలు జన్మస్థానమైన నద్యంతంబు
లూహింపగా లేని యుత్సవంబు
తనయందు త్రిగుణంబు లనుగమింపుటజేసి
వానికిని దురీయమైన మూర్తి
తుందిలంబయి జగన్మందిరంబున ప్రాకు
తరుణాంధకార సంతతికి మిత్తి

గీ. శ్రమ యెరుంగక మూడులోకముల నొకటి
త్రామ మొనరించు చతురిమ దాల్చినట్టి
పద్మినీ ప్రాణవల్లభు పరమతేజ
మెలమి నీక్షించి మమ్ము రక్షించుగాక.

ఉ. సర్వ సుపర్వ రిభ్రమున సామ వచస్సుల సన్నుతింప గం
ధర్వులు స్వీయ సద్గుణ కథల్ గళము ల్వవరించి పాడగా
బర్వి రుజార్తులన్ వెదకి వారల దుర్గతి బాపు భాస్కరా
ఖర్వరుచి ప్రచారము జగమ్ముల పీడ నడంచు గావుతన్.

సీ. జాడ్య బాధితులైన జనుల జీవాతువై
తప్త సువర్ణముద్రస్తరించి
జాంఘిక సమితిలో జంఘాలమై పద్మ
సంఘంబులకు మహోత్సవము గొలిపి
ప్రాణికోటులకు జీవప్రాపకం బయి
కర్మ సంచలనమ్ముగడలు కొలిపి
జ్వాజ్వల్యమాన దివ్యజ్యోతియై వార్ధి
యుదరంబులోనుండి యుబికి వచ్చి

గీ. యబ్జు డాదిగ గల్గు నన్యగ్రహముల
కాంతిపుంజ సముద్భవ కారణ మయి
సకల జగదేకరక్షా ప్రసక్తమైన
యనఘ తేజము మాకు జయమ్ము గూర్చు.

ఉ. గోవులతో ప్రభాతమున గూడ గమించి రుచిప్రచార సం
భావన గూర్చి యస్తగిరి ప్రాకుచు దేహములందు జేర్చుచున్
దావమనన్ జగద్వ్రజిన దైన్యము బాపి శివంకరమ్ము తా
గోవిభు గోసహస్రముల కుంత జయమ్మును మాకు గూర్చుతన్.

చ. నరసుర యక్ష కింపురుష నాగ నిశాచర ముఖ్యులందరున్
వరుసగ నిల్చి దేనికి ప్రణామమొనర్తు రుషస్సులందు న
య్యరుణుని దివ్యబింబ ముదయాద్రి వసించి యవిద్య నాద్యమున్
విరిచి త్రిలోకికిన్ రుచిరవిద్య ఘటించి జయమ్ము గూర్చుతన్.

ఉ. ఆ వనజాసనాయువు క్షణాత్మికమై చను కాలచక్ర మే
దేవుని లీలయందు వినుతింతురు వేదపురాణకోవిదుల్
భావవికార షట్కమును ప్రత్యహ మెవ్వ డెసంగజేయు భా
యావిభు డాత డింద్ర దిశయందు ప్రభాతమునన్ జెలంగెడిన్.

చం. అరసి ప్రభాతవేళల హిమాంచిత భంగుర భూసురాంగముల్
చెరచెర శత్రుమారణము జేయగ రక్తిమ దాల్చి తూర్పునన్
బరగుచు ధర్మనాశకుల పాపము ప్రబద్ద లొనర్చునట్టి భా
స్కరుని మయూఖపాళి త్వరగా నడగించు మదీయ రుగ్మతన్.

చం. ద్విజులకు విశ్రమంబు సుఖదీప్తిని గాముకలోపాళి కం
బుజముల స్థాయి చెంగలువ పూవులకున్ ప్రమదంబు గూర్చుచున్
ప్రజల భరమ్ము నంతయు గృపామతి దాలిచి యంతరబ్ధికిన్
విజయము సేయు భాస్కరుడు వేగమె మాకు శుభమ్ము గూర్చుతన్

మ. చిరుపర్ణంబుల కింద్రగోపములకున్ సిందూరపున్ గాంతిలో
గురుపాదంబయి నిల్చి ప్రోడలకు గుల్కుం గూర్చు జైవాతృక
స్ఫురణకి ప్రొద్దుట మాపి రాత్రి యగుచో బొల్పారగా జేయు భా
స్కరు తేజ స్సడగించు గాత మది నాచ్ఛాదించు దుఃఖమ్ములన్.

ఉ. ప్రాతరుదంచదుస్రముల ప్రాగ్గిరి గుంకుమపూతః బూసి య
ద్వైతము మూడు లోకముల దార్చుచు జక్రములన్ గ్రసించు న
య్యాతన మాన్చి ధ్వాంత మను నబ్ధి మునింగినవారి నెత్తుచున్
బాతర లాడు బింబమది నా హృదయాంధ్యము బాపు గావుతన్.

సీ. ప్రకృతి రంజితమైన బ్రహ్మ మూలమునందు
నమలాత్మ యను పాదునందు బుట్టి
బంగారు తీగెల పగిది మయూఖమ్ము
లఖిల దిక్కుల శాఖలై వెలుంగ
నావరించుచునున్న యరుణిమ పల్లవ
పుష్ప విలాసమ్ము బ్రోది సేయ
యతివినీలంబైన యాకాశమే మత్త
బంభర నివహమై పరిఢవిల్ల

గీ. ధర్మకామార్థ మోక్షముల్ తగినయట్టి
ఫలములుగ వెల్గు సూర్య కల్పద్రుమంబు

శ్రీనివాసము మము గటాక్షించి మాకు
వాంఛితార్థము లొసగి కాపాడుగాక!

ఉ. పక్షులగూండ్లనుండియు స్రవంతులనుండి తుషారపాతముల్
జక్షులనుండి నిద్రయు మనస్సుల వేదొలగించి యస్త్రవౌ
నాక్షణమందు వానిని దయామతి నెప్పటిచోట జేర్చుచున్
రక్ష యొనర్చు సూర్యుని కరమ్ముల మా శ్రమ బాపు గావుతన్.

ఉ. ఈవలి చీకటిన్ మలపి యిండ్లకు లోపలనున్న దానికై
పై విలసిల్లు రంధ్రములబట్టి ప్రవేశమొనర్చి మాపుచున్
జీవుల యంగపాళికి గృశించిన వానికి మోదమిచ్చు భా
యావిభు సుస్రజాలము లనంత సుఖమ్ములు మాకు గూర్చుతన్.

ఉ. అండజపాళి నింగి పలయంబులు గట్టి పరిభ్రమింపగా
గండరగండడై యసురగర్వ మడంచుచు వాసవాశపై
నుండి పయోజషండముల నొక్క మొగిన్ వికసింప జేయు సూ
ర్యుండు కృపాబ్ధి దుర్మతను రూపడగించుచు నన్ను బ్రోచుతన్.

సీ. అఘజాలములకు బైగలరు వాడనుచు వే
దము లే మహాత్ము నామము నుతించు
నకులకెవ్వాని యాసనంబుగ గొంద
రంబుజ సాహచర్యము విధించి
రెవని నామము జపియించుచో బెదవుల
మాలిన్య మఖిలంబు మాయమగునొ
బంగారు రంగుతో బరగిన కేశమ్ము
లెవని దేహము నిండ నింపెసంగు

గీ. నత డహర్పతి సర్వ భూతాంతరాత్మ
సర్వలోకైకబంధువు సర్వసాక్షి
సూర్యనారాయణుడు కృపాశోభితు డయి
మమ్ము రక్షించుగాక శుభమ్ము లొసగి.

---



# గుడిమల్లం - శివాలయము

శ్రీ ఐ. కార్తికేయ శర్మ

[భారత పురావస్తు సర్వే రక్షణ, ఈశాన్య విభాగము, హైదరాబాదు — 7]



**చిత్రము—1**
**పరశురామేశ్వరాలయములోని శివలింగము పూర్వ రూపము (బాణ-చోలరాజులనాటి గర్భగుడి, పీఠిక మొదలైనవి).**
**(గుడిమల్లము 1973)**

గుడిమల్లమొక చిన్న గ్రామము. చిత్తూరు జిల్లా కాళహస్తి తాలూకాలో నున్నది. రేణిగుంట రైల్వేస్టేషనునుండి పాపానాయుడుపేటకు బస్సులో 10–కిలోమీటర్లు పోయి ఆపైని 3–కిలోమీటర్లు తూర్పుగా నడచినచో పై గ్రామమునకు చేరవచ్చును. ఈ వూరికీ నాటికిని రహదారి యేర్పడలేదు.

ఆంధ్రమున, బహుశ ఈ దేవాలయమును గూర్చి యే కొద్దిమందికో తప్ప తెలియదనే చెప్పవలసి యున్నది. శ్రీ గోపీనాథరావుగారను పురావస్తువేత్త 1911--12 లలో ఈ శివాలయమును దర్శించి గోడలపైని శాసనములను, లింగముపైనున్న శివ ప్రతిమను గూర్చి వివరంగా ప్రచురించిరి.[1] అటు తరువాత ఈ లింగముపైని వినూత్నమైన శివాకృతిని యెందఱో శాస్త్రవేత్తలు—ముఖ్యముగ శ్రీ ఆనంద కుమారస్వామి, జితేన్ద్రనాథ్ బెనర్జీవంటి మహనీయులు—శిల్ప చరిత్రలోనే తలమానికంగా భావించి క్రీ॥ పూ॥ 1–2 శతాబ్దాలకు చెందియుండవచ్చునని చెప్పియున్నారు. ఈ శైవ ప్రతిమ ఆగమ విశిష్ట దేశమున మరెక్కడను కానరాదు. ఇదిట్లుండ, యిటీవల, నేనీ దేవాలయపు (భారత పురావస్తుశాఖ తరఫున), శిథిలమైన భాగములను పునరుద్ధరించటం జరిగింది.[2] ఈ కార్యక్రమంలో కొన్ని నూతనాంశములు బయల్పడినవి. ఈ వ్యాసోద్దేశ్యమీ మహత్తర శివాలయమును గూర్చి విశదీకరించుటయే.

---

1. <u>ఎలిమెంట్స్ ఆఫ్ హిందూ ఐకొనాగ్రఫీ</u>, సంపుటి, II, భాగము, I, (Madras, 1914), పుటలు 65—71.

2. ఈ పనిలో నాకు పలువిధముల సహాయపడిన సర్వశ్రీ హనుమంతరావు (Technical Asis-tant), కొండారెడ్డి (Foreman works), ఎడ్విన్ (Photographer); రామిరెడ్డి (Draftsman) గార్లకు ఎంతేని ఋణపడియున్నాను. ఈ వ్యాసమున ప్రచురించిన ఛాయాచిత్రములు భారత పురావస్తు సర్వేక్షణకు చెందినవి.

స్థూలముగా దేవాలయ పలుభాగముల వివరింతును. వాటి కాలనిర్ణయమునుకూడ పేర్కొందును.

విశాలమైన ఈ దేవాలయ ప్రాంగణమున యెన్నియో చిన్న గుళ్ళున్నవి. అన్నింటిని చుట్టుచూ, ఆవలి ఇటుక ప్రాకారగోడ, నలువైపుల కలదు. ఈ ప్రాకారమునకు పడమటివైపు పెద్ద గోపుర ద్వారము కలదు. ఈ గోపురద్వారము, మరియు స్వామివారి అభిషేకజలమునకుగా కట్టిన భావి యాదవదేవరాయల కాలమునకు (క్రీ॥ శ॥ 13–14 శతాబ్ది) చెందినది.

ముఖ్యదేవాలయము — పరశురామేశ్వరస్వామి పేరున పిలవబడుచున్నది. ఈ ఆలయమునకు వాయవ్య దిశన అమ్మవారి దేవాలయ మున్నది. దాని నానుకొని దక్షిణమున వల్లీ–దేవసేనా సమేత కార్తికేయస్వామి గుడి కలదు. పై రెండును తూర్పు ద్వారమును కల్గి



చిత్రము – 2
గర్భగుడి త్రవ్వకములలో బయల్పడిన లింగ స్వరూపము. చుట్టూవున్న శిలాప్రాకార అవశేషములు. క్రీ. పూ. 1-2 శతాబ్ది.





చిత్రము – 2-అ
లింగపీఠములు, అపస్మార పురుషుడు, శిలా ప్రాకారము వగైరాలు. క్రీ. పూ. 1-2 శతాబ్ది.

యున్నవి. తూర్పు చివర నానుకొని సూర్యనారాయణుని దేవాలయము కలదు. ఈ చిన్న ఆలయములు, (బహుశ మరికొన్నివుండి శిథిలమై వుండవచ్చును), పరివార దేవతల గుళ్ళు, చక్కని శిల్పశైలి కల్గిన ప్రతిమలను కల్గియున్నవి. ఇవన్నియు బాణ–చోలరాజుల (క్రీ॥ శ॥ 9–12 శతాబ్దులు) కాలమునకు చెందినట్టివి.

ఇక ముఖ్య దేవాలయము గూర్చి వివరింతును. ఈ దేవాలయ గోడలపైని, రాతి పలకలపైని పెక్కు శాసనములు కలవు. ఇవి తరువాతి పల్లవులు, వారి సామంతులు గంగ పల్లవులు (క్రీ॥శ॥ 897–904,5) బాణ రాజులు, చోళరాజు విక్రమచోలుడు, రాజరాజు కాలమునకు చెందినవి. యాదవ దేవరాయల కాలమునకు చెందిన (క్రీ॥ శ॥ 1346) మరికొన్ని శాసనములు కూడ కానవచ్చుచున్నవి. విక్రమచోలుని కాలమున

(క్రీ॥ శ॥ 1126), దేవాలయమును పూర్తిగా తిరుగ కట్టినట్లు, రాతిలో కట్టడములు చేసినట్లు తెలియుచున్నది. దేవాలయములో విశాలమైన మహామండపము గర్భగుడి అవలివైపు దాని నానుకొని యెత్తైన రాతి ప్రాకారమును కలుపుచున్న అరుగు, నలుప్రక్కల ప్రదక్షిణమునకు వీలుగా స్తంభములపై శాల నిర్మింపబడెను. ఈ కాలమున మహామండపమునకు దక్షిణముగా ముఖ్యద్వారము, దానికి నేరుగా ప్రాకారమున గూడ కుడ్యస్తంభములతో చక్కని ద్వారశాలను యేర్పరచిరి.

గర్భగుడిమాత్రము గజపృష్ఠాకారము కల్గియున్నది. ముందున అర్థమండప మహామండపములు కలవు. అన్నియును తూర్పు ముఖద్వారములు కలిగియున్నవి. గర్భగుడి, అర్థ — మహామండపములకన్న, చాల పల్లములో నున్నది. అందువల్లనే కాబోలు ఈ గ్రామనామము గుడిపల్లమని కూడ వాడుకలో నుండెను. శివుని ప్రతిమ, యవ్వనుడైన మల్లునిబోలి యున్నందున గ్రామనామము గుడిమల్లమని ప్రతీతి. కాని శాసనములలో ఈ నామమెక్కడను కానరాదు. గ్రామము విప్రపీఠముగా పేర్కొనబడినది. తమిళములో విప్పిరప్పీడు అని పిలవబడియుండెను. గుడిపేరు పరశురామేశ్వరాలయముగా చెప్పబడినది. చిత్రమేమన ఈ ఆలయము నెవ్వరు ప్రతిష్ఠించిరో, యెప్పుడు జరిగెనో, మొట్టమొదటి నామ మెట్టిదో తెలియుట లేదు. శాసనములన్నియు స్వామి కొనర్చిన నిత్యసేవలు ధూపదీప నైవేద్యములకు కావలసిన భూ, ధన, ధాన్యదానములను మాత్రమే తెలుపుచున్నవి.

ఇటీవలి (1973), పరిశోధనల ఫలితంగా ఈ దేవాలయ మొక పురాతన అవశేషములున్న దిబ్బపై యున్నట్లు తేలినది. ఈ దిబ్బ తూర్పు—పడమర భాగములలో క్రీ॥ పూ॥ 2—3 శతాబ్దములకు చెందిన మృణ్మయపాత్రలు— నలుపు, యెరుపు—నునుపు ప్రకాశించనట్టివి, క్రీ॥ శ॥ 1—3 శతాబ్దములకు చెందిన ఆంధ్ర శాతవాహన కాలంనాటి ఎరుపు జిలుగు కలిగి తెల్లటి రంగుతో చిత్రితములైన పాత్రావశేషములు, పెద్ద ఇటుకలు (42×21×6 Cms) లభ్యమైనవి.

గర్భగుడి ఈ అవశేష స్థలమునకు మధ్యలో



చిత్రము—3

ఉజ్జయినిలో లభ్యమైన రాగి నాణెములపైని శివలింగము: శ్రీ జితేన్ద్రనాథ్ బెనర్జీ, ది డెవలప్‌మెంట్ ఆఫ్ హిందూ ఐకొనాగ్రఫీ, (మూడవ ముద్రణ 1974), చిత్రము-1. సౌజన్యంతో.

నుండుట. ఇదివరలో విజ్ఞులు తలంచినట్లు, క్రీ॥పూ॥ సంబంధించిన శివలింగమును కల్గియుండుటను బట్టి క్రీ॥ పూర్వపు ప్రతిష్ఠగానే భావింపవచ్చును. కాని ఇప్పుడున్న దేవాలయ కట్టడము మాత్రము క్రీ॥ శ॥ 9 వ శతాబ్దముకన్న ముందున్నట్లు కనబడదు. గర్భాలయమున ఈ శతాబ్దమునకు చెందిన రాతి పరుపును, చతురస్రాకారపు పీఠము (రెండు రాళ్లను జోడించి చేసినది), (చూడుడు చిత్రము—1) తీసి లోపలికి త్రవ్వకములను చేసితిమి. లింగము క్రింద భాగముననున్న రాక్షసుడు (అపస్మార పురుషుడు), పూర్తిగా కానరానందున కూడ ఈ ఉత్ఖననము, అత్యంత అవసరమైనది కూడ. ఈ త్రవ్వక ఫలితములను క్లుప్తంగా వివరింతును.

1. ముఖ్యదేవాలయములోని మూల విరాట్టు మొట్టమొదట—అనగా క్రీ॥ పూ॥ 1—2 శతాబ్దములలో ప్రతిష్ఠింపబడెను. గుండ్రని రెండు రాతి పీఠములలో (యోని), లింగము (అడుగు భాగమున చతురస్రాకారమైన స్తంభము), అమర్చబడెను. (చూడుడు చిత్రము—2). ఈ పీఠములు చాల నునుపుగా, లింగమెంత సుందరముగా నున్నదో, అట్లున్నవి. కాని, రాయి వేరు—ఇసుకరాయి. ఈ యోని నిర్మాణము కేవలము స్త్రీ యోనిని బోలియుండుట చాల చిత్రముగ నున్నది. పీఠము చుట్టును 1.35 మీటర్లు పొడవుతో నలుప్రక్కల చతురస్రాకారపు శిలా ప్రాకారము నిర్మింపబడెను (చూడుడు చిత్రము—3). ఈ ప్రాకార

చక్కడము, స్తంభములశైలి, అమరావతి—మధురల స్తూపవేదిక స్తంభములను బోలియుండుట గమ నార్హము. ఈ స్తంభ ఫలకములపైని వివిధ రీతుల పద్మములు, పూలు, చక్రములు మలచియున్నవి. ఈ కాలమున దేవాలయ కట్టడము లేదు. కేవలము సవేదిక లింగమై ఆరుబయలు పూజింపబడునట్లు తెలియుచున్నది. ఈ లింగము, దానిపైని శివుని ప్రతిమ అతిప్రాచీనమైన శైవ పూజా విధానమును తెలుపుటయే గాక దక్షిణమున శైవ మత్యంత పురాతనమైనట్టిదని చాటి చెప్పుటకొక ప్రబలమైన యాధారమైనది. ఉజ్జయినిలో లభ్యమైన రాగి నాణెములపై (క్రీ॥ పూ॥ 2–3 శతాబ్దములకు చెందిన) గుడిమల్లము లింగమువలెనున్న చిత్రములు కలవు (చిత్రము—3), అట్లే మధుర మ్యూజియంలో క్రీ॥ పూ॥ 1 వ శతాబ్దికి చెందిన శిల్పము ఈ లింగమును బోలిన శిల్పమును చూపుచున్నది (చిత్రము—4). ఇది చెట్టు క్రింద యెత్తైన ఆరుబయట వేదికలోనుంచి, పూజింపబడుచున్న లింగముగా గోచరించును. ఈ సామ్యములు కొంతవరకే సరిపోవును. గుడిమల్లము లోని శివుని ప్రతిమ మాత్రం శివలింగములపై మరెక్కడను కానరాదు.

ఈ ప్రతిమను గూర్చి మరికొంత వివరించుట ముఖ్యము. లింగము ఊర్ధ్వరేతయైన మానవుని లింగమెట్లుండునో అట్లు చెక్కబడినది. (చూడుడు



చిత్రము –4

మధుర మ్యూజియంలోని శిల్పము. క్రీ పూ. 1 వ శతాబ్ది. శ్రీ అగ్రవాలా, గుప్త టెంపుల్ ఆర్కిటెక్చరు, (1968), చిత్రము. 11-అ, సౌజన్యంతో.

లింగాగ్రము—చిత్రము—2) నరములవలె కాననగును. లింగ మధ్యభాగము. కావున శివుని ఇక్కడ 'లింగిగా' చూపబడెననుట విదితము. శివుని రూపము, లింగ ముఖభాగమున, చాల చక్కని యవ్వనుడుగా చూపడం జరిగినది. స్వామి రెండు కన్నులు, నాసికాగ్రమును చూచుటనుబట్టి విరూపాక్షుడుగను, యోగ లేక ధ్యాన పురుషుడుగను చెప్పకొనవచ్చును. యెడమ భుజము నానుకొని పరశు వున్నది. చేతిలో కుండ, కుడిచేతిలో పొట్టేలు (మృగము—బహుశ చర్మమే కాబోలు), తలక్రిందుగా పట్టుకొనియున్నాడు. ఇచ్చట శివుని భిక్షాటనమూర్తిగా పోల్చుకొనవచ్చును. చక్కని ధోవతి మేఖలతో బంధించియున్నను పురుషుని లింగము వెలికి యున్నట్లు చూపబడియుండుట చిత్రముగా నున్నది. (చూడుడు చిత్రము—2 అ). ఇచ్చట మనము శివుని రుద్రుణ్ణిగా శిష్టిన దేవుడిగా వుద్దేశింపబడెననుట సమంజసము. ఋగ్వేద రుద్రునికి జంధ్యము లేదు. ఈ ప్రతిమలో కూడ యజ్ఞోపవీతము కానరాదు. పైగా స్వామి చంమూర్తి. అపస్మార పురుషుని భుజ స్కంధములపై నున్నాడు కాన, లింగము వ్రేలాడుచున్నట్లు చాల సాధారణముగా చూపబడెను. కాని, గమనింపుడు, శివలింగమంతయు తీసికొన్నచో ఊర్ధ్వరేతమనే చెప్పక తప్పదు. శివుని తలపాగ చిత్రముగా నున్నది, పట్టబంధముతో నొసలు పైకిగా కట్టబడినది. లేతతాటిఆకు అల్లి చుట్టినట్లున్నది. దీనినిబట్టి దక్షిణామూర్తిగానో లేక కపర్దిగనో యుద్దేశింపబడినాడని చెప్పనగును.

ఇట్లీ చిత్రమైన ప్రతిమ శివుని పెక్కు స్వరూపముల నొకే మూర్తిలో చూపుచున్నది. శైవాగమములో ప్రత్యేక స్థానమును బొందుచున్నది. ఈ విధంగా పలురూపముల నొక్క విగ్రహములోనే పొందుపరచి చూపిన శిల్పము మరెక్కడను కానరాదు. ఇట్టి సంయుక్త ప్రతిమయే, తరువాత వివిధ రూపములలో ప్రత్యేకముగా శివుని చూపుటకు దోహదమై యుండునని నా యభిమతము. యేలనన ఈ దేవాలయమును పూర్తిగా కట్టించి, పెద్దదిగా చేసిన

తరువాత—పల్లవులు-చోళులు—బాణులు వివిధ రూప ములలో శివుని ప్రతిమలను విడివిడిగా (దక్షిణామూర్తి, కంకాలమూర్తి, పశుపతమూర్తి, వీణాధర, ఉమా సహితమూర్తి) దేవకోష్ఠములలో నుంచిరి.

ఈ వేదిక లింగము చుట్టునుచేసిన త్రవ్వకము లలో క్రీ॥ శ॥ 2–3 శతాబ్దములకు చెందినట్టి, ఇటుకలతో కట్టిన అర్ధగోళాకారపు గుడి—గోడకూడ బయల్పడినది. దీనినిబట్టి క్రీ॥ శ॥ 2---3 శతాబ్ద ములలో బహుశ శాతవాహన — ఇక్ష్వాకుల కాలమున ఈ లింగము చుట్టును దేవాలయము కట్టియుండ వచ్చును. ఈ ఆలయము శిథిలమగుటచే, పల్లవ— బాణ—చోళులు దీనిని రాతితో, అదే ఆకృతిలో విశాల ముగా కట్టి, కొన్ని మార్పులు, కూర్పులు గావించిరి. అప్పటి వాస్తువునుబట్టి లింగము చుట్టునున్న వేది కను, గుండ్రని యోని పీఠమును, పూడ్చివేయటం జరిగినది. చతురస్రమైన చిన్న పీఠికనుమాత్రముచేసి అభిషేకజలము పోవుటకు ప్రణాళిని గావించిరి. ఇట్లే దేవాలయపు త్రవ్వకములు ఫలితంగా వివిధ ఆరాధనా పద్ధతులను, కట్టడ శైలిలోని మార్పులను వెలికి తెచ్చుటయేకాక అత్యంత పురాతనమైన చిత్రమైన శివలింగ ప్రతిమ క్రీ॥ పూ॥ 1—2 శతాబ్దములలో ప్రతిష్ఠితమై ఇప్పటివరకు పూజలోనుండి నటుల తేలినది. ఆంధ్రమున శైవాగమము, ఉత్తరదేశము నెంతప్రాచీనమో, అట్లేనని గూడ నిర్ధారణ యగు చున్నది బౌద్ధకట్టడ మెంత ప్రాచీనమైనవో వివిధ రీతుల వృద్ధిచెందెనో — అట్లే శైవ — వైష్ణవ దేవాలయములు కూడనని గట్టిగా చెప్పవచ్చును. ప్రాచీన వాస్తుశాస్త్రము నిట్లు పలుమతములు — వర్ణములు అనాదిగా వుపయోగించుకొన్నవని భావింపవచ్చును.

'ఓం నమః శివాయ'

---



# పుడమి పోలిక

డా॥ నాయని కృష్ణకుమారి

ఇంకా ఎక్కడో ఉన్నావా!
దూరంగా ఉత్తరాన
ఒత్తైన మబ్బుల దొంతర
తాజాగా స్వేచ్ఛగా
తియ్యని నీటిగాలి తొందర

సన్నజాజులు
కలకలా విరిసే సమయం
నిన్నుకూడా మేల్కొలపలేదా!

ఆర్ద్రతా పాటా ప్రేమా
అన్నీ నీ కోసమే చూస్తున్నాయి.
పైన నల్లగా గాఢంగా
ఆకాశంలో చెలగే మబ్బులు,
బలంగా వియోగంతో మోసే
నీటిపిట్టల అరుపులు;
నా గుండెలో గూడు కట్టుకొన్న
నాశం లేని ప్రేమ!
లన్నీ నీ కోసమే
కలవరిస్తున్నాయి!

ప్రకృతిని ధిక్కరించలేనని
మన అదృష్టాలను
వంచిస్తావా!
నీ ఆత్మకోసం కాదూ
నా ప్రేమ రూపు తాల్చింది!
నీ అస్తిత్వమంతా
నా కళ్లకోసమనే కాదూ!

మత్తుగా పడి ఉన్నట్లు
నా ముందు నాటకా లెందుకు
నీవుగా నన్ను మలచుకున్న
నా ముందే!

చాతకం లాగా చేతాన్ని
సర్వ సన్నద్ధం చేసుకున్నాను

పుడమి పోలికవటి
సముద్రమంత ఆశను
నిలువెల్లా తెరలించుకుంటున్నాను
అదే పనిగా ఎదురు చూస్తున్నాను.

ఇంతకూ
ఎక్కడున్నావు నువ్వు!
వానాకాలపు కమ్మని
తొలి నీటి చుక్కవైన నువ్వు!

———

# విజయనగర చరిత్ర

## [ రెండవ భాగము ]

### డా. నేలటూరు వెంకటరమణయ్య

(గత సంచిక తరువాయి)

ఆరంభమునుండియు విజాపుర విద్యానగర రాజ్యముల మధ్య వైరము పెరుగుచు యుద్ధమే పరిపాటి యైనను కారణము చూపక కృష్ణరాయలు దండు వెడల లేదు. రాయలు కొలువున సయ్యిదు మర్కరను మహమ్మదీయు డొకడుండెను. రాయలు వానిచేతికి నలువదివేల పర్దావు (వరహా)ల నిచ్చి గోవాకు బోయి గుఱ్ఱముల గొనితెమ్మని బంపెను. వాడా ధనముతో పరారియైపోయి యాదిల్ఖాను రాజ్యమున తలదాచు కొనెను. ఆ సయ్యిదునుబట్టి తనకడ కంపుమని రాయ లాదిల్ఖానుని కొక యుత్తరము వ్రాసి యంపెను; కాని యాదిల్ఖాను దండులకీయ కొనక వానికి దాబులను సేవు పట్టణమును జాగీరుగనిచ్చి యచటి కంపివేసి తన రాజ్యమునం దట్టి వారెవ్వరును లేరని రాయలకు ప్రత్యుత్తర మంపెను. మర్కరంతట మాయమై పోయెను. వానికడనుండిన ధనమంతటిని హరించి యాదిల్ఖాను డతని జంపించెనను కింవదంతి యొకటి దేశమందు పర్వుకొనెను.

ఆదిల్ఖానుని యవజ్ఞతను నెపము జేసికొని కృష్ణరాయ లాతనిపై దండయాత్రను ప్రకటించి ప్రచండ సైన్యముతో బయలువెడలి రాయచూరంతర్వేది మీదికి నడచెను. న్యూనిజుయొక్క అంచన ప్రకారము రాయలసైన్యము నందప్పు డేడులక్షల కాల్బలమును, ముప్పదిరెండువేల యాశ్వికులును, నైదువందలయేబదియొక్క మదగజములును నుండెను. అంతియకాదు ఇంతటి మహాసైన్యము దండయాత్ర నడచునపుడు వలసిన వస్తుసామగ్రులను నితర పదార్థములను సరఫరా సేయుటకొఱకు వర్తకుల బేరారును, సేవ జేయుట కొఱకు రజకక్షురకాది యాడిగములవారును, విలాసినీ బృందమును లెక్కకు మిక్కుటమై యుండెను. ఈ మహాసేనను నడుపుకొనిపోయిన దండనాయక ప్రముఖులను న్యూనిజు పేర్కొనియున్నాడు. వారెవరనగా:
(1) కామా నాయకుడు (2) త్రియంబకరావు
(3) తిమ్మప్ప నాయకుడు (4) అదెప్ప నాయకుడు
(5) కొండమరుసు (6) కొమర (7) సాళువ గోవిందరాజు (8) కొమార వీరయ—వీరితోపాటు రాయల కొజ్జాలు ముగ్గురును, నడపమోపరియు నిజ దళములతో యుద్ధమునకు నడచిరి. పై పేర్కొనిన వారే కాక క్రీస్త్వాన్‌డిఫిగ్గైరెడో యను పోర్చుగీసు వ్యాపారి యొకడును, మాధవవర్మ వంశజుడైన కంటకు రాజు సింగరాజును, నాపత్యహోయుడను దాక్షిణాత్య చోళ మండల బ్రాహ్మణ శూరుడును నీ దండయాత్ర యందు పాల్గొనిరి.

క్రమ ప్రయాణముల దరలిపోయి యా మహా సైన్యము రాయచూరు దుర్గము చుట్టును ముట్టడి దిగెను. అయినను రాయల శిబిరము కోటకు తూర్పు వైపున ప్రతిష్ఠిత మగుటచేత యుద్ధకార్యము ముమ్మరముగ నచటనే సాగినది. రాయల శిబిరము కోట వంటిది. దాని విన్యాసము న్యూనిజు చక్కగా వర్ణించియున్నాడు. రాయలవారి గుడారము రాజధాని లోని రాజమందిరమును బోలియుండెను. దాని చుట్టు నొక కంపకోట పరివేష్టించి యుండెను. అందు రాక పోకల కొక్కటే మార్గము గలదు. ఆ యావరణము నందు రాయలవారును వారి కూడిగముసేయు పరి చారకులును నివసించెడివారు. కంపకోట చుట్టును నంగరక్షక బలగమును నగరి యుద్యోగస్తులును విడిసి

యుండిరి. వారి కవ్వలితట్టు నాయకుల పాళెములను వానికి వేగులవారి విడిదలు నుండెడివి. వారి కవ్వలదండు చాకళ్ల గుడార్లు గలవు. పట్టణములందువలె శిబిరమునం దెల్లెడలను వీధులు చక్కగా దీర్చియుండెడివి. ఒక్కొక్క నాయకుని పాళెమందును నొక యంగడి వీధి కలదు. అందు నానా విధాహార పదార్థములును క్రయమునకు లభించెడివి. వానితోపాటు వస్త్రములు నగలు, రత్నములు, భూషణములు, పరిమళ ద్రవ్యములును దొరకెడివి. ఇది కాక గుఱ్ఱములకును యేనుగులకును నానావిధ భారవాహ జంతువర్గమునకు వలసిన పచ్చిక గడ్డి మున్నగు మేత పదార్థములు పుష్కలముగ లభించుటకు దగిన యేర్పాట్లన్నియు జక్కగ నమర్చబడి యుండినవి.

కృష్ణదేవరాయలు దండెత్తివచ్చి రాయచూరును ముట్టడించి యున్నాడను వార్త తెలియవచ్చినంతట నె యిస్మాయిలా దిల్ఖానుడు ఫౌజులను సమకూర్చుకొని వచ్చి కృష్ణానదిని దాటి రాయచూరికి కొంతదూరమున దండు దిగెను. అటు పిమ్మట ఉభయపక్షములవారికిని గొప్ప యుద్ధము సంఘటిల్లినది. ఈ యుద్ధ విశేషములను రాయలకు సమకాలికుడును యుద్ధమును గనులార గాంచిన వాడును నగు పోర్చుగీసు వ్యాపారి న్యూనిజును విశాపుర సంస్థానమున కాశ్రితుడును, యుద్ధమున కెనుబది యేండ్లకు తరువాత మహమ్మదీయ చరిత్రను రచియించిన ఫెరిస్తాయు చెరియొక విధమున వర్ణించియున్నారు. సంగ్రహముగ న్యూనిజు వివరించిన యుద్ధ విశేషము లివి:—ఆదిల్ఖానుడు తన బలములను సమకూర్చుకొని వచ్చి కృష్ణానదియొడ్డున నది దాటు రేవునకు సమీపమున శిబిరమును స్థాపించెను. కృష్ణరాయలా రేవున నదిని దాటి తనపై గవియ వచ్చుననియు నపు డాతని నటకాయించి సులభముగ నోడించ వచ్చుననియు దలచెను. కాని కృష్ణరాయ లట్లు సేయక నిజస్కంధావారమున నిచ్చట దైమిన్నక యుండెను. అంతట నాదిల్ఖానుడు కృష్ణను దాటి రాయచూరునకు వాయవ్యమున బదునెనిమిది మైళ్ళ దూరమున విడిసెను. అతని విడిపట్టు గొబ్బూరు గ్రామమని లక్ష్మీనారాయణ తన సంగీత సూర్యోదయమున జెప్పియున్నాడు. మొట్టమొదట నతడు తన శిబిరమును సంరక్షించుటకు దగిన యేర్పాటులను గావించెను. శిబిరము చుట్టును కందకము ద్రవ్వించి కరగోడనెత్తించి, ముంగలి భాగమున ఫిరంగులను బారుదీర్చి, దళములను దత్తదర్వ స్థానముల నిల్పి శత్రులు బైకొనినప్పు డెట్లు కార్యము నడపవలయునో తెలియజెప్పెను. ఒకవేళ రాయదళము లొక్కసారి హఠాత్తున వచ్చి పైబడిన వారిపై బేల్చి నాశముజేయుట ఫిరంగులును, బాణసంచును సిద్ధము చేసి యుంచెను.

ఆదిలానుడు నదిని దాటివచ్చి గొబ్బూరుదగ్గర దండుదిగి యున్నాడను వార్త విన్నంతట కృష్ణరాయ లతని దారసిల్లు ప్రయత్నములు జేసెను. తన సైన్యము నంతటిని యేడు వాహినులుగ విభజించి యందు రెంటిని యెలగోలు, బలముగ నేర్పఱచి శ్రీరంగపట్టణ రాజ్యపాలకుడైన కుమారవీర యను వానిని నాయకునిగ నియమించి, యాదిల్ఖానుని స్కంధావారమున కొక పరుగు దూరమున విడిసియుండుమని యాజ్ఞాపించెను. తక్కిన యైదు వాహినులతో రాయలు వారి పిరుద చనియెను. గమ్యస్థానమును చేరిన వెంటనే రాయలు సైనికుల కందరికిని—ఆయుధము




లను ధరించి యాజ్ఞయైన వెంటనే యుద్ధమునకు సంసిద్ధులై యుండుడని ముదలయిడెను. యుద్ధము క్రీ. శ. 1520 మేనెల 19 తేది శనివారమునా దుష్కాలమున ప్రారంభమైనది. రాయలవారి యాజ్ఞానుసారము కుమారవీరయ ఫౌజులతో శత్రుసైన్యముపై నరువడించి తఱిమి నఱుమాడుచు ముందుకుసాగి వారి స్కంధావారమును బరివేష్టించి యుండు కందకపు గోడ నెక్కెను. ఆదిల్ఖానుడు నిజస్కంధారముపై బడుచుండు శత్రువులనుగాంచి ఫిరంగులను బారుచేసి గాల్ప నాజ్ఞాపించెను. ఆ ఫిరంగులు కుమారవీరయ దళమును నిర్మూలము సేయ గడగినవి. ఆ యగ్ని వర్షపాతమునకు నిలుపోపక రాయసైన్యము దిరుగువడి పాఱజొచ్చెను. వారిని వెన్నంటి తఱుముచు తురకలు చేజిక్కిన వారి

నెల్ల ఖండతుండెములు సేయగడగిరి. పరాజయము తప్పదని యందఱకు దోచినది. కాని కృష్ణరాయ లతి ధైర్యుడు. పాఱివచ్చుచున్న నిజసైనికులగని కోప దందహ్యమానచిత్తుడై, 'స్వామి ద్రోహులార! ఏల పఱతెంచెదరు ? పఱతెంచి వచ్చినను మృత్యువు వెన్నాడక మానదు. పుట్టినవారు గిట్టక తప్పదు. పేరుప్రఖ్యాతులను దగులవెట్టి యపకీర్తి పాలైన మనుట నధమ జీవనముకంటె వీరోచిత మరణ శయ్యయె మేలుగాదా ? మాకు బాసటయై నిల్వజాలిన యోధు లెవ్వరును లేరా? యని యుద్ఘోషించెను. రాయలవారి నోటినుండి యీ మాటలు వెలువడెనో లేదో తక్షణమే దళనాయకులును, దొరలును, శూరు లును పెక్కండ్రాతని చుట్టును మూగి 'మహాప్రభో! మామొరలు యేలినవారివి, పనిగొనుడు' అని విన్నప మొనర్చిరి. రాయలవారు మరల నిట్లనిరి. 'లోకము లోని భూపాలుర కెల్ల నధికుడగు మేటిని చంపితినని యాదిల్ఖానుడు రజ్జుతాడు కాలమాసన్నమైన నగుగాక! అతని పరాభూతుని గావించితినని ప్రేలుట కెన్న డును అవసరము కలుగబోదు' అని తన వ్రేలి ముద్దు టుంగరమును దీసి యొక యాడిగీని చేతికిచ్చి తనకు వీరస్వర్గప్రాప్తి కలిగినచో దానిని రాణివాసమునకు నూపవలయుననియు నంతట వారు కులాచార ప్రకా రము సహగమన కార్యము నడుపుదురనియు నానతిచ్చి గుఱ్ఱము నెక్కి శత్రువుల నెదుర్కొనజాలక వెన్నుజూపి పరుగిడి వచ్చుచుండువారి యందొక్కనినైన విడువక దయాదాక్షిణ్యములను వీడి సంహరింపవలయునని యాజ్ఞ చేసి తక్కిన యేదు వాహినుల సైన్యములు వెంట నడువ శత్రువుల కభిముఖుడై యుద్ధమునకు దరలెను. ఈ యాజ్ఞ పరాజయమును జయముగ మార్చినది. పాఱి వచ్చువారు తమవారిచే యుద్ధమరణమందుట కంటె శత్రులను బొడిచి వీరస్వర్గమున కెక్కుట మేలని యెంచి వెనుకకు తిరిగి పోటుచూపిరి. యుద్ధ వ్యూహ క్రమము ననుసరింపక బారులు వీడి తఱుముచు వచ్చు చుండిన తురకలకు హఠాత్తుగ వా రెదురు తిరిగి పైగవయుట వారితో వ్యూహము దప్పక తార్కొని పోటు చూపుటయు దుర్భరము కాగా వెన్నుచూపి పలా యనము సేయగడగిరి. రాయసైనికులు వారిని వెను కొని నుఱుమాడ జొచ్చిరి. ఇందు మూలమున మహమ్మ దీయ సైన్యము కలగుండు వడినది. భయభ్రాంతులై యెవ్వరి మార్గమున వారు బ్రదుకు జీవుడాయని పాఱ జొచ్చిరి. ఇస్మాయి లాదిల్ఖానుని సర్వసేనాధిపతి యైన సలాబత్ఖానుని కొక్కనికి తప్ప మఱి యెవ్వ రికిని హిందువుల నెదిరించవలయునను బుద్ధి పుట్ట దాయెను. అతడు సైన్యమంతటిని మరల నేకముజేసి శత్రులపై బురికొల్ప బ్రయత్నము జేసెను గాని యాతని మాటల నెవ్వరు నాలకించరైరి. తుద కతడు తన పరివారమును సమకూర్చుకొని శత్రుల మార్కొని నిర్వక్ర పరాక్రమముతో ఘోరముగ బోరెను; కాని యత డొక్కడేమి సేయగలడు? పరిజను లందఱును నిహతులు కాగా నతడును శత్రులకు పట్టువడెను.

ఈ మహా సంగ్రామమునం దిస్మాయిలా లాదిల్ఖాను డేమిచేసెనో కనుగొందము. ఆతడు యుద్ధభూమియం దడుగు పెట్టనేలేదనియు, ఆస్థాన బిరుదాంకితు డైన సుపోలారిజచే సంరక్షితుడై యుండి తన బల ములు సంపూర్ణ పరాజయమును బొందెనని యెఱిది యతని సలహా ప్రకారము శిబిరమును విడిచి కృష్ణానగి దక్షిణ తటమందలి కొండలను జొట్టి నిజరాజ్యమునకు పాఱిపోయెను. కృష్ణరాయలంతట యవనస్కంధావార మును ప్రవేశించి యందలి సమస్త వస్తునిచయమును చూఱగొనెను. సలాబత్ఖానునితో గూడ యాదిల్ఖానుని దండనాయకు లేవురు జీవగ్రాహముగ పట్టువడిరి. నాలుగువేల హయగుమంజి గుఱ్ఱములును, నూరు మద గజములును, నన్నూఱు పెద్ద ఫిరంగులును, పెక్కు చిన్న ఫిరంగులును తొమ్మిదివందల ఫిరంగి బండ్లును, బహు విధ గుడారములును హస్తగతమాయెను. ఇది గాక యసంఖ్యాభారవాహాశ్వ వృషభాది జంతు వర్గమును పరిచార పరిచారికా సమూహమును చేజిక్కెను. కృష్ణ రాయలవారి యాజ్ఞానుసారము స్త్రీ లనేకులు బంధవిము క్తులై వారి స్వస్థానములకు బోయిచేరిరి. రణరంగ మున మడిసి స్వపక్షయోధులు సహస్రాధిక సంఖ్యా కులకు దహనాదిక్రియలను జేయించెను.

ఇది న్యూనిజు వర్ణించిన గొబ్బూరు యుద్ధ క్రమము. ఫెరిష్టా వేరొక విధముగ వివరించియున్నాడు. రాయచూరు మొదలు దుర్గముల నాక్రమించుకొన వలయునని ఇస్మాయిలాదిలానుడు దండయాత్ర సన్నాహములు సేయగడగెను. అది విని రాయలు యేబదివేల గుఱ్ఱములను గొప్ప కాల్బలముతో గూడిన

ప్రచండ సైన్యముతో వచ్చి కృష్ణాతీరమున విడిసి నదిని దాటు రేవుల నన్నిటిని అరికట్టెను. ఆదిల్‌ఖాను డాతని నెదుర్చుట కేడువేల గుఱ్ఱపు దళముతో వచ్చి హిందువుల శిబిరమున కెదుట కృష్ణ కవ్వలి యొడ్డున విడిసి నది నుత్తరించుటకు తెప్పలను తయారు సేయుచుండి వేచియుండెను; కాని యొక నాడు మధుపానమత్తుడై తెప్పలింకను సిద్ధము గాకుండినను నెవ్వరికి తన యుద్దేశము నెఱుకపఱచక యేనుగనెక్కి శత్రు శిబిరమున కెదుట నదిని దాట దొడగి యప్పటికి సిద్ధమై యుండిన పడవలలో నెందఱు సైనికులు పట్టిననందఱు నదిని దాటవలయు ననియు దక్కినవా రేనుగుల మీదనెక్కి రావలయునని యాజ్ఞాపించెను. ఈ యాజ్ఞ చొప్పన సేనయందు కొంతభాగము నదిని దాటినది. వారి సంఖ్య రెండువేలు. అంతట రాయసైన్యమత్యంతాటోపముతో వారిమీద గవసెను. కాని మహమ్మదీయులు దృఢచిత్తులై పోటు చూపి విజయనగర సర్వసేనాధిపతియైన సంగతరాయలు మున్నగు వారిని సహస్ర సంఖ్యాకులను హతము గావించిరి. కాని ఫిరంగులు మొదలయిన హిందువుల యాగ్నేయాయుధముల ప్రయోగమువలన వారిలో జాల మంది మడిసిరి. తక్కినవారు తప్పించుకొన దలచి నది ప్రవాహమున బడి చచ్చిరి. ఆదిల్ఖానుడు కొందఱను చరులతో నేనుగులనెక్కి యవ్వలి గట్టునకు పాఱి పోయెను; అసద్ఖానులారి సలహా ప్రకార మచట నిలువక నిజ రాజధానికి పోయి చేరెను.

న్యూనిజు ఫెరిష్టాలు వివరించిన యుద్ధ వృత్తాంతముల నొండొంటితో పోల్చి చూడగా ముఖ్యాంశములందు నాల్గింటి యందు తప్ప మఱి యెందును వారి కైకమత్యము గానరాదు. ఆ ముఖ్యాంశము లివి. 1) ఆదిల్ఖాను విజయనగర రాయలతో యుద్ధము సేయుట కొఱకు కృష్ణానదిని దాటి వచ్చుట. 2) అతడు యుద్ధమునం దోటువడి యేనుగనెక్కి పాఱి పోవుట. 3) ఓడిపోఱు నతని సైనికులు బహుళముగ గృష్ణాప్రవంతి యందు మునిగి చచ్చుట. 4) యుద్ధానంతర మాదిల్ఖాను డసద్ఖాను లారీలయొక్క సలహా ప్రకారము ప్రవర్తించుట. ఈ నాలుగంశములు విడిచిన తక్కిన యుద్ధ విశేషములను వీరు వేఱియొక విధముగ వివరించియున్నారు. వీరియందు దెవ్వరిది సత్య మైనదో కనుగొందము. చక్కగా విచారించి చూచిన ఫెరిష్టా వ్రాతకంటె న్యూనిజు రచన యన్నివిధముల వాస్తవికమని చెప్పవలసి యున్నది. న్యూనిజు ఫెరిష్టా లకు గల భేదమునకు ముఖ్యకారణములు రెండు కాన వచ్చుచున్నవి. న్యూనిజు సమకాలిక రచయిత. కృష్ణ రాయల కాలమున విజయనగరమునకు తఱచుగ వచ్చుచు బోవుచుండినవాడు. రాయచూరు దండయాత్రయందు రాయల శిబిరమునందుండి యుద్ధకార్యము నంతటిని కనులార గాంచిన ప్రత్యక్ష ద్రష్ట. ఫెరిష్టా యుద్ధము నడచిన తరువాత యెనుబది తొంబదియేండ్లప్పుడు విజాపురమున గూర్చుండి చరిత్ర రచన గావించిన యర్వాచీనుడు. అతనికి విజయనగర చరిత్ర తెలియదు. తెలిసికొన నతడు ప్రయత్నము జేసినట్లగపడదు. కావున నతడు బహమనీ సుల్తానుల చరిత్రయు వారి యధి కారమునకు వారసులైన దక్కనీ పంచపాదుశాహుల వృత్తాంతమును వివరించునపుడు విజయనగర విషయ ప్రస్తావము వచ్చినపుడెల్ల కుంతీపుత్రో వినాయకః యను న్యాయము ననుసరించి తన ప్రతిభకొలది గాథల ననేకము గల్పించినాడు. విజయనగర చరిత్రాధ్యాపకుల కిది యంతయు నొక పురాణమని చెప్పవలసిన యావశ్య కత లేదు. మఱియు నజ్ఞానముతోపాటు జాతిమతాభి మానము లతని తప్పుదారుల కీడ్చినవి. మహమ్మ దీయుల పరువుప్రతిష్టలను గాపాడవలయుననియు, దన కాశ్రయమొసగిన యాదిల్ఖాను పూర్వుల కీర్తి ప్రతాపములు నిష్కళంకమైనవని నిరూపించవలయు ననియు నాతని దృఢసంకల్పము. కావున మహమ్మ దీయులకును నందును ముఖ్యముగ నాదిల్షాహి రాజుల కును దుర్యశమును దెచ్చు చరిత్రాంశములను సాధ్య మైనంతవఱకును సంపూర్ణముగ గప్పిపుచ్చుటయో విధిలేక చెప్పవలసినప్పుడు మసిబూసి మారేడుకాయ నేరేడుకాయ యనిపించుటయో యతనికి కర్తవ్య మాయెను. ఈ కారణమువలన నతడెన్నియో యబద్ధ గాథలను గల్పించెను. రాయలచే పరిపూర్ణ పరాజితుడై రాయచూరు వంటి ప్రధాన దుర్గమును గోల్పోవుట యిస్మాయిలాదిల్ఖానుని యశక్తతను వెల్లడి పఱచునని యెంచి దానిని గప్పిపుచ్చుటకు కథను గల్పించెను. దండయాత్ర ముందు రాయచూరు రాయల క్రింద యుండెననియు యబద్ధమాడినాడు. ఇస్మాయిలా దిల్‌ఖానునిచే కల్లుద్రావించి మత్తచిత్తుని గావించెను,

అంతటితో తృప్తినందక యాతని సైన్య సంఖ్యా నల్పాల్పము గావించినాడు. ఆ యల్పసంఖ్యాకములో గూడ సగబాలిని నదిని దాటనీయక యవ్వలిగట్టుననే నిల్పినాడు. చిన్న దండుతో మధుపానోన్మత్తుడై ప్రబల సైన్యముకుత్తుడై యుండిన రాయలపై గవయుటవలన పరాజితుడాయెనా —లేనియెడల నతడు పరాజయము నందియుండడని బోధించుట కొఱకింతటి పన్నాగము ను బన్నవలసి వచ్చెను. కావున ఫెరిస్తా చెప్పిన యుద్ధ వృత్తాంతము విశ్వాసపాత్రము గాదు. యుద్ధమును కనులారగాంచి వర్ణించిన న్యూనిజు కథనమే సత్యాత్మకము.

## రాయచూరు ముట్టడి

గొబ్బూరు యుద్ధమును జయవంతముగ ముగించుకొని కృష్ణదేవరాయలు మరలి రాయచూరు నకువచ్చి కోటముట్టడి ప్రారంభించెను. రాయచూరు కోట బహు బలిష్ఠమైనది. దుష్ప్రాప్య దక్కనీ దుర్గముల లోనిది యగ్రశ్రేణికి జెందినది. కోట యున్నతమైన కొండపై నిర్మింపబడి పరస్పర పరివృత ప్రాకారత్రయ పరివేష్టితమై యుండెను. కోట గోడలపై బురుజు లొండొంటికి సమీపముగ నిర్మింపబడి బురుజుల నడిమి ఖాళీస్థలములందు ఫిరంగులు పెద్దవి గాని చిన్నవిగాని మూడువందల కధిక సంఖ్యగలవి బారులు తీర్చియుండినవి. కోట సంరక్షణార్థము కాల్బల మెనిమిది వేలును యశ్వదళము నాల్గువందలును మదగజము లిరువదియు నాన్యముండెను. ఏండ్లకొలది ముట్టడి సాగినను నందుండు వారికి వలసిన వస్తుసామగ్రియందు సమకూర్పబడియుండెను. మఱియు దుర్గప్రాకారముల లోపల చెఱువులు బావులు మున్నగు జలాధారము లనేకములుండెను. కావున కోటలోని వారు నీటి కరువుచేత శత్రులకు లొంగవలసిన యావశ్యకతయు లేదు. ముట్టడి జరిగిన విధమును న్యూనిజిట్లు వర్ణించియున్నాడు. ముట్టడి ప్రారంభమైన పిమ్మట నొకనాడు క్రిస్టవన్ డిఫిగరైడో కృష్ణదేవరాయల యనుమతిగొని కొంత పరివారముతో కోటలోని తురుష్కులెట్లుండిరో కనుగొనుట కొఱకు బయలు వెడలెను. వాటివాటి పరివారముతో కోట గోడల దగ్గర త్రవ్వియుండిన గాడిని సమీపించి యలంగములపై నిర్భయముగ దిరుగుచుండిన మహమ్మదీయులపై దుపాకులను గాల్పించి హతము గావించెను తత్కారణమున కోటను సంరక్షించుటకు నిలువ జాలక హతశేషులు పాఱిపోయిరి. అంతట రాయదళములు కోటగోడల చెంతకువచ్చి వాని విడియగొట్టుట కారంభించెను. శత్రు విధ్వంసము కొఱకు కోటగోడలపై మోర్చాచేసి యుండిన ఫిరంగులత్యున్నత స్థలములందు నెలకొల్పబడియుండుట వలన వాని క్రిందుగ గోడల చెంతను డిన రాయదళమునకు వానికి కాల్పువలన నెట్టి బాధయు గల్గుట కవకాశము లేకపోయెను. కావున రాయదళములు నిర్భయముగ కోటగోడలను జేరియందు గండు పొడుచసాగిరి. గండ్లనుండి శత్రువులను కోటలోనికి జొఱనీయక అడ్డుపెట్టుటకు దగిన యాగ్నేయాయుధము లెవ్వియు కోట సంరక్షకుల కడ లేక పోవుటచే యాకార్యము కరము దుష్కరమాయెను. ముట్టడి కొన్నాళ్లిట్లు నడచినది. దినదినమున క్రిస్టపనీ ప్రకారము రాయదండ నాయకుల దనవెంట గొనిపోయి కోటగోడలపై గానవచ్చిన తురకలనెల్ల గాల్పించి చంపువాడు; కావున కోటలోని వారెవ్వరును బయట తలచూప వెఱచిరి. ఇక రాయసైనికుల కార్యము సుగమమైనది. వారు పారలు గడ్డపారలు మున్నగు ఖననోపకరణములను ధరించి కోటగోడల విడియ గొట్టగడగిరి. విచ్చుల విడిగి కోట గోడలను భగ్నముజేసి లోనికి ప్రయత్నించుచుండిన శత్రులను గాంచి పురమునందలజడి గలిగి స్త్రీలు బిడ్డలు పరిజనముతోగూడ లోపల కోటలోని ప్రవేశించిరి. దుర్గాధ్యక్షుడు పురజనులకు ధైర్యముచెప్పి వారిలో కొంతమందిని వెంటనిడుకొని యెచటనుండి శత్రులు నిజపక్షము వారిని కాల్చి చంపుచున్నారో కనుగొనుట కొఱకు కోట గోడపై నెక్కెను. వెంటనే తుపాకి గుండొకటి వచ్చి నొసటదాకుటచే విగతప్రాణుడై నేలగూలెను. అతని చావు రాయచూరి ప్రజను శోక సముద్రమున ముంచినది. పట్టణమునం దెల్లెడలను నాలగోడు బాలగోడు లేచినది. ఇక రాయదళములు కోటలో ప్రవేశించి జనులను హింసించి వారి సర్వమును చూఱగొందురను భయమెల్ల వారి హృదయములను కలతపెట్టగడగినది. కాని వారనుకొనినట్లు రాయ సైనికులు కోటను ప్రవేశించలేదు. నాటికి యుద్ధమును చాలించి విడిదలకు తిరిగి పోయిరి.

మఱుసటి యుదయము కోటలోని వారి పక్షమున కొందఱు తెల్లజండాల నెత్తుకొని రాయల

శిబిరమునకు సంధికి వచ్చిరి. కృష్ణరాయలు వారి నుచితరీతి నాదరించి యభయ మొసగెను. తన దళ నాయకులలో నొక్కని కోటను స్వాధీనపఱచుకొన నంపెను. మఱుసటిదిన ముదయము స్వయము పట్టణ మును బ్రవేశించి లోపలికోట సమీపమును జేరి పుర ప్రముఖులను రప్పించి 'మీ సర్వస్వమును మీకే విడిచితిమి. మీ యిష్టానుసారము వర్తించుచు దానిని వినియోగించుకొనవచ్చును. ఇచ్చగల వారిచ్చటనే యెప్పటివలె నుండవచ్చును. లేనివారు తమ యాస్తి పాస్తుల గొని యిష్టమువచ్చిన చోటికి బోవచ్చునని ప్రకటించెను. పట్టణమును చూఱగొనరాదని శాసించెను; కాని భయవిభ్రాంతులై తమ సమస్తమును విసర్జించి పాఱిపోయినవారి యాస్తులు కొల్లపోయెను. రాయలవారి యౌదార్యము దెలియవచ్చినంతటనే వారు వచ్చి మొరవెట్టుకొనగా నతడు చూఱకారులను బిలువనంపి కఠినముగ శిక్షించి వారి సొమ్మును మరల వారి కిప్పించెను. కృష్ణరాయ లిట్లాదరించుచుండినను గొందఱు రాయచూరిని విసర్జించి యన్యస్థలములకు లేచిపోయిరి. దారి బత్తెములేక యిబ్బందిపడుచుండిన వారికి రాయభండారమునుండి వలసిన ద్రవ్య మిప్పించి పంపెను. రాయచూరు స్వాధీనపడిన పిమ్మట దుర్గ పాలనకు దగిన యేర్పాటులను గావించుచు కృష్ణరాయ లచట కొంతకాలము నిలిచి సర్వమును చక్కబడిన పిమ్మట విజయనగరమునకు తిరిగి వచ్చెను.

## సంధి రాయబారము

ఆదిల్ఖానునిపై కృష్ణరాయల విజయము భారతీయ మహమ్మదీయ ప్రపంచమున విస్మయము గల్గించినది. దక్కను పాదుశాహుల హృదయసీమ యందు దిగులు పుట్టించినది. తమలోనెల్ల నాదిల్ఖా నుడు బలవత్తరుడు. వానిని జయించిన రాయలు తమనెత్తివచ్చిన దమకాతని మార్కొనజాలిన శక్తి లేదు. కావున వారాతని బెదరగొట్టి యాదిల్ఖానుని కడనుండి యాతడు జయించి కైకొనిన దుర్గమును రాష్ట్రమును నాతనికి మరల నిప్పించుట కొఱకు ప్రయత్నము సల్పిరి. నిజాముల్ ముల్కు, మదార్ మల్లికు, దస్తూరు దీనారు, బరీదు మున్నగువారు ఆదిల్ఖానుని గూడి రాయలపై నెత్తివచ్చి యుద్ధముజేసి యతడు నష్టమందిన సర్వము నాతనికీవలపి వచ్చుననియు నుత్తరములను వ్రాసి దూతలచేనిచ్చి విజయనగరమున రాయల సముఖమున కంపిరి. ఆ లేఖార్థమును గ్రహించి కృష్ణదేవరాయలు వారందఱేకమై తనపై నెత్తివచ్చునంతటి శ్రమపడవలసిన యవసరములేదని, వారందఱు స్థైర్యముతో తమ రాష్ట్రములందె నిలిచి యుండిన తానె వారికడకు వచ్చుచున్నాడననియు ప్రత్యుత్తరము వ్రాసియంపెను.

దక్కను సుల్తానులు రాయలకడకు రాయబారు లను తమంతట తామె యంపిరో లేక యాదిల్ఖాను నిచే ప్రేరితులై యంపిరో తెలియదు. కాని వారి రాయబారము నిష్ఫలమైన తరువాత యిస్మాయిలాది ల్ఖాను డొకరాయబారినంపి రాయలవారు నిష్కారణముగ దనరాజ్యము దండయాత్ర వెడలి తన దుర్గములను రాష్ట్రము నాక్రమించుకొన దన కపార నష్టము గలి గించిరనియు రాయలవారాక్రమించుకొని దుర్గములను దానిక్రింది రాష్ట్రమును దనకు మరల నిచ్చివేయుట న్యాయమనియు విన్నవించెను. కృష్ణరాయలు దన దండయాత్ర సకారణయుక్తమైనదని తెల్పి యాది ల్ఖానుడువచ్చి తనకు పాదాక్రాంతుడైన యెడల నాతడు కోరినట్లాతని భూముల నాతనికి మరల నిచ్చి వేయునని చెప్పెను. అంతట రాయబారి యాది ల్ఖానుడు రాయల వారికి పాదాక్రాంతుడగుటకు సిద్ధముగ నున్నాడనియు స్వయముగ విజయనగరమున రావెఱచుచున్నాడనియు విన్నవించెను. అంతట కృష్ణ రాయలు దాముభయ రాజ్యముల సరిహద్దునకు విచ్చే యుదుమనియు నాదిల్ఖాను డప్పుడచ్చటికివచ్చి తమకు పాదాక్రాంతుడు గావచ్చుననియు నాన తిచ్చెను. రాయబారి సమ్మతించి విజాపురమునకు మరలిపోయెను.

## విజాపురయాత్ర

పై జెప్పిన యేర్పాటు ప్రకార మాదిల్ఖానునిచే మ్రొక్కగొనుటకు కృష్ణదేవరాయలు విజాపురరాజ్య గడిప్రాంతములకు బోయి యాతని యాగమనమును నిరీక్షించుచు ముదలు దుర్గమున గొంతకాలము విడిసి యుండెను. కాని యాదిల్ఖానుడు రాడాయెను. అత డచటికి రాకపోయిన యాతడుండు చోటికే పోయి మ్రొక్కుగొందునని కృష్ణరాయలు సైన్యముతో గూడ నతని రాజధానియైన విజాపురమునకు బయలు వెడ

లెను. ప్రయాణము నిరాటంకముగ సాగినది. తుదకు విజాపురము జేరి యచటనే కొంతకాలము విడిసి యుండ నిశ్చయించుకొనెను. కాని నీటివసతి లేక పోవుటచేత నచట నుండుట కష్టమాయెను. ఆ పట్టణ ప్రజలకు పానీయజలములను సరఫరా చేయు రెండు చెఱువుల కట్టలను తురకలు నఱికి ఏటిని వెలుపలికి పారించివేసిరి. జలాభావమునకు దోడు వంటచెఱకు ముఖ్యమాయెను. ఎయటినుండి యొక పుల్లనేనియు రానీయక తురక లాపివేసిరి. కావున రాయ సైనికులు పెక్కు కట్టడముల నిడియగొట్టి యందలి కలపను వంటచెఱుగ నుపయోగించుకొనిరి. ఈ కారణములవలన కృష్ణదేవరాయలు తా నమకొనినంత కాలము విజాపురమున నుండ వలనుపడక పోవుట వలన దండును మరల్చుకొని ముదుగల్లునకు బోయి చేరెను. కృష్ణరాయలు సైన్యముతో వచ్చుచున్నాడను వార్త వినగనే తన రాజధానినుండి పాఱిపోయి యుండిన యాదిల్‌ఖానుడు మరలి వచ్చిచేరెను.

## అసద్‌ఖానుని రాయబారము

ఇస్మాంయిలాదిల్‌ఖానునికి ధ్వంసమైన నిజ రాజధానిని జూడగనే మనోవ్యథ కలిగినది. ఇట్టి యవాంతరము మరల సంఘటిలకుండుటకై కృష్ణరాయలతో సఖ్యము గుదుర్చుకొనుట యుక్తమని తలచెను. ఇది యవశ్యము చేయదగిన కార్యమనియు దన్ను విజయనగరమున కంపిన తాను సర్వవిషయములను ప్రభువు వారి చిత్తమునకు నచ్చినట్లు చక్కబెట్టుకొని వచ్చెదననియు నాసద్ఖానుడు మనవి చేసెను. ఇస్మాయిలా లాదిల్ ఖానుని హితులలో నెల్ల యాసద్ఖానుడు ప్రధానుడు. ఇస్మాయిలా లాతనిమాటలను విశ్వసించి యతని విజయనగరమునకు రాయబారము బో నియోగించెను. అసద్ ఖానుడు సామాన్యుడు గాడు. గడుసుదనమునం దారితేరిన వాడు; కపటి; వంచనయందు వంచకములకు చదువు చెప్పగల మేధావి. అతడు విజయనగరమునకువచ్చి స్వామి కార్యము నెఱవేర్చుటకుగాదు; స్వకార్యమును సాధించుట కొఱకే. సలబత్‌ఖానునిగూర్చి ముందు చదివి యున్నాము. అతడితనికి గర్భశత్రువు. అతడు విజయనగర చెఱసాల నుండి విడుదలయై విజాపురమునకు మరలివచ్చిన దన్ను గురించిన వాస్తవము నాదిల్‌ఖానుని కెఱుకసేయుననియు నంతట దనకు ముప్పగలుగుననియు గ్రహించి యతని నెట్లైన విజయనగరమున గడతేర్చుటయె తనకు శ్రేయస్కరమనియు నంతట నిశ్చయించి యా కార్యసిద్ధి కొఱకు వచ్చెను. విజయనగరమునకు వచ్చిన వెంటనే రాయలవారి దర్శనము జేసికొని తన వాక్చాతుర్యమువలన దనకు బ్రసన్నునిగ జేసికొని తన యజమానునితో సంధి విషయమును స్మరణకుదెచ్చి సంధి కుదరక పోవుటకు సలాబత్‌ఖానుడు పుత్తెంచిన దుర్మంత్రమే కారణమనిచెప్పి రాయల కతనిమీద కోపము గల్గించెను. ఆసద్ఖానుని దుస్తంత్రమును గుర్తింపజాలక నిరపరాధియైన సలాబత్‌ఖానుడు ద్రోహియని విశ్వసించి మరణదండన విధించిచంపెను. ఆసద్ఖానుని యభీష్టమిట్లు నెఱవేరెను. ఇక విజయనగరమున నిల్చుట యపాయకరమని యెఱిగి యాతడొకనాడర్ధరాత్రి సమయమున నెవ్వరికి జెప్పక విజాపురమునకు పాఱిపోయెను.

## కలుబరిగ దండయాత్ర

ఆసద్ఖానుడు పాఱిపోయిన తరువాత కృష్ణదేవరాయలతని కుత్రిమ ప్రవర్తనను దెలిసికొని క్రుద్ధుడై విజాపుర రాజ్యముపై దండువెడలెను. దండయాత్ర జయవంతముగ కొనసాగినది. కలుబరిగె కననసగపురము చెంతను రాయలకు యుద్ధము సంఘటిల్లెననియు నాయుభయ రణక్షేత్రములందును నాతనికె జయము జేకూడెననియు

'తిరుగు హరిపుర సురసురుసురల మరగి
బహళ హళహళి భృత కలబరిగ నగర
నగర పురవర పరిబృఢ జవన యవన
పృతనభవ దసినవీ దెగి కృష్ణరాయ.'

యను నాముక్త మాల్యదలోని గీతము చాటుచున్నది. ఈ దండయాత్రకు సంబంధించిన మఱికొన్ని యుద్ధ విశేషములను గృష్ణరాయల యాస్థాన సంగీత విద్వాంసుడు బండారు లక్ష్మీనారాయణ తన సంగీత సూర్యోదయ పీఠికయందు వివరించి యున్నాడు. కృష్ణాస్రవంతిని దాటి గృష్ణదేవరాయలు యవనజన పదమును సర్వమును అగ్నిదగ్ధము గావించెను. కలుబరిగ నగరపురములతోపాటు ఫీరోజాబాదును హసన్‌బాదును మఱికొన్ని శత్రుదుర్గములను లగ్గలు పట్టి కైవసము గావించుకొనెను. కలబరిగ దుర్గమందు నిపాదుడు (ఆదిల్‌ఖానుడు) బంధించియుండిన సుర్తాణుని

పుత్రులను ముగ్వురను విడుదల చేసెను. ఈ సుర త్రాణు డెవ్వరో యతని పుత్రులనేల సపాదుదు బందీ కృతుల జేసెనో న్యూనిజు దన చరిత్రయందు వివరించి యున్నాడు. దక్కను సుల్తాను (రెండవ మహమ్మదు) పుత్రులు ముగ్గురు కృష్ణరాయల చేజిక్కిరి. ఆదిల్ ఖానుడు తన బావమఱదియైన సుల్తానుని యుంపుడు కత్తె కొడుకును రాజ్యాధిపతిని సేయఁదలపెట్టి సుల్తానుని మరణానంతరమతని యౌరస పుత్రులనుబట్టి బందీకృతులఁజేసి యుండెను. కృష్ణరాయలు వారిని విడుదలచేసి వారిలో జ్యేష్ఠుని యతని తండ్రి పదము నందు ప్రతిష్ఠితుని జేసెను. నిజస్వాతంత్ర్యమును ప్రకటించి రాజ్యము నేలుచుండిన బహ్మనీ సామంత ప్రభువు లెల్లరను నతనికి ఆజ్ఞాబద్ధులై ప్రవర్తించుట కియ్యకొనిరి. కృష్ణరాయల వలన భయముచే నాదిల్‌ఖానుడు సయితము అతనికి నమ్రుడాయెను. జ్యేష్ఠునిట్లు దక్కను రాజ్యపీఠముపై బునః ప్రతిష్ఠితుని గావించి యతని తమ్ములు నిరువురిని తనవెంట విజయనగరమునకు దోడ్కొనిపోయి రాజపుత్రుల యంతస్తునకు దగినట్లు వారిని సత్కరించి తగు మర్యాదలను గావించి వారికి దినవెచ్చము కొఱకు సాలుకు చెఱియేబదివేల బంగారు పర్దావులు వేతనము నేర్పాటు చేసెను.

## ఆపంచ గౌడ ధాత్రి

కలుబరిగ దండయాత్రను విజయవంతముగ గొనసాగించిన పిమ్మట కృష్ణరాయలు అచటినుండి యుత్తరదేశములపై దండువెదల నుద్యుక్తుడు కాగా మంత్రులది సుకరము గాదనియు, నుత్తరదేశములపై దండు వెడలినయెడల నప్పడు రాయలతో మైత్రి నెఱపుచుండిన యచటి తురకరాజులు అతడు తమ దేశములను జయించి యాక్రమించుకొనుట కొఱకెత్తి వచ్చుచున్నాడని జడిసి యేకమై మాఱొడ్డ వచ్చుననియు నట్లు వారంద తేకీభవించి మాఱొడ్డిన పక్షమున జయము సులభసాధ్యము గాకపోవచ్చునని చెప్పి వారించిరనియు, వారి సలహా సమంజసమైనదని యంగీకరించి రాయలవారు తమ యుద్యమమును చాలించుకొని విజయనగరమునకు మరలివచ్చిరనియు న్యూనిజు వ్రాసియున్నాడు. కాని సమకాలికాంధ్ర వాఙ్మయమును రాయలవారి శాసనములను బరిశీలించిన యుత్తరదేశపు తురుష్క ప్రభువులకు జంకి వారిపై దండు వెట్టుటకు వెనుదీసినట్లగపడదు. మొదట వాఙ్మయ సాక్ష్యమును బరికింతము. కృష్ణరాయల యాస్థానాష్టదిగ్గజ కవులలో నెల్ల మేటియైన అల్లసాని పెద్దనార్యుడు స్వపిరచిత స్వారోచిషమనుసంభవ పీఠికయందు రాయల విజయములను వర్ణించుచు

'నావార పతిశకంధర సింధూరాధ్యకు
లరిగాపు లెవ్వాని ఖరత రాసి
కా పంచగౌడధాత్రీ పదం బెవ్వాని
కసివాఱుగా నేగునట్టి బయలు'

అని వక్కాణించియున్నాడు. కృష్ణరాయల కసివాఱుగా నేగునట్టి బయలైన పంచగౌడధాత్రీపదం బెయ్యది? అతని కరిగాపులైన నావారపతిశకంధర సింధూరాధ్యకు లెవ్వరు? అను ప్రశ్నలు సమాధానమును గోరుచున్నవి. మొదట నా పంచగౌడధాత్రీ పదమన నెద్దియో కనుగొందము. ఆ పంచగౌడధాత్రీ పదము అనగా బంచగౌడదేశము లిముడుకొనియుండు భూభాగము. పంచగౌడదేశములవలన గౌడకన్యాకుబ్జ సారస్వత మైథిలోత్కల ప్రజల కావాస స్థానమైన దేశములని వ్యాఖ్యాతల వివరణము. అసివాఱుట యనగా గత్తిసాము జేయుట. ఆ పంచగౌడధాత్రీ పదంబు రాయల కసివాఱగా నేగునట్టి బయలనగా నా పంచగౌడ దేశములును నతని దండయాత్రా ప్రసారణమునకిరవైన ప్రదేశములనియు యర్థము.

(సశేషము)

# స్వరోదయం

శ్రీ గడియారం శేషఫణి శర్మ

మీ ఊరు—
ఈ చీకటి తోట కావల,
ఆ ముళ్ల బాట కీవల,
ఒక తీయని రంగుల కల!
వెన్నెల సెలయేటి అల!!

నీవు పుట్టింది—
గుంపుగా,
తెలి వన్నెల సొంపుగా,
ఆకాంచలాలలో
రాయంచలు విహరించిన,
ఒక
వర్షా శరత్తుల సంగమ వేళ!

నీవు కళ్లు తెరచింది—
అందంగా,
అరవిచ్చిన తెలికలువల చందంగా,
వెలది వెన్నెల సిరులు
నలుదిక్కులా పరుచుకున్న,
ఒక
శరద్రాత్రి!

నీవు పెదవి విప్పింది—
రసాల కిసలయాలు మెసవిన
కోకిల కులాలు,
పంచమ స్వరాలకు
గళాలు సవరించుకున్న,
ఒక
చైత్రోదయ వేళ!

నీవు చదివింది—
మమతల పాత బడిలో,
అనురాగపు
పాలరాతి గుడిలో!

నీవు నేర్చింది,
మాట్లాడే అక్షరాలు!
మోహన మంత్రాక్షరాలు!!

నీ పేరు—
వలపులకూ,
తీయని తలపులకూ,
మారుపేరు!
ప్రణయాక్షర దివ్యసుమాలు
పరిమళించే పువ్వులపేరు!!

నీ వెడగంటి రెప్పల నీడలో,
ఈ వెన్నెల వాడలో,
సురభిళ సుమశ్వాసలు
ప్రసరిస్తున్న
నా హృదయము,
ఇప్పుడు
అభినవ శివస్వరోదయం!
ప్రణయనాదమును పలికించింది,
నీ దివ్యగాథ వివరించింది.

ఇంతకూ,
ఇలపై నీవు అవతరించింది,
మూగపోయిన,
ఈ గళాన్ని సవరించేందుకు!
ఆగిపోయిన,
నా కలాన్ని కదిలించేందుకు!!

# సీత కథ

"ఊర్వశి"

సాధారణ ఎన్నికలు వచ్చాయి. వెళ్ళాయి. అయిదు సంవత్సరాల క్రితం. మళ్ళా ఎన్నికలు వచ్చాయి. వెళ్ళాయి. ఈ రెండింటికి మధ్య పంచాయితీ ఎన్నికలు, మధ్యంతర ఎన్నికలు వచ్చాయి. వెళ్ళాయి. మంత్రులు, ఎమ్. ఎల్. ఏలు క్రొత్తవారొచ్చారు. పాతవారు వెళ్ళిపోయారు. ఆసక్తి, చొరవ, సామర్థ్యము. కార్యదీక్ష ఉన్నవారు చేయగలిగిన సేవచేసి, గ్రామాలలోను, తాలూకాలలోను, జిల్లాలలోను, రాష్ట్రాలలోను మంచి మార్పులు తెచ్చారు. అలానే ఏ మార్పూ రాని గ్రామాలు ఉండిపోయినయి. మనుషులు ఉండిపోయారు. ఏదో సమయంలో ఊహించని మార్పు వస్తుందన్న ఆశాభావంతో జీవించేవారితో పాటు, ఏ మార్పు రాదన్న నిరాశాభావంతో జీవించేవారు కలనేతచీరలా పొడవున వెడల్పున అల్లుకుని పోయిన ఆ గ్రామంలో చిరిగిన చీరకున్న మాసికల్లాగ పాడుపడిన యిళ్ళు, ఎండిపోయి కూలిపోయిన బావులు, రామాలయం దగ్గర ఎండీఎండని చెలువు, పోగులూడిన చీర అంచుల్లా పండీపండని వర్షాధారపు భూములు, ఉన్న ఆ గ్రామంలో సీత కూడ ఉంది. సీతకు ఒక కలనేతచీర ఉంది. ఆ చీర క్రొత్తదేం కాదు. కాని ఆ చీరంటే సీతకు యిష్టం. అందుకు కారణం లేకపోలేదు.

వెన్నెల రాత్రులన్నీ ఆనందాన్నిచ్చేవని అనలేం. అలానే చీకటిరాత్రులు ఆనందాన్నియ్యవనీ అనలేం. నిజానికది చీకటిరాత్రే. కాని సీతకుమాత్ర మది వెన్నెల రాత్రే. ఆ వెన్నెలకూడ ఒక రోజుతో వెలిసిపోయే వెన్నెల కాదు. జీవితాంతం కాచువలసిన వెన్నెల. ఆ రోజు సీత ఆ చీరే కట్టుకుంది. అది ఆ నాటికి సరిక్రొత్తచీర. ఆ రోజు ఆ క్రొత్తచీరను ఎందుకు కట్టుకుందో సీతకు గుర్తులేదు. కాని ఆ రోజు— ఆ కొబ్బరిచెట్టు—ఆమె మనసున కాచిన వెన్నెల ఆమెకు గుర్తు. వాటితోపాటు అతిముఖ్యమైన దొకటి ఆమెకు గుర్తు. కాని ఆ విషయాన్ని సాహసించి ఎవరికీ చెప్పలేదామె. చెప్పదు కూడ.

క్రొత్త ఎన్నికలు వస్తున్నాయంటే పాత ఎన్నికలు గుర్తుకొస్తాయి పాత ప్రమాణాలు జ్ఞాపకానికి వస్తాయి.

సీతకు కూడ జ్ఞాపకాలు బోలెడు.

సీతకు ఎన్నికల గురించి ఏమీ తెలియదు. ఆమెకు తెలిసిందల్లా, తను యింటికి వచ్చేవారందరికీ భోజనం పెట్టవలసి ఉంటుందన్నది మాత్రమే. తల్లి మంచం ఎక్కడంచేత వంటవడ్డన తానే చేయవలసి ఉంటుందన్నది, అన్న, సూర్యం చెప్పగా గ్రహించింది సీత. తనకు ఓటుహక్కు వచ్చిందని, దాన్ని తను సద్వినియోగపరచుకునే అవసరముందని సూర్యం చెప్తే ఆమెకు తెలియలేదు. ఓటు అంటే ఏమిటో, దాని నేవిధంగా చెయ్యాలో సీతకు తెలియదు. కాని తెలిసికోవాలని మాత్రం ఆమె మనసులో ఉంది. ఎవరిని అడగటమో ఆమెకు తెలియదు. ఆమె ఎనిమిదవ తరగతి వరకు ప్రక్కఊరి బడిలో చదువుకుంది. కాని ఆ బడిలోనూ ఆ విషయాల గురించి ఎవరూ ఏమీ చెప్పలేదు. అంతే కాదు. కందిపప్పు ఉడక్కపోతే ఏంచెయ్యాలో, కాకరకాయకూర నెన్నివిధాలగా చెయ్యవచ్చో, సాంబారుపొడిని ఎలా తయారుచేసికోవాలో, అప్పడాల నెలా వత్తాలో—మరి యిలాంటివాటి గురించి, ఎవరూ ఏమీ చెప్పలేదు. కలపమన్నారు. తీసేయమన్నారు. గుణించమన్నారు. భాగించమన్నారు. సీతకా చదువేమీ నచ్చలేదు ఆ వయసులో ఆమెకు—ఆశల కలుపుకొని నిరాశల లేపివేయటమే జీవితమని గాని, సామాన్య కుటుంబంలో పుట్టిన ఆడపిల్ల, కోర్కెల భాగించుకొని, నిరాశల గుణించుకోవాలనిగాని తెలియదు.

సీతకు తన అందం గురించి తెలుసు. అందుకామెకు అహంభావం లేదు. ఎవరు చూడకుండ ఉంటే

తన అందాన్ని చిన్నద్దంలో తనివితీర చూచుకొని నిర్లిప్తంగా నవ్వుకుంటుంది. సీతవి పెద్ద కళ్ళు. ఆమెది పొడమైన నల్లని జుత్తు. తెల్లని అందమైన పొందికైన శరీరం. చదువుకునే రోజుల్లో తోటి స్నేహితురాండ్రనేవారు సీత అందమైనదని. చదువు మానేసి యింట్లో కూర్చుని, చిరిగిన తల్లి చీరలను ఓణీలుగా మార్చుకొనే రోజుల్లో, సాయంత్రం వేళల్లో చెఱువుకు మంచినీటికి వెళ్ళొచ్చేవేళల్లో, ఊళ్ళో వాళ్ళనుకునేవారు సీత అందమైనదని. పెద్ద ముత్తైదువు లనుకునేవారు సీత ఏ అదృష్టవంతుని యిల్లాలవుతుందో అని. అన్నిటిని విని తృప్తిగా నవ్వుకునేది సీత. సీతను వెతుక్కుంటూ ఏదో రోజున, ఆమెకు కాబోయే భర్త తన యింటికి వస్తాడని సూర్యాని కొక ధైర్యం; చెల్లెల్నిచూచి గర్వంతో నవ్వుకుంటాడు కరణం సూర్యం.

సీతకు వంటావార్పు, కుట్లు. అల్లికలు అన్నీ చేతనవును. ఏని ఆమెకు చేతకాని దొకటే. ఉదయం సాయంత్రం నీళ్ళకు వెళ్ళివచ్చే తనను ఎన్నో కళ్ళు, ప్రశంశతో; ఆరాధనతో, వికారంతో, చూస్తున్నా తల యెత్తి ధైర్యంగా ఆ కళ్ళలోకి చూడటం ఆమెకు తెలియదు. ఆమెకు అదే చేతనయివుంటే ఆమె గురించి చెప్పటానికి నేను శ్రద్ధవహించే వాడనేకాను. అయితే సీత గురించి ఎందుకు చెప్తున్నానంటారేమో; మాధవరావు గురించే. ప్రతి గ్రామంలో సుమారుగా ప్రతి మధ్యతరగతి కుటుంబంలో సీత ఉంటుంది. అలానే సమాజంలో, మనచుట్టూ, మనతో కొందరు మాధవరావు లుంటారు. వాళ్ళను దాచుకున్న సమాజం ఉంది. ఆ సమాజం కోసమే ఈ కథ.

సుమారుగా కాకపోయినా, అయిదు సంవత్సరాల క్రితం.

ఆ ఊరి ఎలిమెంటరీ స్కూలు దగ్గరకి రేపు ఎన్నికలు అనగా ముందురోజే మధ్యాహ్నం పన్నెండు గంటలవేళ లారీవచ్చి ఆగింది. ఆ లారీలోంచి మగ, ఆడవాళ్ళ విభాగాలకు చెందిన ఎలక్షన్ సిబ్బంది దిగింది గోనెమూటలతో, ఎయిర్ బ్యాగులతో. వారి కన్నా ముందుగానే పోలింగు ఆఫీసర్లు, పోలింగు క్లర్కులు వచ్చి చేరారు. ఆడవారి విభాగానికి చెందిన సిబ్బందిలోనివాడే మాధవరావు.

భుజములమీద క్రొత్తగా పెట్టబడిన బాధ్యతల నొకసారి గుర్తుకు తెచ్చుకుని ఆఫీసర్లు లారీ దిగుతూ చుట్టూ కలయ చూశారు.

లారీదగ్గర చేతులు కట్టుకుని హాజరైనాడు మునసబుతోపాటు కరణం సూర్యం.

'తలయారీ ఎక్కడ? లారీ రాగానే సామాను తీసికెళ్ళటానికి రావద్దా? మునసబు ఎవరు? కరణం గారు వచ్చారా? పోలింగుస్టేషన్లు యివేనా? యివే నటండీ? ఫర్నీచర్ అంతా యిదేనా? పోలింగ్‌బూత్స్ యింకా కట్టలేదేమండీ? మేమే కట్టుకోవాలా?... ఇత్యాది ప్రశ్నలు ప్రారంభమైనాయి. మునసబుతో కరణం హోదాలో సమాధానాలు యిచ్చాడు సూర్యం.

'ఏమండీ కరణంగారో, మునసబుగారో, ఖాతా ఎవరో ఒకరు రెండు గాబ్బీలు, రెండు చెంబులు, నీళ్ళూ పెట్టించండి. మాకు భోజనం ఏర్పాట్లు ఏమైనా చేయించారా? లేకపోయినా ఫరవాలేదు. ఈ ఊరిలో హోటలు ఏదైనా ఉంటే చూపించండి. పోతాం...'

'అయ్యా! మా పల్లెటూరిలో భోజనహోటలు ఏదీ లేదండి బాబూ! మీలో మాంసాహారు లెంత మందో, శాఖాహారు లెంతమందో తెలియక నా యింటి దగ్గర భోజనం ఏర్పాటు చేయలేదు. అందుచేత అందరికి ఈ పూటకు కరణంగారి ఇంటిలోనే భోజనాలు. రాత్రికి ఎవరికి ఏ భోజనం కావాలంటే అది ఏర్పాటు చేయిస్తాం. బట్టలు మార్చుకుని భోజనానికి పదండి బాబూ!' విన్నవించాడు మునసబు.

పి. ఓ. లు తమతమ స్టాఫ్ సరిగా వచ్చిందీ లేనిదీ సరిచూచుకొని, సామానును జాగ్రత్తగా పోలింగ్‌స్టేషన్‌లో ఉంచుకుని తలయార్లను కాపలా పెట్టి భోజనాలకు బయలుదేరారంతా.

మాధవరావు మాత్రం వాళ్ళ వెనుక వెళ్ళలేదు.

ఎలాంటి భోజనాన్నైనా చేయుగల తత్వం తనది కాదని అతని నమ్మకం. అంతేకాక ండ యింటిలో అమరినట్టు పరాయిచోట భోజనం ఉపరదని అతని దృఢవిశ్వాసం. ఏదో గడ్డి కరవటంకన్నా బజారు రొట్టెలే కొంత మేలని తన వెంటా బన్‌రొట్టెలను తెచ్చుకున్నాడు. నలుగురు భోజనానికి కదలగానే రెండు రొట్టెల తిని మంచినీళ్ళ త్రాగాడు మాధవరావు.

సాయంత్రం అయి దువరకు మర్నాటి రోజుకై చేయవలసిన ఏర్పాట్లు చేసికుని కొందరు పొలం గట్లవైపు, మరికొందరు రామాలయంవైపు షికారు వెళ్లిపోయారు. మాధవరావు ఆ రోజంతా కాఫీ ముఖం చూడలేదు. ఆ కారణంచేత ఊరిలోనికి వెళ్లాడు మాధవరావు. ఆ ఊరిలో ఉన్న ఒకే ఒక టీ దుఖాణంలోకి కాలు పెడుతూంటే సూర్యం అతన్ని చూశాడు. పలుకరించబోతూంటే మాధవరావు కాఫీకి ఆర్డరిచ్చాడు. దుఖాణదారుడు కాఫీ పొడుముకు కబురెట్టి మాధవరావు ఎవరై ఉంటాడా అనే ఆలోచనలో పడ్డాడు. అదే ఆలోచనతో సూర్యం మాధవరావును సమీపించి

'మీరు ఎలక్షన్ డ్యూటీమీద కదూ ఈ ఊరొస్తే!' అడిగాడు.

'అవును' అన్నాడు మాధవరావు తానేమైనా తప్పు చేశాడా అని భయపడుతూ.

'మీరు యిప్పుడే ఈ ఊరికి వచ్చినట్టా!'

లేదు మధ్యాహ్నమే వచ్చేశా!' కాస్త ధైర్యంగా అన్నాడు.

'మరయితే మధ్యాహ్నం మా యింటికి భోజనానికి వచ్చారా? వచ్చినట్టులేదే.'

'అవునండీ రాలేదు.'

'ఏం? అలా చేశారు?' నిలవదీసి అడిగాడు సూర్యం.

సమాధానంకోసం వెతుక్కోసాగాడు మాధవరావు. మాధవరావు మొహమాట పడుతున్నాడని గ్రహించాడు సూర్యం.

'లదేమిటండీ? భోజనానికి పరాయిల్లు, మన యిల్లు అని చూస్తే ఎలా? అయితే యివాళంతా భోజనం లేకుండా ఉన్నారన్నమాట. ఎంతమాట!' బాధపడ్డాడు సూర్యం.

అంతలో కాఫీ తయారైంది.

ఇద్దరూ కాఫీ త్రాగారు.

మాధవరావు వారిస్తున్నా వినక సూర్యమే కాఫీ డబ్బు లిచ్చేశాడు.

ఇద్దరూ ఊరి బయటకు నెమ్మదిగా మాటాడుకుంటూ నడిచారు.

మాధవరావు తన గురించి, కుటుంబం, ఉద్యోగం గురించి చెప్పిన వివరాలను సూర్యం విని చాల ఆనంద పడ్డాడు, ఆ మాట ఈ మాట అయిన తరువాత.

'రేపు భోజనం చేయటానికి వీలు అవుతుందో అవదో రాత్రి భోజనానికి మాత్రం రావటం మరువకండి. మరి భోజనం ఏర్పాట్లు చూడాలిగా. వస్తాను' అంటూ సెలవుతీసుకుని ఊరివైపు నడిచిపోయాడు సూర్యం.

సూర్యం చూపే స్నేహ భావానికి ముగ్ధుడయ్యాడు మాధవరావు. మొగమాటం కొంత తొలగింది. సరియైన భోజనం దొరక్క గడ్డి కరవాల్సి ఉంటుందని ఆపోహ పడినందుకు తన్నుతాను నిందించుకున్నాడు మాధవరావు.

ఊరికి దూరంగా కొండలున్నాయి. ఆ కొండలు నీలంగా ఉన్నాయి. దారి ప్రక్కనే ఎండీయెండని చెఱువుంది. చెఱువులో ఆడవారెవరో స్నానం చేస్తున్నారు. ఒకప్రక్కగా గేదెల కదుగుతున్నాడు ఒక పశువులకాపరి (కాకపోతే ఒక పాలెగాడు). ఆడవాళ్ళు స్నానంచేస్తూ బట్ట లుతుకుతున్నచోటుకు కొంత సమీపంనుండి నీళ్ళు ముంచుకుపోతున్నాడు ఒక కావిడి కామయ్య. అది ఎండీయెండని చెఱువు. చెఱువువైపు చూడలేక ఊరిలోని పురిళ్ళ బీదతనాన్ని చూడటం చేతకాక దూరంగాఉన్న నీలపుకొండలవైపు దృష్టిసారించి కొంతదూరం నడిచి రోడ్డు ప్రక్కనున్న మదుముమీద కూర్చున్నాడు. ఆ కంకరరోడ్డుమీద ఎఱ్ఱనిదుమ్ము రేపుకుంటూ ఆపసోపాలు పడుతూ ఒక పార్టీ కారు ఊరిలోకి పయనించిపోయింది. ఒంటిమీద పడ్డ దుమ్ము దులుపుకొని కూర్చున్నాడు మాధవరావు. వింతవింత ఆలోచనలు వస్తున్నాయతనికి. కాని తన ఆలోచనల ఎవరైనా కనిపెడ్తారేమో అన్న భయంచేత ముఖాన్ని దారినపోయేవారికి కనపడనీయక కొండలనే చూడసాగాడు మాధవరావు. చీకటి పడుతూండగ మంచు కురవసాగింది. చలి ఎక్కువ కాసాగింది. చీకటి బాగ అలుముకుంటూంటే ఆకలి జ్ఞాపకానికి వచ్చింది మాధవరావుకి. చీకటిలో దారి చూచుకుంటూ ఎలిమెంటరీ స్కూలు చేరుకున్నాడు మాధవరావు.

అతనక్కడికి చేరేసరికి మాంసాహారాలు మునసబు యింటికి శాఖా హారులు శనివారం ఉపవాసదీక్ష

గల వాళ్ళు, మాంసం ముట్టటానికి వీలుపడని దుర దృష్టవంతులు కరణంగారింటికి వెళ్ళిపోయారు. ఆ విషయాన్ని తలయారే మాధ రావుకి చెప్పి అతన్ని కూడ భోజనానికి వెళ్ళమని చెప్పాడు. కరణం యిల్లు మాధవరావుకు తెలియదు. తెలిసికొన్నైనా అక్కడికెళ్ళి ఏం చెప్పాలో తెలియదు.

అరగంట తరువాత బిలబిల మంటూ వచ్చా రంతా.

'మధ్యాహ్నం భోజనానికి వెళ్ళారు కార్పు. మీకోసం ఎదురు చూస్తున్నారు. వెళ్ళి వేగంగారండి కొద్దిగ మిగిలిఉన్న పనిని పూర్తిచేదాం' అంటూ ఆజ్ఞను సలహాకు జోడించి చారవేశాడు. పి. ఓ.

భోజనానికి వెళ్ళాలనే ఎలిమెంటరీ స్కూలు దాటివచ్చి నిలబడ్డాడు మాధవరావు కాని ఎటు వెళ్ళాలో. ఎలా వెళ్ళాలో. వెళ్ళి సూర్యం లేకపోతే ఎవరిని ఏమిటి అడుగాలో అడిగితే ఎవరేమను కుంటారో అని ఆలోచిస్తూ బిడియపడుతూ. తర్కించుకుంటూ కదలలేక నిలబడిపోయాడు.

స్కూలుకు దూరంగా ఉన్న పొందర గుడి సెల్లోంచి ఆడవాళ్ళెవరో బూతులు తిట్టుకుంటూ యివతలకివచ్చి జుట్లు పట్టుకుంటూ దెబ్బలాడు కుంటున్నారు. ఒక్క ప్రక్కనున్న చింతచెట్ల క్రింద ఎరుకలవాళ్ళు రాళ్ల పొయ్యిమీద వంట చేసికుంటు న్నారు. ఆ పొయ్యిలో మండుతున్న మంటల వెలుగులో వాళ్ల నల్లని శరీరాలు, చెట్టుకొమ్మలనుండి వ్రేలాడేగుడ్డ ఉయ్యాలలు కనిపిస్తున్నాయి.

ఊరిలోకి చూశాడు మాధవరావు.

చిక్కని చీకటిలో కిరసనాయిలు దీపాలు అక్క డక్కడ మినుకు మినుకు మంటున్నాయి. ఆ చీకటిలో కదలివచ్చాడు సూర్యం.

'మీకు చాల మొహమాటమని తెలుసు. అందు కనే వచ్చాను మీకోసం రండి రండి అంటూ తొందర చేశాడు మాధవరావును.

మాధవరావు స్వేచ్ఛగా ఊపిరితీసికుని సూర్యాన్ని అనుసరించాడు.

మాధవరావును తీసికుని ఒక పురింటిముందు ఆగాడు సూర్యం.

ఇంటిముందు ఎడమప్రక్క కొబ్బరిచెట్టు మంచులో తడుస్తూ తల విరబోసుకుని పురింటిని జాలితో చూస్తోంది. ఇంటిమీద లేచిపోయిన పూరి గాలిలో రెపరెపలాడుతూ కిరసనాయిలు దీపం కళ్ళు చించుకుని మాధవరావును చూడ తాపత్రయ పడు తోంది.

మంచివాళ్ళు, మంచి హృదయం కలవారు పురిళ్లలో అంటి యిళ్లలో ఉండటమా వింత పోయాడు మాధవరావు.

"సీతా!" కేకవేశాడు సూర్యం.

'వస్తున్నా నన్నయ్యా!' చింకొంగుకు చేతులు తుడుచుకుంటు వస్తూ అంది సీత.

'అఫీసరు గారొచ్చారమ్మా! వంట వడ్డించు' సీతకు వినిపించేంత గట్టిగా అన్నాడు సూర్యం. గడపదాటిబోయి కొత్తవ్యక్తిని చూచి వెనక్కడుగువేసి భుజంమీదికి పమిటను లాక్కుంటూ చీకటిలోనున్న సూర్యాన్ని చూస్తూ సీత.

'అయిపోయిందన్నయ్యా! విస్తరివేస్తున్నా. వడ్డన అయిపోగానే పిలుస్తా. కూచోమను' అంది వినిపించి వినిపించనంత నెమ్మదిగా.

'త్వరగా కానిచ్చేయ్యమ్మా!' అంటూ నులక మంచం వాల్చాడు సూర్యం.

సీతయింటికి వెళ్ళిపోయింది.

ఇంటిలోకి కదలిపోయే సీతను చూశాడు మాధవరావు. అతనికళ్లు బెదిరిపోయాయి. అపురింటిలో అంతటి అందం రాశీ భూతమై ఉన్నందుకు అతనికి వింతేకాదు, ఆశ్చర్యము, బాధా కలిగాయి.

వీధిలోనున్న కిరసనాయిలు దిపం వెలుగులో సీత మాధవరావును చూసిందోలేదో గాని సీతము ముఖాన్ని స్పష్టంగా చూశాడతను. వెడల్పాయిన నల్లని కళ్లను, అంగమైన పెదిమలను, చూశాడు. ఆమె నడచిపోతూంటే నల్లనైన పొడవైన ఆమె జడను చూశాడు. ఆమె ఒంటిమీదిది పట్టుచీరా అనే భ్రాంతి కలిగిందతనికి. పొడవైన ఆమెమెడ, అందమైనచేతులు అతనిదృష్టిలో నిలిచిపోయాయి.

'కూర్చోండి మేష్టారూ!' అన్నాడు సూర్యం. సీతనే గుర్తుకు తెచ్చుకుంటూ కూర్చున్నాడు మాధవ రావు. ఆమె ముఖమే మనసులో పదేపదే తిరుగాడు తూండగా తానామెను ఎప్పుడో ఎక్కడో చూచినట్లు తానూహించే అందాలరాశి బహుశా ఈమేఅయి

తనకు దర్శనమిచ్చినట్టు భావించాడు మాధవరావు క్రితంజన్మలో ఆమెతో తనకు సంబంధం ఉండకపోతే ఆమెను తాను చూడటం సంభవంకాదని పించింది. మాధవరావుకి. తన అన్వేషణ ఫలించబోతున్నదని పించిందతనికి.

'అన్నయ్యా!' గడపదగ్గరకొచ్చి పిలిచింది సీత.

సూర్యం గడపదగ్గర కెళ్ళాడు. సీత అతనితో ఏదో అంది. సూర్యం మాధవరావువైపు తిరిగి 'అన్నట్టు మరిచాను. ఇవ్వాళ శనివారం మీరు ఫలహారం చేస్తారా? భోజనం చేస్తారా? ఈరోజు మధ్యాహ్నం మీరు భోజనం చేయలేదు కాబట్టి రాత్రి మీరు భోజనం చేయటమే ఉత్తమం. ఏమంటారు?' అన్నాడు.

నోరు పెగుల్చుకుని గంభీరతను తెచ్చిపెట్టు కుంటూ

'అలాగే కానివ్వండి' అన్నాడు మాధవరావు.

మరొక్కసారి సీతను చూడొచ్చు అనుకుంటూండగా సీత యింట్లోకి వెళ్ళిపోయింది.

కొద్దిసేపటిలో భోజనానికి పిలుపు వచ్చింది. మాధవరావు సూర్యంతోపాటు కాళ్ళు కడుగుకున్నాడు. విస్తరిలో అన్నం, ఉల్లి అల్లంవేసి వండబడిన వంకాయకూర, కొబ్బరికాయపచ్చడి వడ్డించబడి ఉన్నాయి. సీత దూరంగా తలుపుదగ్గర నిల్చుంది.

ఏదోరకమైన గంభీరాన్ని తెచ్చిపెట్టుకుంటూ, సీతను చూడాలన్న కోరిక మనసులో పదేపదే తిరుగాడుతూంటే, తలయెత్తటానికి సమయం దొరక్క తికమకపడుతూ భోజనం చేస్తున్నాడు మాధవరావు. దగ్గరగావచ్చి కూరపచ్చడి వడ్డించి వెళ్ళిపోతోంది సీత. ఆమెదగ్గరకు వస్తున్నప్పుడల్లా మనసు వెర్రిగ గెంతులు వేస్తోంది. ఆనందం పొంగులు వారుతోంది. ఏదో ఊహిస్తున్నాడు. ఏదో నిర్ణయాలు చేసికుంటున్నాడు. కాని తలయెత్తి చూడలేక పోతున్నాడు.

సూర్యం అతని దగ్గరుండి అతని అవసరాలు చూస్తున్నాడు. మాధవరావు నెమ్మదిగా పెదవులు విప్పి 'ఈ ఇంటిలో యింకెవరూ కనపడరేం?' అడిగాడు.

సూర్యం పెదవులు కదిపాడు. గుమ్మం దగ్గరున్న సీత చీకటిలోకి కదిలింది.

'ప్రస్తుతం ఈ యింటిలో ఉండేది ముగ్గురం మాత్రమే. నేనూ, సీత, మా అమ్మ, మా అమ్మ ఆరోగ్యం చాలకాలం నుండి బాగాలేదు. ఈ ఊళ్ళో వైద్యసదుపాయం లేదు. అయినా నేను అమ్మను ఎక్కడకు తీసికెళ్లగలను?—అదిగో ఆగదిలోనే మంచం మీద ఉంది అమ్మ. నా భార్య పురిటికెళ్ళింది. నాకు ఒక మగపిల్లాడు. ఒక ఆడపిల్ల. ఈ ఊరి ప్రక్క గ్రామమే మా అత్తవారిది. మాకు ఒకప్పుడు భూములు, యిళ్ళు, పశువులు ఉండేవి. మా పెద్దలు కూర్చోతినటం నేర్చారు. అదే మిగత వారికి నేర్పారు. నా పెళ్లి, అక్కయ్య పెళ్ళిళ్లకే ఉన్నదంతా కరిగిపోయింది. కష్టాలు, అప్పులు నాకు మిగిలాయి. మా నాన్న నాకై యిచ్చినదేదీ లేదు. ఈ యిల్లు నే సంపాదించుకున్నదే. అయితే ఎవరూ నాకేం పెట్టక్కరలేదు. ఎవరూ యిటు తిరిగి చూడకపోయినా నాకు లోపం లేదు. నా వృత్తి నాకు, నా కుటుంబానికి తిండిపెడుతుంది— ఎటొచ్చీ సీత గురించే నా బాధ— సీత నా చెల్లెలు — చాల మంచిపిల్ల —పనీ పాటూ అన్నీ వచ్చు— దానికి పెళ్లి చెయ్యాలి — అదే నా బాధ్యత. పెళ్లంటే మాటలా — కట్నాలివ్వాలి— కానుక లివ్వాలి—ఈ యిల్లు అమ్మేసైనా చేయాలని ఉంది. కాని ఈ ఊళ్లో కొనేవెవరు?—కొన్నా, చెడిపోతున్నవాడిని యింకా చెడగొడతారు గాని బాగుపరచరు — అదేమిటి? ... యింకా కొద్దిగ అన్నం తియ్యండి... మిరియాల చారుంది... సీతా చారు!... పచ్చడి వేయించమంటారా? ... సీతా! కొద్దిగ కొబ్బరి పచ్చడి... మీరు అనవసరంగా మొహమాట పడుతున్నారు... ముఖమాట మేం పడనక్కరలేదు— ఇది మీ యిల్లే అనుకోండి ... మీ అమ్మగారూ, మేమూ ఒకే గోత్రికులం...మరేం ఫరవాలేదు...'

'కరణంగారూ!' వీధిలోంచి పిలుపు.

'వస్తున్నా! భోజనం చేస్తూండండి వచ్చేస్తాను' అంటూ వీధిలోకి వెళ్లాడు సూర్యం. కొద్దిసేపటిలోనే తిరిగి వచ్చాడు వస్తూ అన్నాడు.

'మాష్టారూ! ఆర్. ఐ. గారొచ్చారట. కలిసి వస్తాను—ముఖమాటం లేకండ భోజనం చేయండి— సీతా ఎడ్డన సరిగాచూడు - వచ్చేస్తా వేగంగా' అంటూ వీధిలోకి పరుగెత్తాడు సూర్యం.

మాధవరావు విస్తర్లో ఉన్నకొద్ది అన్నా నే ముందుకు తీసికుని కలుపసాగాడు.

'అన్నం వెయ్యనా ?' నెమ్మదిగా అడిగింది సీత.

కావాలనాలో, వద్దనాలో తెలియలేదు అతనికి.

'కొద్దిగ వేయించుకోండి' అంటూ అన్నం వడ్డించింది.

'చాలు! చాలు' అన్నాడు మాధవరావు.

మజ్జిగ పోసింది సీత. మరి కొద్దిగ పచ్చడి వేసింది.

'వద్దండి! చాలండి' అన్నాడు కంగారు పడుతూ.

'ఫరవాలేదు. మధ్యాహ్నం భోజనం లేదట కదా!'

తల ఎత్తాడు మాధవరావు. చేతి మట్టిగాజుల వంకే తదేకంగా చూచుకుంటున్న సీత మాధవరావు భోజనం చేయటం మానటం చూచి తలయెత్తి అటు చూచింది. అతను తనవైపే చూపటం చూచి కంగారుగా తల దించుకుంది. మాధవరావు మాత్రం చూపుల మరల్చుకోలేక పోయాడు.

ఆ కళ్లలో ఎంత వెలుగుందీ! ఆ పెదవుల మీద ఎంత వెన్నెలుందీ? తానెందుకొచ్చా డిక్కడికి? సీతకోసం కాదూ! సీతను దక్కించుకోడానికే కదూ తానిక్కడికి వచ్చింది! ఏమైనా సీతను తాను వదులుకోకూడదు. సీతలాంటి పిల్ల భార్యగా లభించటం సామాన్యమైన విషయం కాదు. తాను మధ్యాహ్నం భోజనం చేయలేదని ఆమెకు తెలుసట. భోజనం చేయకపోతే ఆమెకెందుకంత బాధ! ఎంత అందమైనవా కళ్లు! తల ఎత్తి చూడదేం!............'

'భోజనం చేయండి' హెచ్చరించింది సీత.

మాధవరావు తలదించుకుని భోజనం చేయటంలో నిమగ్నమయ్యాడు.

విస్తరిముందునుండి లేవబోతూంటే అంది సీత 'పెరటిలో నీళ్లున్నాయి' పెరటిలోకి వెళ్లాడు. చీకటిలో ఏది ఎక్కడుందో తెలియలేదతనికి. వెను వెంటనే హరికెన్ లాంతరుతో వచ్చిందిసీత. చిరుకుచ్చిళ్లను బొడ్లో దోపుకుని బిందెలోనున్న నీళ్లను చెంబుతో అందించింది. చెంబునందుకుని చేయి కడుక్కుని రుమాలునందుకుంటూంటే తీగమీదనున్న తుండుగుడ్డను చూపించింది. సీత. చేతులు తుడుచుకొని, చాచిన ఆమె చేతికి తుండుగుడ్డ నందించాడు. ఆమె మెత్తనిచేయి అతని చేతికి తగిలింది. ఆమె ఏమనుకుందో అతనికి తెలియలేదు.

మాధవరావు గొంతు సవరించుకొని అన్నాడు.

'సీత!...సీతగారూ!......మీరు...మీరు...... చాల అందంగా ఉన్నారు' అని. ఆ మాట నన్న తరువాత తానామాట ననగలిగాడా అని ఆశ్చర్యపోయాడు.

ఆమె భయపడిందో, కోపగించిందో, సిగ్గుపడిందో ఆ చీకటిలో తెలియలేదతనికి. సీత కదలి వెళ్లబోయింది.

'మీరు నాకు నచ్చారు. నేను మిమ్మల్ని పెళ్లి చేసికుంటాను. నేనంటే మీకు యిష్టమేనా? నన్ను పెళ్లి చేసికుంటారా?' అడిగాడు.

ఆశ్చర్యబోయింది సీత. సిగ్గుతో తలవాల్చుకోబోయింది.

'నిజం సీతా! మీరు నాకు నచ్చారు...నన్ను నన్ను...పెళ్లి చేసికుంటారా?' చొరవగా ఆమె చేతులు పట్టుకున్నాడు.

యిష్టమే అని అనాలని ఉంది సీత. కాని ఎలా అనాలో తెలుసులేదు ఆమె ముందున్నది చీకటి కాదు. పండువెన్నెల—ఆ వెన్నెల్లో కొబ్బరిచెట్టు క్రింద పాతికేళ్ల అందమైన నిండైన విగ్రహం తన చేతులు పట్టుకుని అడుగుతున్నాడు. ఇది కలకాదు. నిజం. అతని కళ్లలో ఉన్నది కాంక్షకాదు—మాటల్లో నిజాయితీ ధ్వనిస్తోంది.

అతని టెర్లిన్ షర్టు. పలుచని షర్టు జేబులోని పది రూపాయల నోట్లు. చేతినిఉన్న ఉంగరాలు ఆమె కళ్లలో మెదిలాయి. చేతుల్ని అతను చేతుల్లోంచి తీసికుని కంగారుగా 'మేము... మేము... మీలా ధనవంతులంకాము .. మాది .. మాది పేదకుటుంబం... పెళ్లి... అసలు... అసలునాకేం తెలియదు...' అంది.

'నీకా సంశయం అక్కరలేదు సీత! నేను మా అమ్మకి నాన్నకి ఒకడనే, నా మాట కాదనరు. నీవు 'ఊ'' అను అంతే! చాలు' అన్నాడు కొద్దిగ సమీపానికివచ్చి

'ఏమో!... ఏమో!... నాకేం తెలియదు...మా అన్నయ్య నడగండి'

'తప్పక అడుగుతాను సీతా! మరి నీకు యిష్టమే కదూ! నేలవైపు చూస్తున్న ఆమె ముఖంవైపు చూడ ప్రయత్నిస్తూ' అన్నాడు.

సీత అవుననలేదు. కాదనలేదు. సిగ్గుతో తల ప్రక్కకు తిప్పుకుంది.

'థాంక్సు' సీతా!' అన్నాడు మాధవరావు. ఇద్దరూ యింటిలోకి వచ్చారు.

ఇంటిలోని దీపం వెలుగులో సీతను మరింత స్పష్టంగా చూశాడు.

తలంటు పోసికున్న ఆమె, నుదుటపై ఆడే ముంగురులతో అందంగా ఉంది.

ఆమె కనుపాపలలో వెన్నెల జలపాతమై కురుస్తోంది.

ఆమె పెదవులపై తేనియరంగు ఆ వెన్నెల్లో ప్రతిఫలిస్తోంది.

ఆమెకట్టిన కలనేతచీర పట్టుచీరలా మెరుస్తోంది. నడుమున కిరువైపులా ఉరుభాగాలమీద వక్షస్థలంపై చిత్రకారుడు దిద్దిన మెరుపులున్నాయి.

'అన్నయ్య వస్తాడు. వీధిలో కూర్చొండి.' కుడిచేతి గాజులను మోచేతిమీదకు లాక్కుని పనిలో నిమగ్నం అవుతూ అంది సీత. మాధవరావు బాహ్య ప్రపంచంలోకి వచ్చాడు.

అతను నులకమంచంమీద కూర్చున్న కొద్ది సేపటిలో వచ్చాడు సూర్యం.

'భోజనం అయిందా?'

'అయిందండీ! మీ రొస్తారనే కూర్చున్నాను.'

'ఆర్. ఐ. గారు కబురుపెట్టారు. వెళ్లాను. రేపు పనిలో చాల హడావుడిగా ఉండిపోతారు. నిజంగా మీకు ముఖం మాట ఎక్కువ. రేపు మీకు ఏ మాత్రం అవకాశంఉన్నా వచ్చేయండి. నేను అక్కడే ఉంటాను లెండి. బూత్స్ కట్టడానికి దుప్పట్లు కావాలట. ఊళ్లో అడగాలి. ఈ చలికాలం ఎవరిస్తారు చెప్పండి. పదండి. మిమ్మల్ని స్కూలు దగ్గర దిగబెట్టేసి నే ఊళ్లోకి వెళ్తాను' అన్నాడు సూర్యం.

మాధవరావు లేచాడు. సీతకోసం చూశాడు. సీత కనిపించలేదు. 'సీతా ! మేం వెళ్తున్నాం' అని కేకవేసి ఆమె సమాధానంకోసం వేచిఉండక బయలుదేరాడు సూర్యం. బయలుదేరబోతూ సీత కోసం చూశాడు మాధవరావు సీత కనపడలేదు. సూర్యం ముందుకు కదిలాడు. మాధవరావు ముందుకు కదిలాడు సూర్యంతో.

మర్నాడు పోలింగు తేదీ.

ఉదయం పదిగంటలవరకూ పోలింగు మందకొడిగా సాగింది అటుతరువాత జనంవచ్చి పడిపోయారు. క్యూలు పెరిగిపోయాయి. మాధవరావు చురుకుగా పనిచేయటంచేత ఏ. పి. ఓ. ప్రక్క సీటే అతనికీయబడింది బాధ్యతాయుతమైన సీటు అది. ఊపిరి తీసికోటానికి వీలులేని పరిస్థితి—ఓ‌ర్చుకావాలి. చిరాకు పడకూడదు— ఓటర్లచేత సక్రమంగా ఓటు చేయించాలి. మాధవరావుకు సీటు కదలటానికి వీలు లేకపోయింది. అప్పటికే పి. ఓ. మార్కింగ్ క్లర్కుని, బేలట్ బాక్సుదగ్గర కూర్చున్న అతన్ని భోజనానికి పంపాడు. తరువాత ఏ. పి. ఓ.ను పంపాడు. సూర్యం రెండుమూడుసార్లు వచ్చి మాధవరావును చూచి వెళ్లాడు.

'మీరు భోజనానికి వెళ్లిరండి !' పి. ఓ. అన్నాడు.

అప్పటికి జనం కొంత పల్చబడ్డారు.

మాధవరావు సీతకోసం చూస్తున్నాడు. తాను భోజనానికని బయలుదేరితే, సీత ఓటుచేయడాని కదే సమయంలోవస్తే సీతను కలియటం కాదేమో. సీతను యింటిదగ్గర చూడటం అసంభవమేమోగాని ఓటు చేయటంకోసం వచ్చే సీతను చూడటం సంభవం అనుకున్నాడు. కాని సీత తనకోసమే ఎదురుచూస్తూ తన ఓటును వృధాపరచుకొని ఉండిపోయిందని మాధవరావుకు తెలియదు.

మాధవరావు వాచీ చూచుకున్నాడు 'రెండు గంటలయింది. ఇప్పుడేం భోజనం?' అన్నాడు. అతని మాటల విన్నాడు కాబోలు సూర్యం చపాతీ చేయించి తెచ్చాడు. సూర్యాన్ని చూడగానే సీతే తనకోసం శ్రమ తీసికుని ఉండిఉంటుందని అర్థమైందతనికి.

మళ్ళా క్యూలు పెరగసాగాయి. మళ్ళా మాధవరావుకు చేతనిండాపని. ఎందరో వచ్చారు. ఓటు చేశారు. సీత రాలేదు. సూర్యం రాగానే ప్రక్కకు పిలిచి అడిగాడు. 'సీతగారు రాలేదేం?' అని.

'ఇప్పటివరకూ భోజనాలవుతూనే ఉన్నాయి. రాత్రికి ఎవరికైనా వంట చెయ్యాలో ఏమో!' దానికి రావటానికెలా అవుతుంది?' అన్నాడు సూర్యం.

మాధవరావు మనసు చివుక్కుమంది. సీత తన స్వంతం అన్నభావం అతనిలో ఉండటంచేత బాధను నిగ్రహించుకోవటం అంతగ చేతకావటం లేదతనికి.

'ఇంతమందికి, వంటవండి, వడ్డించి, వాళ్ళ ఎంగిళ్ళు ఎత్తటానికి సీత దాసీదా?'

అతని మనసు విలవిల లాడింది.

సీత అందం తన్నెంతగ ఆకర్షిస్తోందో, ఆమె పరిస్థితి కూడ తన్నంతగ బాధిస్తోందని అర్థమైంది మాధవరావుకి.

'ఇది ఇకముందు కొనసాగకూడదు' అనుకున్నాడు.

పోలింగ్ రాత్రి ఏడు గంటలవరకూ సాగింది.

అప్పటికి రెండువందల ఓటర్లు నిస్పృహచెంది వెళ్ళిపోయారని గ్రామం బాధపడింది రాత్రి పన్నెండు గంటలయినా ఓటు చేయించాలని కొందరి వాదన.

సాయంత్రం అయిదుగంటలప్పుడు స్టేషన్ ప్రాంగణంలో ఉన్నవారికి ఓటు హక్కు అని పి. ఓ. ల వాదన.

గ్రామం పి. ఓ.ల క్షమించలేకపోయింది.

మాట మాట పెరిగింది. ఏదో కొంత ఎవరో తగ్గాలి. ఎవరూ తగ్గరు.

రాత్రి ఏడు గంటలకు పోలింగ్ ముగిసినట్టు పి. ఓ. లు ప్రకటించారు.

అవతలమాత్రం తర్జనభర్జన పడుతున్నారు. కొందరు పి. ఓ.లదే రయిటు అంటున్నారు. మరి కొందరు రూలు ప్రకారం నడిస్తే ఈ రోజుల్లో మెతుకులు దొరకవు అంటున్నారు. ఏమైనా పరిస్థితి అంతప్రశాంతంగా ఉండేటట్టు కనిపించలేదు మాధవరావుకి. ఆ రాత్రికి అక్కడ ఉండి సీత గురించి సూర్యంతో మాటాడి, సీతనుచూచి వెళ్ళాలని అనుకున్న మాధవరావు ఆ రాత్రి తానక్కడ ఉండటం తనకేకాక, ఎవరింటఉన్నా వారికి క్షేమంకాదని గ్రహించాడు. పి. ఓ.లతో కలిసి రాత్రే లారీలో వెళ్ళిపోవాలని ఉంది. కాని సీతను చూడకుండ వెళ్ళడమెలాగో తెలియటం లేదతనికి.

రాత్రి ఎవరికీ భోజనాలు గుర్తుకురాలేదు.

మునసబే అందరికి టిఫిన్ పంపించాడు.

సీత నొక్కసారి చూచి వచ్చేస్తాను అని అనుకుంటూ ఉండగా లారీ వచ్చేసింది.

'టవున్‌కి వచ్చేవాళ్ళు వచ్చేయండి. మరి మీకు రేపు ఉదయం పదిగంటలవరకు లారీగాని బస్సుగాని దొరకదు. అదయినా రోడ్డు పాయింటుకు వెళ్తేనే.' గైడ్ హెచ్చరించాడు.

మాధవరావుకు అక్కడనుండి కదలాలని లేదు. కాని కదలక వీలులేని పరిస్థితి. మాధవరావు ఏదీ తేల్చుకోని పరిస్థితిలో లారీలోంచి అతని మిత్రులు రమ్మని తొందర చేశారు. తలయారి అతని సామాను కూడ లారీలోకి ఎక్కించాడు.

'రండి రండి' ఏ. పి. ఓ. చేయి పట్టుకు లాగాడు.

మిత్రులు చేతులు పట్టుకు లారీలోకి దిగారు.

లారీ ఎక్కి నిల్చున్న మాధవరావు సూర్యం కోసం చూశాడు.

లారీ చుట్టు జనం. రెండుచోట్ల పెట్రొమాక్సులైట్ల వెలుగు కుప్పబడి ముద్దగా ఉంది. మిగతా చోటంతా పల్చని చీకటి. సూర్యం ఎక్కడా కనపడలేదు.

సూర్యం యింటివైపు చీకటిలోంచి కళ్ళు చించుకొని చూశాడు.

దూరంగా కొబ్బరిచెట్లమధ్య చింపిరితలలతో, మంచులో తడుస్తూ కనిపించింది సూర్యం యిల్లు. ఇంటిలో దీపం మినుకుమినుకు మంటోంది. సీత మాత్రం కనపడలేదు అతనికి. లారీ కదిలింది.

*  *  *

మాధవరావు పెళ్ళయింది వైభవంగా సంవత్సరానికే.

ఓటర్లు డబ్బుకు అమ్ముడుపోయార్ట. ఆ ఊరు మాత్రమలాగే ఉంది.

---

# తెనుగు మణుగులు

## డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు 1967 లో ప్రకటించిన గౌరన ద్విపద హరిశ్చంద్రో పాఖ్యానమునకు పీఠిక వ్రాయుచు పరిష్కర్తలయిన శ్రీమతి పి. యశోదారెడ్డిగారు ఇట్లు వ్రాసిరి. 'మూలమునందు గానరాని 'నక్షత్రకుని పాత్ర' గౌరన గావించిన సృష్టియే. విశ్వామిత్రునకు వశవర్తులై హరిశ్చంద్రుని పలుబాముల పాలొనరించిన అసుర కవి, తకుకాదులకన్న కూడ నధికముగ కాలి సంకెల వలె హరిశ్చంద్ర భూవిభుని కదలనీక వగల గుందించి నాడు. ఈ క్షత్రకుడు నేటికిని సజీవమ్మైన ఒక పాత్ర విశేషముగ నాంధ్రలోకమునందు నిలిచి యున్నాడు' (పీఠిక పుట 12) హరిశ్చంద్ర కథలోని యీ నక్షత్రకుడు నేటికిని సజీవమ్మైన ఒక పాత్ర విశేషముగా ఆంధ్రలోకమునందు నిలిచియుండుట యథార్థమే అయినను, అతని పాత్ర గౌరన గావించిన సృష్టి యనుట మాత్రము యాథార్థము కాదు. కన్నడమున రాఘవాంకుడను కవీశ్వరుడు రచించిన హరిశ్చంద్ర కావ్యమునందు తొలిసారిగా ఈ నక్షత్రక పాత్రము కానవచ్చుచున్నది. రాఘవాంక కవి కన్నడ మున 'శివశరణరగళె' అనుపేర శివశరణుల చరిత్ర మును రగడచ్ఛందములో రచించిన హరిహరు డను కవీశ్వరునికి మేనల్లుడు. ఇతడు క్రి. శ. 1300 ప్రాంతమునకు చెందినవాడని స్థూలముగా భావింపబడు చున్నది. ఇతని హరిశ్చంద్ర కావ్యము షట్పదీ (వార్ధక) వృత్తములలో రచింపబడిన పంద్రెండాశ్వాస ముల గ్రంథము. కన్నడమున చంపూ సంప్రదాయము నకు పంపాదులవలె షట్పది సంప్రదాయమునకు ఇత డాద్యు డగుటచే నితడు 'షట్పది సంప్రదాయ స్థాపకు'డని ప్రసిద్ధి పడసెను. ఉభయకవి కమలరవి అని అతనికి బిరుదు. హంపి యీతని జన్మ స్థలము. పంపా విరూపాక్షస్వామి భక్తుడు. శ్రీమతి పి. యశోదారెడ్డిగారు తమ పీఠికలో గౌరన కాలమును క్రీ. శ. 1380—1455 గా నిర్ణయించిరి. కనుక రాఘవాంకుడు గౌరనకంటె పూర్వుడనుట స్పష్టము. ఈ రాఘవాంకుని హరిశ్చంద్ర కావ్యములో నక్షత్రక పాత్రము కానవచ్చుచుండుటచే అది గౌరన కావించిన సృష్టియనుట పొసగదు. రాఘవాంకకవి తన హరి శ్చంద్ర కావ్యములో నక్షత్రకుని 'హుసి యసూయా నీచవృత్తి నిర్దాక్షిణ్య. నిష్కరుణ నీతిగళని పెసరుళ్ల హిరియ' (అసత్యము, అసూయ, నీచవృత్తి, నిర్దా క్షిణ్యము, నిష్కరుణ, అనీతి—వీనియందు పేరు పొందిన పెద్ద) (9—15) అని వర్ణించి యున్నాడు. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని కడనుండి సొమ్మును రాబట్టుటకై నక్షత్రకుడను తన శిష్యుని తకువు కాడుగా పంపదలచి అతనితో నిట్లనును.

> 'కొడు వొడవె బరలీ బారదె కెడలి కానన
> నడువె తగహిన విరిసి కెలవు దిన ఉపవాస
> బడిసిర్దు కెలవుదిన దేహ వను వెళ్లెందు నెవ
> వొడ్డి కెలవు దివన
> నడె వాగ దారి దప్పిసి తిరిపి కెలవు దిన
> పడియచియ్యు క్కాణె యిట్టింతు కెలవుదిన
> కెడిసి నుడిదనది యాయ్తెందు ధరె యఱియె
> నృపనం హుసిక నెనిసు—యెందను
> (9—16)

'తాను ఇచ్చెదనని చెప్పిన సొమ్మును ఇచ్చినను ఈయకున్నను కానన మధ్యములో అతనిని చిక్కుల పాలు చేసియు, కొన్ని దినములు పసు లుపడి యుండు నట్లు చేసియు, కొన్ని దినములు దేహ మనువు తప్పినదని నెపము పలికియు, కొన్ని దినములు మార్గ మధ్యములో దారి తప్పించి త్రిప్పటల బెట్టియు, కొన్ని దినములు దారిబత్తెము (పడిబియ్యము) తెమ్మని ఆన యిడియు ఈ విధమున కొన్ని దినములు సత్య పథమును తప్పునట్లుచేసి అత డొప్పిన గడువు

తీఱినదని లోకవెల్ల నెఱుగునట్లుగా అతనిని అసత్యవచనుని గావింపుము' అని విశ్వామిత్రుడాదేశించెను. అందులకు సమాధానముగా అతనికి నక్షత్రకుడిట్లనును.

'బిసి లాగి, బిరుగాళి యాగి, కడునెల వాగి
విషమాగ్ని యాగి నానాక్రూర మృగ వాగి
మసగి ఘోరారణ్య వాగి, గర్జిసి కవివ భూత
భేతాళ రాగి
హసివు నీరడికె నిద్రాలస్య వాగి, సం
దిసి హోగి, హొక్కల్లి హొక్కు, ధావలి గొళిసి
హుసిగ హుంకొళి సువెం భూభుజన సెస్పింద
బల్లిదర దా రెందను.'
(9—18)

ఉష్ణకిరణుడగు తపనుడై, సుడిగాలియై, కటికనేలయై, విషమాగ్నియై, నానాక్రూర మృగములుగా నయి గర్జించి, ఘోరారణ్యమై, గర్జించి కవియు భూతభేతాళగణమై, ఆకలి దాహము నిద్ర అలస భావములయి, సంధించి, పోయి, అతడు చొచ్చిన చోటెల్లచొచ్చి, కష్టముల పాలుచేసి, అతడు అసత్య మార్గమును అనుసరించునట్లు చేసెదను. నా కంటెను ఈ విషయములో బల్లిదు లెవరు కలరు?

రాఘవాంకుని యీ నక్షత్రకునికంటె గౌరన నక్షత్రకుడు ఇంకను గడుసువాడు. హరిశ్చంద్రుడు నతడు పెక్కిడుములపాలు జేయును. రాఘవాంకుడు తన పూర్వము ప్రచలితమై యుండిన చంపూపద్ధతిని కొంత అనుసరించి యున్నను, క్రొత్తగా షట్పదిలో ఈ కావ్యమునంతయు రచించి యుండుటనుచూచి గౌరనయు తన హరిశ్చంద్ర కావ్యమును చంపువుగా కాక ఒకే ఛందస్సులో—ద్విపదలో పాల్కుటికి సోమనాథుడు, గోన బుద్ధారెడ్డివలె రచించుట కుత్సాహము పొంది యుండవచ్చును. అట్లే రాఘవాంకుని నక్షత్రక పాత్రసృష్టిచే స్ఫూర్తిపొంది అంతకంటెను తేజస్వంతముగా గౌరన యీ పాత్రమును తన కావ్యములో ప్రవేశపెట్టి యుండవచ్చును. ఒక్కతెలుగునందు మాత్రమే కాదు. తమిళమునందుకూడ తరువాతి కాలమున వెలసిన 'హరిశ్చంద్ర పురాణము' కథా సంవిధానములో కన్నడకావ్యమునే అనుసరించి యున్నది. 'హరిశ్చంద్ర వెణ్బా' అను పేరుతో తమిళమున అంతకుముందే యొక కావ్యము వెలసియున్నను అది మనకు పూర్తిగా లభించుటలేదు. హొయసలులు తమిళ దేశముపై పరిపాలనము నెఱపిన కాలమున అదియు రాఘవాంకుని రచనముచే ప్రభావితమై యుండుట సంభావ్యము. ఈ విషయమును గూర్చి ప్రొఫెసరు టి. పి. మీనాక్షిసుందరముగారు ఇట్లు వ్రాయుచున్నారు.

'The sities of critical moments created by Viswamitra make the story full of tension almost reminding us of the melo dramatic stories of modern films. This plot construction has been attributed to Raghavamka, the great kannada poet of the thirteenth century. The Mahabharata version as found to-day agrees with his story and it is Susnected that it was his version that was later inter polated in to Mahabharata version of the south. This is the conclusion to which the learned editor of this work comes to (N. Basavaradhya)'*

దీనినిబట్టి హరిశ్చంద్ర కథలోని కొన్ని సన్నివేశములను. నక్షత్రక పాత్రమును తొలిసారిగా దక్షిణదేశ భాషలలో ఒక్క కన్నడమునందే కానవచ్చుచున్నదనియు, అదియే క్రమముగా ఇతర ప్రాంతములకు ప్రాకి, ఆయాసాహిత్యములలో చోటు చేసికొని యుండవచ్చుననియు భావింపదగును. ఈ పాత్రమునకు మూలమేదేని సంస్కృతములో నున్నదేమో యింకను పరిశీలింపవలసియున్నది. అట్టిది లభ్యమగుచో గౌరన కన్నడ కావ్యమును చూచి కాక సంస్కృతమునుండియే స్ఫూర్తి పొందియుండునని భావింపవలసియుండును. దక్షిణదేశములోని భారత ప్రతులలో కానవచ్చు హరిశ్చంద్ర కథా సన్నివేశములు ప్రక్షిప్తములను బసవారాధ్యుల యభిప్రాయము నిట గమనింపవలసియున్నది.

---

* Tamil and other cultures (Exterior relations of Tamil) Paper submitted to III Inter-national conference of Tamil studies, paris p. 23.

# అక్షర సంగమం

## దేవిప్రియ

నిశా హృదయాలయాలలో
వేలాడుతున్న దిగులు గబ్బిలాలమీద
గీతాలు రాసుకుని
నరాలు మీటుకుంటూ
ఆత్మవీధుల్లో తిరుగాడే మేధావులు
మరు భూముల్లో పూల దుకాణాలు.

వ్యవస్థా గుహాంతర్భాగాల్లో మేలుకొన్న
సత్యాలోచనా వివేచనా సింహాలు
కీకారణ్యాలు పర్వత సానువులు
మైదానాలు
కళ్ళు తెరిచేట్టు గర్జించి
అగ్ని ప్రవాహాలలో
ఆలోచనా కెరటాల సంచలనం కలిగించినప్పుడు
అస్తవ్యస్తంగా కలిసిన
ఈ అయోమయపు వర్ణ సమ్మేళనంనుంచి
ఒక విస్పష్ట నవ్యాజమూర్తి ఉద్భవించి
విడివడి ముందుకు నడవాలి
ఆ తేజోద్భవ సుముహూర్తం కోసమే
ఆ సమతోత్సవ సంఘటన కోసమే
పారాడుతున్న జలాలలో
తారాడుతున్న హాలాలతో
పోరాడుతున్న కరాలతో
మరి నేనూ సంగమించాను.

———

# పత్ స్నా ఆఫ్ రోడ్

## డా॥ కేశవరెడ్డి

మా సుక్కపంది పోయి తూరుపగిపిలో ఈనేసింది. దాని కా,,విలిగాసేదానికి పోయి ఆ రాతి రంతా అడివిలో ఏఁవేవి కష్టాలు పడినాఁవని!

'కసమాలం తినేది. అది పోయి అడివిలో పిల్లల్నినుకుంటే దాని క్కావిలి పడుండేదేంది' అని నువ్వను కుంటావు. పందుల్లేఁపోతే మాకు బతుకేందన్నా. ఇూవీ బుట్టా, నగా నట్రా అన్నీ మాకు పందులే గదా.

పొద్దు కరకరమని పోతుండగా నేనూ, మా వోడూ పందని ఎతుక్కుంటా బయల దేరినాం. సగం రేతిరిగ్గాని అది పిల్లలు గమకోనుండే తావును కనుక్కోలేకపోయినాం. ఆ కనుక్కునేది గూడా మా తెలివితేటలతో మేఁవు కనుక్కోలా. 'తోటిగువ్వ' దర్మఁవా అని కనుక్కున్నాం. ఆ గువ్వ గనక ఆనవాలు సూపెంచకుండా ఉంటే రెయ్యి తెల్లవాదులూ మేఁవు అడివిలో తిరగతా ఉండి ఉందుం.

నీకు తెల్దుగాని, తోటిగువ్వ పోలీసోనితో పఁవానం. అడివిలో యా మూల ఏఁవి జరిగినా తోటి గువ్వ పసిగట్టేస్తుంది. నానాగంపుజేసి గట్టు బయట పెట్టేస్తుంది. నోర్లేని పచ్చి అంటాఁవేగాని దానికుండే తెలివి మనిసికి యాడేది.

మా పంది ఒక తింట్రపొద కింద తావు జూసుకుని ఈనేసింది. ఈ తోటిగువ్వ [1]పొదమింద గూసోని ఏవిలుకు లేకుండా గిక్కూకూ గిక్కూకూ అని అగస్తా ఉంది. దాని ఆనవాలు బట్టుకుని పొద ఉంటే దిక్కుగా మేఁవు నడిసినాం. పొద ఇంగ నాలుగు బారల దూరంలో ఉండంగానే తోటిగువ్వ రెక్కలు గొట్టుకుంటా లేచి ఎగిరిపోయింది. అది రెక్కలు గొట్టుకుంటా ఎప్పుడు లేసిందో, పొదలో ఉండే పంది బయటకొచ్చి పులిమాదిరి మా మీద పడంది. ఇట్ట జూడన్నా—పొదం మొదులు కోని లోతొడ వరకు అది ఎన్ని కాట్లేసిందో సూడన్నా. గాయాలు మానేదానికి ఆరు నెల్లు పట్టింది. తినేది కసమాల వే ఐనా పందికుండే రోసం జూడు.

ఐతే మావోడు మాత్రం ఒక కాటుగూడా తినలా. ఆ పొద్దువాడు లేచినేళ మంచిది. పంది పొదలోంచి దూకంగానే వాడు దగ్గిరగా ఉండే సిగ రెప్పెట్టెక్కి కూర్చున్నాడు సిగర కొమ్మలు పెళుసని, ఇరిగి పోతాయనీకూడా వాడు సూస్కున్నోడు కాదు.

ఇప్పుడు ఈ [3]కనాలను సూస్తా ఉండంగానే నీ కండ్లు [4]బెమిసిపోతా ఉండాయి. గాయాల్ను సూసుంటే నీ గుండెకాయి ఆవులించిపోయి ఉండును.

ఆ పందికి మా మింద ఇంతకంటు[5] ఏఁవిటి కంటావా? మేఁవు దాని పిల్లల్ను దానికక్కకుండా జేస్తాఁవని దాని బయం. మూర్కపుజాతి గదన్నా అది. నా, తన అని కానుకుండే ఇంగితం యాడిది.

ఇన్నికాట్లు దిన్నాక నువ్వైతే 'థూ నీయమ్మను మాదిగోడెత్తుక పోననీ' అనేసి దాన్ని అడివి లోనే ఇడిసిపెట్టేసి సక్కా నొచ్చేసుందువు.

అట్ట వొచ్చేసే దానిక మాకు యాడ తీరింది మేఁవు వొచ్చేస్తే నక్కలూ, ఎలుంగొడ్లూ ఒక్క[6] పలుగునన్నా దక్కనిచ్చునా. కజ్జాల్నావిల్లట్టు నవిలే సుందును. అప్పుడన్నా మన కడుపేదా కాలేది.

ఎట్టవో ఒకట్ట పందిదగ్గిర తప్పించుకోని నేను గూడా సిగిరెప్పెట్టెక్కి కూచున్నా.

నేనుండే కొమ్మకూ మావోడుంటే కొమ్మకూ మద్దిన బారెడ దూరం ఉండాది. నా పాదాలు,

---

1. పొద వినాడ. 2. అపరామంగా.

3. మచ్చలను (Scar marks) 4. భ్రమసి.

5. కసి. 6 పంది పిల్లలు.

కాళ్ళు, తొడలూ పచ్చిపుండ్లయి పోయుండాయి. నెత్తురు సుక్కలు సుక్కలుగా కిందకు [7]రాలాటం మొదులు పెట్టింది. [8]రణవాయువు గమ్మేస్తిందని బయపడిపోయినా నాకు ఇన్ని గాయాలయ్యుండాయని మావోనికి అప్పుడు దెల్లా. నెత్తురు సుక్కలు నేల మిందుండే ఎండినాకుల మింద టప్పు టప్పని రాల్తా ఉంటే మావోడు మంచు నీళ్ల రాల్తా ఉండాయను కున్నాడంట.

నేను సెట్టెక్కంగానే పంది ఎనక్కు మల్లు కుని పొదలోకిపోయి సలుగుల పక్కన పడుకునింది. అంతనెప్పిలోగూడా నేను ఆతం పట్టలేక మెడ సాంచి సులుగులెట్టుండాయోనని సూసినా. ఇరవై [9]సలుగులు— ఒక్కొకటి దోసకాయంత—[10]ఎన్నిట్లో కంటకి [11]గోరగిస్తా ఉండాయి. అవి కంటబడంగానే నాకు [12]లబ్బి దొరికినట్టయింది. ఆ సంతోసంలో గాయాలూ, నెప్పి అన్నీ మర్చిపోయినా. లేకపోతే రణవాయువు కమ్మేసి సచ్చుందును.

ఆ నెత్తురట్ట ఎంతసేపు కారిందో —నాకు జ్ఞాపకంలా. నా పానాలన్నీ సలుగులమిందనే ఉండాయి. [13]ఆపిటిమింద ఏదన్నా వొచ్చి పడ్తిందోవోనని సూస్తాకూచున్నా.

రెయ్యి కాంగకాంగ గాయాలు పక్కులు గట్టి నెత్తురు కారాటం నిల్చిపోయింది. పక్కులు గట్టినాక నెప్పి ఇంగా జాస్తయింది. కాళ్లుకొంచిం కదిలిస్తే పాలు [14]బిలేటుతో కోసినట్టు పైపానం పయిన్నే పోతా ఉంది. [15]ఈటి సేత బట్టుకుని [16]బార్తం కాడు ఇలా వంతుడు గూసున్నట్టు కదలకుండా గూసున్నా.

నాకత ఇట్టుండే ఇంగొక పక్కనించి నక్కల రావిడి మొదులయింది. నేను తొల్నుంచి బయపడ్తా ఉండిన పకారంవే నక్కలొచ్చేసినాయి. వొచ్చేసినాయంటే అట్టా ఇట్టానా. తెల్లారేదాకా అవిటకే మాకు రామ రావణ యిద్దిం జరిగింది గదా.

తొలీత ఒక నక్క వొచ్చింది. ఇంకాసేపిటికి తూరుపున గుడ్డిసుక్క పుట్టబోతందనంగా వొచ్చింది. మరపరార్డసందున అణుక్కోని అణుక్కోని వస్తా ఉండంగా సూసినా. అది మోరపైకెత్తి గాలిలో వాసన పట్టుతా తింటపొద కాడికిపోయింది. పొదసుట్టూ ఒకసారి తిరిగింది. నేను సిగస్పెట్టు మింద గూసోని ఆ తా సూస్తా ఉండా. ఈటె పైకెత్తి సరిగ్గా దాని రొమ్ముకు గురిపెట్టినా. ఇంగ ఏదన్నావను కుంటా ఉండంగానే అది తోక పైకెత్తుకుని చివ క్కని పొదలోకి దూకేసింది.

ఐతే సలుగులేనీ [17]సాదం కాలా. నంద్రుడకాయల నే గుంతనక్క ఇది. దీని ఆగిడాలు సుక్కపండి దగ్గర జరుగునా నక్కపొదలో పడంగానే పంది మెగుపుతీగి లేసినట్టు లేసిందన్నా. లేసి నాలుగ్గాళ్ల మింద నిలబడకోని ముట్టితో ఒక కుమ్ముకుమ్మింది. ఆ కుమ్ముకే నక్కకు బ్రరేవిక విరిగిపోయినాయి. అది కీసరమని అర్సి పాదబయట రొండుబార్ల దూరాన దబ్బని పడిపోయింది, పేడతట్ట పడినట్టు పడి నాలుగ్గాళ్ళు తన్నుకుంటా పైకి లెయ్యంగానే పంది కీ సిసమాదిరి పరిగెత్తొచ్చి దాని మెడమీద కోరలు దించింది. ఇంగ జూడాలన్నా ఆ నక్కపడిన అవస్త. పానం పొయ్యేట్టు ఇదుగులాడింది. కసువంతా అణిగి పొయ్యేట్టు దొర్లింది. అర్చింది. కూతలు బెట్టింది. ఏం జేసినా దాన్ని పంది ఇడిసి పెట్టలా. తొలి కాటుకు పీక తెంచేసింది. ఇంగొక కాటు ఏసి పొట్ట సించేసింది. ముట్టితో పేగుల్నిపట్టి ఈడ్చి పచ్చిక మిందేసింది. కాళ్ళూ. జబ్బలూ, మెడా, మూతీ అంతా నంజర నంజరగా కొరికేసింది పాపం. ఆ నక్క కొచ్చిన సావు తల్సుకుంటే నాకు ఇప్పుడుగూడా అయ్యో అనిపిస్తా ఉంది.

నక్కకు జిత్తులమారి అని పేరేగాని, దాని జిత్తులన్నీ నంద్రుడకాయల బొక్కల దగ్గిర్నే. పంది దూరిందంటే బీదుడు దూర్నట్టేగదన్నా. అది ముట్టితో కొట్టిందంటే పచ్చిరాళ్లు గూడా నెర్లు జీలిపోతాయి. ఈ పింగెలి జీవం ఒక లెక్క.

అప్పటికి తూరుపున గుడ్డిసుక్క పుట్టింది. 'ఇంగెంత సేపులే. సూస్తా ఉండంగానే పొద్దు

---

7. రాలుట 8. ప్రాణవాయువు (Shock) 9. పంది పిల్లలు 10. వెన్నెలలో 11. ఆకర్షి తీయంగా 12. నిధి 13. వావిమీద 14 బ్లేడ్ 15. ఈటె. 16 భారతం (మహాభారత నాటకం). 17. నష్టం 18. అమ్మ.

పుస్తుంది' అని మా వోడూ నేనూ ఒకరికొకరు ధైర్నిం జెప్పుకుంటా ఉండంగానే మళ్లీ నక్కల రాపిడి మొదులయి ది.

ఈసారి వొచ్చింది ఒక నక్కగాదు. నాలుగు వొచ్చినాయి. ముందొచ్చినక్క మాదిరే ఇది గూడా మరపరాళ్ళ సందున అణుక్కుంటూ వొచ్చినాయి. మోరలెత్తి గాలిలో వాసన పీలుస్తూ తీంట్రపాదకాడికి వడిసినాయి. పొదకు నాలుగు బారల దూరాన పేగులు బయటేసుకుని సచ్చి పడుండే నక్కను సూసినాయి. ఎత్తినడుగు ముందుకెయ్యకుండా ఆడనే నిలుచుకుని ఒకదాని మొకం ఇంకొగటి చూసుకున్నాయి. ఒకదాని చెవిలో ఒకటి ఏవో గుసకొట్టుకున్నాయి. నాలుగూ ఎనక్కుపోయి తలోక దిక్కునుంచి పొద దగ్గిరికి అడుగులో అడుగేసుకుంటా నడవాటం మొదలుపెట్టినాయి.

అదీ నక్కజిత్తులంటే. అన్నీ ఒక దిక్కునుంచే పోతే పంది దగ్గిర మిగిలిరావటం కుదర్దని తెలుసుకున్నాయి. నాలుగూ నాలుగు పక్కల్నించొస్తే—పంది ఒకటే ఉంది గదా—దాన్ని ఉప్పరపట్టి ఆడించొచ్చు అనుకున్నాయి.

నిజంగానే ఉప్పరపట్టి ఆడించినాయన్నా. ఆటి కడుపుల్లో ఉద్దూవు జొరండా సూస్తా ఉండంగానే రొండు సలుగుల్ను సంపి నోట్లో బెట్టుకొని బోయినాయన్నా.

నాలుగు పక్కల్నుంచి నాలుగు నక్కలు అడుగులో అడుగేసుకుంటా వస్తాఉంటే పంది కానుకోలా. బాగా దగ్గిరి కొచ్చేసినాక వాసనపట్టి కనుక్కొని లేచింది. లేస్తానే దానికంటికి తూరుపుక్కనించి వొచ్చె నక్క కనపించింది. నక్క కనపడంగానే అది ఎగిరి ఎకలించి దూకింది. పొదలో ఎగిరిన పంది నక్క ఈపుమీద వాలి జబ్బల్లో కోరలు దించింది. జబ్బల్లో కోరలు దిగంగానే నక్క ముందరి కాళ్లు మోకారించేసింది.

ఈడ ఇది రొండు ఇట్ట పానం వొచ్చేది పొయ్యేదైలవకుండా యిసేవాడతా ఉంటే, పడవర తట్టునుంచొచ్చినక్క 'ఇది రా సందు' అనుకునింది. అది తోకపైకెత్తుకుని నోరు ఇరకల కట్టి మారిగ తెర్సుకొని పొదలోకి దూకంది. నేను ఈటి గురి జూసి ఇసిరినా. ఈటి వంయ్యు నిపోయి దాని రొండు కండ్ల మద్దిన సుక్కబెట్టేనట్టు గుచ్చుకునింది. కపాలంలో దూరి ముచిలిగుంతలో బయటికొచ్చేసింది. అది తీంట్రపాదపైన ఒక మట్టెత్తు ఎగిరి ఇంగిబడి కొంచేపు కాళ్లు గిలగిల కొట్టుకొని ఊపిరి ఇడిసేసింది.

సరిగ్గా అప్పుడనంగా ఉత్తరం దిక్కునుంచొచ్చినక్క, దచ్చినం నుంచొచ్చినక్క ఎలసబోయి నూళ్లో దొంగలు జాంగబడినట్టు పొదలోకి దూకి రొండు సలుగుల్ను కొరికి నోటిగ్గిరిపించుకుని ఉరికినాయి. నా కడుపు దగోతరంగా కాలిపోయిందన్నా. రొండు సలుగులు. రొండూ రొండు సందమావలు మాదిరి మలంతా ఉండె. సిగర్జెట్టుమింద 2 కురోపోడు మాదిరి గూసోని తల్లతలా కొట్టుకున్నా.

ఆ పొద్దు నేను నిద్దర్లేసి ఎవుర్దో పీడమొకం సూసినా. సేతలార రొండు సలుగుల్ని పోగొట్టుకున్నా. పోయిన సలుగు లెట్టా పోయినాయిలే అనుకుటా ఉంటే ఆకీరుకు ఆ సుక్కపంది గూడా దక్కకండా పోయింది. అంతా తర్లాత. సెప్తా యిను.

రొండు సలుగులు పోవటంతో నాకు శోకాల్దిరిగిపోయింది. నన్ను నేను సమాళించుకునేదానికి రొండు జాంవులు బట్టింది. ఇంగ పజ్జెనిమిది సలుగులు మిగిలుండాయి. 2 అంటినన్నా దక్కించు బగమంతుడా అని ఆంజినేయుల్సామిని యేడుకుంటా సిగర్జెట్టుమీద అట్టనే గూసున్నా.

ఎంతసేపు కూచున్నా తెల్లారటంలా. కోళ్ళు కూయటంలా. తీంట్రపాదలో కొన్ని సలుగులు అప్పుడప్పుడే కండ్లు తెరిచి రెప్పలు తాటించుకుంటా లేచి గుడ్డోడు నడ్సినట్టు పడా లేస్తా నడవాటం మొదలుపెట్టినాయి. అట్ట నడిసే సలుగుల్ను సుక్కపంది ముట్టితో దగ్గిరికి తోసుకుంటా ఉంది. పొద బయట మూడు నక్కలు సచ్చి పడుండాయి. ఒకదాని తల్లో నే నిడిసిన ఈటి ఇంగా అట్నే గుచ్చుకోనుంది.

తూరుపున గుడ్డిసుక్క రొండు బారలెక్కింది. ఇంతలో నా ఎనకఉండే వోనులోనుంచి ఊళలు ఇనిపించినాయి. ఊళలు చెవిలో పడంగానే నాకు

---

19. తిరుగులేని వొకానొక జాడ్యం. 20. కుప్పించి.

21 అంగవైకల్యం గలవాడు (కుంటివాడు) 22. ఆఖరుకు 23. వాటినైనా 24. లోయ.

నోట్లో తేవ ఆరిపోయిందన్నా. ఊళల్నుబట్టి సూస్తే ఈ సారి నక్కలు యాభై అరవై దాక గుంపుగా వొచ్చేటు గా ఉండాయి. అవి గనక వొచ్చి పొదలో పడినాయంటే ఒక సలుగ్గూడా దక్కదు. నేనిట్ట ఆలాసిన చేస్తా ఉండంగానే నక్కల గుంపు వోను ఎక్కి వస్తా ఉన్నట్టు ఊళలు ఇనిపించి నాయి. బగమంతుడు పెట్టి జరగనీ అనుకొని చచ్చి స్నక్కతల్లో గుచ్చుకోనుండే ఈటె తీసుకు దారని చెట్టుదిగినా. ఈటెని ఊడ బెరుక్కుని మల్లుకున్నా నంతే—సుక్కపంది మొరస్తా వొచ్చి దెయ్యంబడినట్టు నా మింద బడింది. నేను గనుక కన్నుమూసి తెర్సి నంత సేపు 25 యేావారి ఉంటే అది నా సావు కండ్ల జూసి ఉండును. ఎట్ట తప్పించుకున్నానో[26] ఆ మండే వోనికి దెలవాల—తప్పించుకుని సిగర్సెట్టెక్కి కూసున్నా. పంది మల్లుకొని పొదలోకపోయి[27] పనుకునింది.

సేతిలో ఈటె ఉన్నాగాని నాకు దైర్నిం సాల్దా. నక్కలొచ్చి నన్ను పెరక్కతింటాయనిగాదు నా బయం. అవొచ్చి సలుగుల్ను నాశాదం జేస్తాయనే నా బయం. ఆ సప్పిడి నక్కలకు మనుసల్దగ్గిరికొచ్చే గుండెకాయి యాడిది. అవిటికి యాావారేదంతా ఇట్టా సలుగులు, కోళ్లా, ఎలికులు ఎంటవలూ—ఇట్టాడివేగదా. మనిసి గాలి కంటెగ్గనిసిస్తే అవి ఆపడదూరం పరిగెత్తి పోయి ఆడినించి తిరిగి సూస్తాయి. అవి యాభై రానీ, డెబ్బైరానీ నేను గనక చెట్టుదిగి గోసి ఎగ్గట్టుకుని కిలారించి, ఏయ్ ఇంగా ఉండారా ఆడ. నీ యమ్మల—' అన్నానంటే అవి తోకలు రొండు గాళ్లసందున బెట్టుకుని, సెవుల్జాడించుకుంటా ఉరకతాయి.

ఐతే సెట్టు దిగినానంటే పంది దగ్గిర పానం కాపాడుకునేది కష్టం.

ఆకాసిమ్మీద గుడ్డిసుక్క నాలుగు బార్లొచ్చే సింది. ఇంకొంచేపిటికి తొల కోడి కూయబోతింది. నేను అదర్తా అదర్తా తల తిప్పి సూసినానన్నా. యాభై నక్కలు. ఒగిటె గాదు. రెండు గాదు. యాభై నక్కలు. అడుగులో అడుగేసుకుంటా మరప రాళ్ల సందున అణుక్కొని వస్తా ఉండాయి. పొదలో సలుగుల సందమావలు మాదిరి మలగతా ఉండాయి. కొన్ని తల్లి పొట్టమింద పనుకొని పాల్దాగతా ఉండాయి. ఇంకొన్ని కడుపునిండ పాల్దాగి కీసుకీసుమని అరస్తా తల్లి సుట్టూ తిరగతా ఉండాయి.

ఎట్టన్నాసరే. సలుగుల్ని కాపాడుకోని ఇంటికి దీసకపోవాలని గెట్టిగా మనుసు జేసుకున్నా.

నక్కలన్నీ కూడబలుక్కుని, మన పిలకాయలు మేకా పులి ఆట ఆడేటప్పుడు నిల్చుకుంటా ఉండ్లా అట్ల తింట్రపొద సుట్టూ నిల్చుకున్నాయి. మెల్లమెల్లగ అడుగులేస్తా దగ్గిరికొచ్చి పొదను కమ్ముకున్నాయి.

ఇంకొంచేపిటికి అవి పొదలోకి దూకపోతా యనంగా నా కొక ఆలాసిన తట్టిందన్నా. ఆ ఆలాసిన రాంగానే నాకు వొళ్లంతా సెవట పట్టేసింది. ఇప ముండ్లు దిగినట్టు వొళ్లంతా వణకతా ఉంది. కుడి సేతో రోటిపై కెత్తినా. కుడిభుజం వణకతా ఉంది. ఎడమచేత్తో ఆ భుజాన్ని తట్టినా గురిజూసి, పండ్లు గర్సుకుని ఈటెని సుక్కపంది మీదికి ఇడిసినా. ఈటె రయ్యినిపోయి చక్‌మనే శబ్దంతో పంది రొమ్ములో దూరి పుక్కన ని ఈపువీదెల బారొచ్చే సింది. పంది అడివి వోక్కొట్టపోయేట్టుగా అగిసి పొదలో నుంచి బయటికి దూకి, కసువుమీద దొల్లాడేదానికి మొదులుపెట్టింది. దాని గోదు సూడలేక నేను కండ్లు మూసుకున్నాను.

నేన్జేసుకున్న కర్మం జూడన్నా. సలుగుల్ను కాపాడుకోబోయి తల్లి పందినే సంపుకుంటి. ఏంజేసే దన్నా. ఒగిటా రెండా. పజ్జెనిమిది సలుగుల్ను సు స్తా సూస్తా నక్కల నోట్లో ఎట్ల బెట్టుదు. పోతే పోతింది ఒక ముసలిపంది అనుకుని ఆ పన్జేసినా.

ఒక లెక్కనజూస్తే నేన్జేసిందే రైట్టనిపిస్తింది. యాభై నక్కలు పొదసుట్టూ కమ్ముకోనోసా ఉంటే ఎవురుమాత్రం ఏంజేస్తారు. కీళ్ళాడిపోయుండే పందిని జూడాల్నా? అప్పడే పుట్టి [29]పుడ్సెండ్లు మాదిరుండే సలుగుల్ను సూడాల్నా. కన్ను గలిగినోడెవుడైనా నేన్జేసిన పని జేస్తాడు.

---

25. అజాగ్రత్తగా 26. ఆ సూర్యునికి 27. పడుకొన్నది 28. నష్టం 29. బంతులు.

అజ్జరిగిన నెలనాళ్లు నా కడుపులో [30]ఏపిస్తానే ఉండిందన్నా. ఒకసారి పంది కలవర్లోగూడా కనబడింది.

కనపడ్తా [31] మడి. అది నన్ను నమ్ముకోమండిన జీవం గదా. అది నా కండ్లముందరే పుట్టింది. దాన్ని బిడ్డన్నాకిసట్టు సాకినా. నా కండ్లముందర పుట్టిన జీవం నా కండ్లముందరే నా చేతుల్లోనే పానం ఇడిసింది.

ఊఁ — ఎప్పుడో జరిగిపోయిన్దానికి ఇప్పుడు వాగిసేదేంది. సలుగుల్ను కాపాడుకుందామని ఇంత జేస్తిని. పోయిన సలుగులు రెండు పోంగ మిగిలిన వాటిమింద ఈగవాలకుండా కాపాడుకున్నా.

సుక్కపంది పానంతో ఉన్నంతసేపు ఈ గుడ్డి నక్కలన్నీ బిక్కమొకా లేసుకొని నిలుచుకోనున్నాయి. అదట్ల సావంగానే ఇవన్నీ సూరాకొల్లిడిస్తే పిల కాయలు ఉరకలా అట్ల ఉరికినాయి తీంట్రపాద మీదికి. నేను కిలారిస్తా చెట్టుమీదనుంచి దూకి ఈ చేతకొక రాయి, ఆ చేతికొక రాయి [32]బీజారుకుని నడుంవెత్తి సూద్దును గదా—ఒక నక్క జెప్ప. ఒగటంటే ఒగటి. తోకలు రెండుగాళ్ల సందున పెట్టుకుని కొన్ని మరపరాళ్లమింద నాలుగ్గాళ్ల పరుగన పరిగెత్తా ఉండాయి. ఇంకొన్ని [33]లవోనులో దుమ్ము లేపుకుంటా ఇది మిట్టా ఇది పల్లము అని సూడకుండా పరిగెత్తా ఉండాయి.

అప్పటికి తొలికోడి కూసింది. తూరుపు పట మెగిరింది. గుడిసుక్క మసకైపోతా ఉంది.

మా వోడూ నేనూ ఇద్దరూగల్సి తీంట్రపాదను పడదోసినాం. నేను [34]వోనులోకిపోయి నాలుగు ఎదుర్లు కొట్టకొచ్చి దబ్బల్జీల్చినా. ఎదుర్దబ్బల్తో, తీంట్రతీగల్తో రెండు గంపలల్లినాం. సలుగుల్నెత్తి ఒక గంపలో ఏసినాం. సుక్కపందినెత్తి ఇంగొక గంపలో ఏసినాం. సెరొక గంపనెత్తి నెత్తిన పెట్టుకొని మాటాపలుకూ లేకుండా ఇంటిదోవ పట్టినాం. కరకరమని పొద్దు పుట్తా ఉండగా ఊరు జేరినాం.

---

30. దేవుతూనే 31. మరి 32. సేకరించుకుని 33. లోయ 34. లోయ.



# సాహిత్య రసికత

## శ్రీ టి. జి. కృష్ణారావు

'గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్'—అని ఒక సూక్తి వుంది. ఈ సూక్తిలో నిజానిజాలెలావున్నా తరచుగా దీన్ని ఆమోదించే వారిని చూస్తూ వుంటాం.' ముఖ్యంగా తమకంటె చిన్న వాళ్లతో మాట్లాడేటప్పుడు, ప్రతిఒక్కరూ పూర్వ కాలంలోని గొప్పతనాన్ని ప్రస్తుత పరిస్థితుల్లోని లోపాలని ఉద్ఘోషిస్తూ వుంటారు. మారుతున్నకాలం ఒక తరంవార్ని వెనక్కి నెట్టేసూ వుంటే, వాళ్లు, తమ తర్వాత తరంతో సమంగా అడుగు వెయ్యలేక పోతూ వుంటారు. అలా ముందంజ వెయ్యగల వాళ్ళు కొద్దిమందే వుంటారు. వెనకబడ్డ వాళ్లు గత స్మృతులని నెమరువేసుకుంటూ, వాటినే ఉన్నతమైన విలువలగా భావిస్తూ గతంలో జీవిస్తూంటారు. నిజానికి ప్రాత క్రొత్తల సంఘర్షణ నిత్యం జరుగుతూ, నిగ్గు తేలుతూ వుంటుంది. అటువంటప్పుడు ప్రాతవన్నీ మేలైనవనీ ఈనాడు అవన్నీ నశించిపోయాయనీ విచారించడం అనుచితమౌతుంది. సాహిత్యంగాని, విమర్శనగాని అన్ని దేశ కాలాలలోనూ వుంటాయి. వాటికి క్షతిలేదు.

నిజం యిలా వుండగా శ్రీ పొట్లపల్లి సీతా రామారావుగారు '73 డిశంబరు నెల భారతిలో 'సాహిత్య రసికత' అనే వ్యాసం వ్రాస్తూ ప్రారంభం లోనే 'ఈ దేశములో సాహిత్య రసికత చచ్చి పోయినది' అన్నారు. దానికి కారణాలు అనేస్తూ 'ప్రాథమికులైన వారికిప్పుడు భాషాశాస్త్ర బోధనము చేయుచున్నారు. సాహిత్యముపై మోజు తగ్గిపోవుటకు అదియొక ప్రధాన కారణమని నా అభిప్రాయము' అని వ్రాస్తున్నారు. ఒకపక్క భాషాశాస్త్రాధ్యయనాన్ని దుమ్మెత్తిపోస్తూ మరొకప్రక్క డాక్టరేటు డిగ్రీనీ, పరిశోధన గ్రంథాల్నీకూడా 'వ్యర్థ వ్యాసంగములు'గా నిర్ణయిస్తున్నారు. ఇంకా 'విమర్శనశక్తి కేవలము వంది మాగధ స్తోత్రప్రాయముగనో వ్యక్తిగత నిందా పూరితముగనో మారినది.' అంటున్నారు. సత్యాన్వేషణ బుద్ధితో ఈ విషయాలన్నిట్నీ పరామర్శించడమే, ఈ వ్యాస ప్రయోజనం.

మొదట శ్రీ సీతారామారావుగారు చెప్పినట్లు 'సాహిత్య రసికత చచ్చిపోయినది' అనేది ఒప్పుకుంటే అది ఎప్పటినుండీ చచ్చిపోయిందీ కూడా ఆయనే చెప్పారు. 'మొన్నమొన్నటివరకు కూడ విశ్వవిద్యాలయములలోని ఎమ్. ఏ. పట్టభద్రులు తమ రసజ్ఞతను నిరూపించుకొనుచునే వచ్చినారు. ఒక దశాబ్దినుండి చదువుల తీరుతెన్నులు మారినవి. సాహిత్యముపై గౌరవము తగ్గిపోవుచున్నది' అంటున్నారు. అంటే ఒక దశాబ్దినుండి మాత్రం ఈ మార్పు వచ్చిందనీ, అంతకుపూర్వం 'ప్రభువులు, జమీందారులు, తెలుగులో పండిత పదవు లలంకరించినవారు, తెలుగు ఎమ్. ఏ. పట్టభద్రులు—ఈ రసజ్ఞతను చాలవరకు కాపాడుకొనుచ వచ్చిరి' అంటున్నారు. ఇప్పుడు ఈ రసజ్ఞత పోయిందనడానికి నిదర్శనం 'ఎక్కడ చూచినను శబ్దార్థ మాత్ర నిర్ణయ నీరస శుష్కవాగ్వాద కోలాహలములే' అంటున్నారు.

ఒక దశాబ్దం క్రిందట, శ్రీ సీతారామారావుగారి దృష్టిలో సాహిత్య రసికత చచ్చిపోకముందే ఈ దేశంలో పండితుల మధ్య శబ్దాల సాధుత్వాసాధుత్వాల గూర్చి వాదోపవాదాలు పెద్దపెట్టున జరుగుతూండేవి. ఒకరితో ఒకరు అరసున్నాలూ, బండిరాలూ ఎక్కడ వుండాలనే విషయాలపైన సైతం వాగ్వాదం చేసుకొనేవారు. దానికి తోడు గ్రంథాలను ముద్రించడం క్రొత్తగా ప్రారంభించిన రోజులు కావడంచేత, పాఠాంతరాలలో సాధుత్వాసాధుత్వాలను గూర్చి అభిప్రాయ భేదాలు కోకొల్లలుగా వుండేవి. సాధుత్వ నిర్ణయంలో లాక్షణికుల సంగతి సరేసరి. శబ్ద నిర్ణయానికి

సంబంధించి ఈ వాగ్వాదాలు అనుచితమని నా అభిప్రాయం కాదు. ఈ వాగ్వాదాలు సద్విమర్శలో భాగాలే వాగ్వాదంలో రసపుష్టికి దోహదం చేసిన వాటినే సుశబ్దాలుగా, సరైన పాఠాంతరాలుగా గ్రహించే సత్సాంప్రదాయం నాటికీ నేటికీ వుంది. కాని 'శబ్దార్థ నిర్ణయ' వాగ్వాదాలు నీరసములు శుష్కములు కావు. సరైన శబ్దాన్నీ, అర్థాన్నీ నిర్ణయించినప్పుడే 'రస వ్యక్తి' కలుగుతుంది.

విమర్శ కేవలం వందిమాగధ స్తోత్ర ప్రాయంగానో, వ్యక్తిగత నిందాపూరితంగానో మారిందనేదానికి ఈనాటికంటే కొన్ని దశాబ్దాల క్రిందటే అటువంటి విమర్శ హెచ్చుగా వుందని చెప్పొచ్చు. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారికీ, శ్రీ కొక్కొండ వెంకట రత్నంగారికీ జరిగిన క్రింది విమర్శ పరిశీలించండి. కొక్కొండవారి ప్రసన్నరాఘవం గురించి వేదం వారిలా అంటున్నారు.

'ఈ గ్రంథమందు భాషాంతరీకరణము ప్రాయికముగా తప్పుగా నుండును. మూలమున కిది మూలముగను, దీని కది టీకగను ఉండును......ఛందో వ్యాకరణముల కిది వేరుపురువు......సావధానముగా తత్త్వ మరయువారు వీరికి సంస్కృతము తెలియదనియు, దేవనాగరలిపి తెలియదనియు, నాటక లక్షణము తెలియనే తెలియదనియు, ఆంధ్రభాషకు వీరు విషము పెట్టినారనియు, ఇతరుల గ్రంథముల గుణదోషములను చర్చించుటకు వీరు అధికారులు కారనియు, వీరి మతముచే భాష చెడుచున్నదనియు గ్రహింతురు......'

వీరి విమర్శను ఆనాటి విమర్శలకు ఒక ఉదాహరణంగా చూపుతూ, శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు 'విమర్శ వ్రాయునప్పుడు శబ్దగత దోషముల నేకరువు పెట్టుటయు, వ్యక్తి దూషణ చేయుటయు ఆవశ్యకములని తలంచినట్లుగా నాటి విమర్శ లున్నవి'— అని వ్రాసు న్నారు. దీన్నిబట్టి ఆనాటి విమర్శలలో వుండే వ్యక్తి దూషణని అర్థం చేసుకోవచ్చు. అంతే కాక వీరు శాబ్దిక చర్చలకే ఎక్కువగా ప్రాముఖ్యత నిచ్చేరని తెలుస్తోంది.

అముద్రిత గ్రంథ చింతామణిలో 'శ్యమంతక శబ్దవిచారము, వటుశబ్దప్రయోగ విచారము, పరిఘా పరిఘ శబ్దద్వయ సాధుత్వ విచారము, నాటకములలో పాత్రోచిత భాషయొక్క ఔచిత్య చర్చ, రేఫద్వయ విచారము' — మొదలగునవి వున్నాయని శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు వ్రాస్తున్నారు. దీన్ని బట్టి ఆ నాడు శాబ్దిక చర్చలకు ఇచ్చిన ప్రాముఖ్యం తెలుస్తోంది. ఈ విధమైన శాబ్దిక చర్చలు 'నీరసములూ శుష్కములూ' అయితే అవి దశాబ్దాల క్రిందటే ఎక్కువగా జరిగేయి కాని ఇటీవలికాలంలో మాత్రం కాదు. అధునాతనుల శాబ్దిక చర్చలు భాషా శాస్త్రంపై ఆధారపడి వ్యుత్పత్తి నిర్ణయ పర్యవసాయులై ప్రధానంగా వుంటున్నాయి. వాటిలో శుష్కతా, నీరసతా లేవు.

విమర్శలో వ్యక్తిదూషణ విమర్శకునికిగాని, కవికిగాని గల అహంకారాన్నిబట్టి వుంటుంది. విమర్శకునికి ప్రధానమైన లక్షణం సహృదయత. సహృదయత లోపించినప్పుడు ఈ దుస్థితి కలుగుతుంది. ప్రారంభంలో లేకపోయినా ఉభయపక్షాలవారూ తీవ్ర విమర్శలు చేసుకోగా పోను పోను చర్చ గిడసబారి పోతుంది. అప్పుడు వ్యక్తిదూషణే మిగులుతుంది. ఇటీవల శ్రీ విశ్వనాథవారి పక్షానికీ, శ్రీ కొత్త సత్యనారాయణచౌదరిగారి పక్షానికీ జరిగిన చర్చలిటువంటి స్థితిని చేరుకోగానే వాటిని భారతి పత్రికా సంపాదకులు ప్రచురించడం నిలిపివేశారు. శ్రీ శీకీ, అరసానికి జరిగిన వాదప్రతివాదాలూ ఇలాగే వ్యక్తిగతంగా రూపు దాల్చాయి. అవి సాహిత్య చర్చలనే కన్నా రాజకీయ సిద్ధాంత సంబంధులూ, వైయక్తికాలూ అనడం సమంజసం. వాటిని సాహిత్య చర్చలుగా భావించి, 'వ్యక్తి నింద' ఈ దశాబ్దపు విమర్శక లక్షణంగా భావించలేం. '...యేదీ లక్షణంబో, యలంకారంబో, పదబంధమో, రసమొ? చక్కం జెప్పుడా తప్ప'ని సహృదయంతో ప్రశ్నించే కవులూ, 'తలచుట్టువార గన్నులు గలిగిన బద్యంబు దప్పు గాదన వశమే?' అని నిష్కర్షగా ప్రశ్నించే విమర్శకులూ, తప్పు చూపిస్తే 'చెప్పిన గొడ్డేద మోము దన్నెదన్' అనే దురహంకారులైన కవులూ అన్ని కాలాలలోనూ వున్నారు. రాయలనాటి కాలంలోని కవులమధ్య వ్యక్తిగత ద్వేషాలూ, విమర్శలూ చాటువులలో ప్రతిఫలిస్తూనే వున్నాయి. అంతమాత్రాన ఆ కాలంలో సద్విమర్శలేదనిగాని, సాహిత్య రసికత చచ్చిపోయిందనిగాని అనలేం. దీపం ప్రక్కనీడలా సద్విమర్శ ప్రక్కనే కువిమర్శకూడా అన్నిచోట్లా

చోటు చేసుకుంటుంది. జగన్నాథ పండితరాయలకీ అప్పయ్య దీక్షితులకూ జరిగిన వాగ్వాదాలు వ్యక్తిగత నిందా పూరితాలు. తిరుపతి వెంకటకవులు కొప్పరపు వారి ఆశు కవిత్వధారని 'మూ తధార' అని నిందించిన కాలంలోకన్న నేడు సాహిత్యరసికత చచ్చిపోయిందనలేం. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'అనుభవాలూ—జ్ఞాపకాలూ'లో మితిమీరిన ఆ నాటిసాహిత్య రసికత చెప్పులతో కొట్టుకొనేదాకా వచ్చిన తీరు తెలిపారు. ప్రాచీన కవులు వ్రాసిన కుకవి నిందలన్నీ ఇటువంటి కువిమర్శలనే ప్రస్తావిస్తున్నాయి. కుకవి నిందలని బట్టి ఆ నాటి దుర్విమర్శ ఏ విధంగా వుండేదో తెలుస్తోంది. ఇవన్నీ కొన్ని శతాబ్దాల క్రిందటివి. ఆ కాలంలో అక్షరాస్యుల సంఖ్య చాలా తక్కువ. వారిలో కవులు చాలా కొద్దిమంది. పుస్తక ముద్రణ, ప్రచారము లేవు. అప్పటి సాహితీ వ్యవసాయ పరిధి చాలా తక్కువ. అలాంటి కాలంలో జరిగిన దుర్విమర్శ, వ్యక్తిదూషణ పరిశీలిస్తే సాహిత్య రంగాన్ని ఇవి ఎంతగా ఆవరించాయో తెలుస్తుంది. అక్షరాస్యత పెరిగి, ప్రచురణ సౌకర్యాలు పెరిగి, దేశం నలుమూలలకు సాహిత్యం వ్యాప్తిచెంది, నేటి సాహిత్య సృష్టి శతాధికంగా పెరిగింది. ఈ విస్తృత పరిధి గల సాహిత్య రంగంలో నేడు నిలిచిన వ్యక్తి దూషణ సాపేక్షంగా చాలా స్వల్పం. ఈ దృష్టితోచూస్తే సాహిత్య విమర్శలో సహృదయత బాగా పెరిగిందని అవగాహనౌతుంది. సహృదయతకి దోహదం చేస్తూ 'భారతి' ఏ విధంగా వ్యక్తిదూషణా భూయిష్ఠంగా మారిన విమర్శలను ప్రచురించడం మానిన సంగతి ముందే మనవి చేశాను. ఇది సువిమర్శకు దోహదం చేస్తూ, దుర్విమర్శన్ని దూరం చేయడంలో పత్రికలు నేడు నిర్వహిస్తున్న పాత్ర.

శ్రీ సీతారామారావుగారు కొన్ని కట్టుబడి సిద్ధాంతములు, కొన్ని పట్టులేని తార్కికోక్తులు కొన్ని ముసుగు కప్పిన మెరిమాటల సోహళింపులలో, అది (భాషాశాస్త్రం) శాస్త్ర మన్న అపోహ కల్గించుచు సాహిత్య జిజ్ఞాసను పూర్తిగా త్రుంచి వైచినది అని వ్రాస్తూ భాషాశాస్త్రం శాస్త్రం కాదంటున్నారు. భాషాశాస్త్రం ప్రపంచమంతా శాస్త్రంగా గుర్తిస్తూ వుండగా, అది శాస్త్రం కాదనడం దుస్సాహసమనక తప్పదు. గడచిన కాలంలో మనం సాహిత్యాన్ని భాషాశాస్త్ర దృష్టితో చదవలేదు. అవన్నీ ఆలంకారిక దృష్టితోనే చదువుకున్నాం. అయితే ఆలంకారిక లకి కూడా సిద్ధాంతాలూ, తార్కికోక్తులూ వున్నాయి. రస నిర్ణయానికై, విభావానుభావాదుల్నీ, సంచారీభావాల్నీ నిరూపిస్తూ ఆలంకారికులు చేసే కోలాహలానికీ, ప్రయోగించే తార్కికోక్తులకీ మేరలేదు. వీరికి లక్షణ నిరూపణ మీదున్న శ్రద్ధ, అర్థవ్యక్తిమీదా, రసవ్యక్తిమీదా లేదు. మల్లినాథుని తర్వాత ఏ వ్యాఖ్యాతా ఆలంకారిక చర్చలు ప్రక్కకుపెట్టి కేవలం శబ్దార్థాలలో వుండే ఔచిత్యం చర్చిస్తూ, సారస్యం చూపి, శిరఃకంపం కల్గించింది లేదు. ఇటీవల శ్రీ తాపీధర్మారావుగా రొక్కరే దీనికి అపవాదం. వారు ఈ ఆలంకారిక లక్ష్యలక్షణ సమన్వయాల రొంపిలో దిగలేదు. పరిశీలించగా 'కట్టుబడి సిద్ధాంతాలూ, పట్టులేని తార్కికోక్తులూ' ప్రాచీనాలంకారికుల విమర్శలలోనివేగాని, ఈ దశాబ్దంలోవారివి కావు.

భాషాశాస్త్ర దృష్టి లేకుండా కావ్యపఠనం జరగడంవల్ల ఇంకో నష్టం కూడా కల్గింది. పదాలకు వ్యుత్పత్తి నిర్ణయం సరిగా జరగలేదు. వ్యుత్పత్తి నిర్ణయం సరిగా లేకపోవడంతో నిర్దిష్టార్థాన్ని ఇచ్చితంగా చెప్పడం సాధ్యం కాలేదు. ఇటువంటి స్థితిలో పురాణాలవంటివాటికి తమ సిద్ధాంతాల కనుగుణంగా, స్వప్రయోజన సాధనకై మత ప్రవక్తలు తప్పుడు వ్యాఖ్యానాలు, అర్థాలూ తీసి కావ్యదృష్టికి బదులు మత దృష్టిని విజృంభింపచేసేటట్టు చేశారు.

అదిగాక ఈ నాడు ఆధునిక బాషాశాస్త్రాధ్యయనంవల్ల సాహిత్య రసికత చచ్చిపోయిందని భావిస్తే ఆధునిక భాషాశాస్త్రకారులకు శిరోధార్యాలుగా పరిగణింపబడుతున్న పాణిని శబ్దశాస్త్రం, భర్తృహరి 'వాక్యపదీయం' వంటి శాస్త్రీయ ప్రామాణిక గ్రంథాల నధ్యయనం చెయ్యడాన్నికూడా నిరాకరించాల్సి వస్తుంది. ఎందుచేతంటే సాహిత్య రసికతని ఖూనీ చెయ్యడంలో వాటికూడా భాగస్వామ్యముంటే కనుక. కాని ఆ సంప్రదాయంతోపాటు రసయిత దృష్టికూడా ఈ విషయాన్నంగీకరించలేము. శతాబ్దాలనుండీ పాణినీయం, వాక్యపదీయం వంటి శాస్త్రీయ గ్రంథాలను చదవడం జరుగుతోంది. రసయిత దృష్టిలో కేవలం ఒక దశాబ్ది

నుండి మాత్రమే కేవలం బొత్తిగా సాహిత్య రసికత చచ్చిపోయినట్లు కనిపిస్తుంది. అంతవరకు సాహిత్య రసికత నిలిచిందంటే అందుకు భాషాశాస్త్రాధ్యయనం దోహదకారి అయిందో—విరుద్ధంగా నిలిచిందో నా వంటి వారికి అవగాహన కాకుండా వుంది. భ్రమ—ప్రమాద జనితమైన ఈ విధమైన నిర్హేతుక ద్వేషభావాన్ని ప్రదర్శించడంవల్ల రచయిత తనకు ఆధునిక భాషా శాస్త్రం 'అందని ద్రాక్షపండు' అని వెల్లడి చేసు కన్నారు. లేకపోతే అది శాస్త్రంకాదనే 'అపోహ' వీరికి కలిగి వుండేదికాదు.

'పద్మినీ పద్మాత పత్రంబు...' అనే పద్యాన్ని శ్రీ సీతారామారావుగారు మెచ్చుకున్నారు. అలా మెచ్చు కుంటూ 'ఈ సీస పద్యపాదములలో పూర్వ భాగముల సమాసముల స్థానమున తెలుగు పదములు వాడినచో పద్యమునకు రావలసిన బింకము రా'దని వ్రాస్తున్నారు. శాస్త్రీయమైన దృష్టితో చూస్తే తెలుగు పదాలకి లేని 'బింకం' సంస్కృత పదాలకి వుందని అనుకో వడం పొరబాటు. 'బింకం' అనేది సంస్కృత పదమా, తెలుగు పదమా అన్నదాన్నిబట్టి కాదు ఏ పదమైనా పదునైనది కావడంలోనే వుంది. సహృ దయులు పరిశీలించేది కూడా ఈ విషయమే. కాని సంస్కృత పదాలతో సమాసం నిర్మించారా, తెలుగు పదాలతో నిర్మించారా అని కాదు.

శ్రీ సీతారామారావుగారు ప్రబంధ కాలంనాటి రచయితలపైనా, విమర్శకులపైనా ఒక అభాండం వేస్తున్నారు. 'ఎంతసేపటికి వారి దృష్టి పద్యరచన మీదనే. ఆనాటి రసజ్ఞుల ఆస్వాదనగూడ పద్యరచనా వైభవము మీదనే యుండెడిదేమో' అని. వారు చెప్పినట్లు 'పద్యరచనయందో, అనుప్రాస గమకము లందో సమాస నిర్మాణ కౌశలమునందో వారి దృష్టి కేంద్రీకరింపబడి తల యూచి మెచ్చుకొనెడివారు' అంటే ఆ కాలంలో కవిత్వపు బాహ్యనిర్మాణంపైగల దృష్టి, అంతర్నిర్మాణంపైగల దృష్టి, అంతర్ని ర్మాణంపైనీ అర్థవైభవంమీదా లేదన్న మాట. ఇది ఆనాటి రచయితల్నీ విమర్శకుల్నీ ప్రశంసించడమో అభిశంసించడమో తెలీడంలేదు. బాహ్యమైన అను ప్రాసాదులపై దృష్టి కేంద్రీకరించిన కాలంలో సాహిత్య రసికత వుండి, నేడు చచ్చిపోయిందని వారెలా భావిస్తున్నారో ?

ప్రాచీనాలంకారికులు సైతం శబ్దాలంకారాల కంటే, అర్థాలంకారాలనే ఉన్నతమైనవిగా భావించారు. శబ్దాడంబరాన్నీ, వ్యామోహాన్నీ వారెంత నీచంగా చూసేవారో శ్రీ సీతారామారావుగారికి తెలిసినట్టు లేదు. అసలు వారికి శబ్దాలంకారంపైనా, అను ప్రాసలపైనా తగనిమోజు. ఈ విషయం వారు మెచ్చుకున్న పద్యభాగాలనిబట్టి తెలుస్తుంది. ముందు ముందు వారి ఉదాహరణల్లో శబ్దాడంబరాన్ని చూసి ఎలా మురిసి పోయిందీ మనం చూస్తాం.

పరిశోధన వ్యాసంగాన్ని వారిలా విమర్శిస్తు న్నారు. 'ఈ పరిశోధన వలన లాభమేమి? మతి, బుద్ధి, ప్రజ్ఞాదులు మేధ సాధించెడి ఫలములు. గ్రహణ ధారణాది శక్తులు మతి, బుద్ధి విలసిత ములు. స్మృతిశక్తి మరియు ప్రాథమిక స్థితిలోనిది. మేధ, స్మృతి, మతి బుద్ధి సోపాన పరంపరయు ప్రజ్ఞా సమన్వితముగా విలసిల్లుచు పోవలయును. పరిశోధనలలో ప్రజ్ఞాభాగవికసనము ఉండదు. మేధ సాధించెడి అల్పప్రయోజకముతైన మతి బుద్ధి భాగములుండును. లోకములో సాహిత్య వైభవ మంతయు ప్రజ్ఞాప్రతిభాదుల లీలావిశేషము మాత్రమై యున్నది.' ఇందులో మతి, బుద్ధి ప్రజ్ఞ అనే విభజన, వాటిని గూర్చిన సిద్ధాంత నిర్ణయాలూ వున్నాయి. ఈ విభజన ఎంతవరకూ శాస్త్రీయం ? ఈ సిద్ధాంతాలు ఎంతవరకూ ఆమోద యోగ్యాలు ? సహృదయులే తేల్చి చెప్పాలి.

పరిశోధనా వ్యాసంగంలో ఒక కాలంలోని కవి రచించిన గ్రంథంలో ప్రతిబింబించిన సాంఘికాచారా లనీ, రాజకీయ పరిస్థితుల్నీ చారిత్రక దృష్టితో విమ ర్శించడాన్ని కూడా వీరు వ్యర్థవ్యాసంగంగా భావి స్తున్నారు. దీనికి కారణం శాస్త్రీయ దృష్టి లేక పోవడమే—శాస్త్రీయ దృష్టితో ఒక కావ్యంలో పదాల్ని ఏ భాషలోనుండి గ్రహించినవో వాటి ఆదానం ఏ కాలంలో జరిగిందో ఇత్యాదిగా పరిశోధన చేయడం గ్రంథ రచనాకాల నిర్ణయంలో అత్యంతోపయోగకరం అని వారికి తెలిసినట్టులేదు. సాహిత్యంలో ఒక ప్రత్యేక సాహితీ ప్రక్రియ ఏవిధంగా అవతరించి వికాసాన్ని పొందిందీ (ఆంధ్ర ప్రబంధము—అవతరణ వికాస ములు), ఒక ప్రత్యేక సాహిత్యశాఖ ఏయేకాలాలలో,

ఏయేస్థలాలలో—ఏయేరూపాలతో వ్యాప్తి చెంది గుబాళించినది (యక్షగానములు), ఒక భాషా సాహిత్యంపై వేరొక భాషా సాహిత్యం ప్రభావం ఏవిధంగా వున్నది (తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం), కాలానుగుణంగా సాహిత్యంలో నిలిచే సంప్రదాయాభిజ్ఞత—పరిణామాన్ని పొందే నూతన ప్రయోగాల ధోరణి (ఆధునికాంధ్ర కవిత్వము—సంప్రదాయము—ప్రయోగములు), ఒక భాషలోని శబ్దజాలాన్ని—వాక్యప్రయోగ ధోరణులను సంస్కరించే వ్యాకరణ వికాసం ఏవిధంగా జరిగినదీ (తెలుగు వ్యాకరణ వికాసము)—మొదలైన అనేకానేక విషయాలపైన కూలంకషమైన పరిశోధన జరిపి, బహుముఖ ప్రజ్ఞావంతులైనవారిచే ఆమోదించబడేటట్లు స్థిరమైన సిద్ధాంతాలను రూపొందించే పరిశోధనా వ్యాసంగాన్ని ఈ రచయిత నిరాకరిస్తే అది పిల్లి కళ్ళు మూసుకున్న చందంగా వుంటుంది. పరిశోధన అనే పద్ధతి ఈ నాటిదా? మన ఒక్కభాషకే చెందినదా? పూర్వులుగాని, ఆధునికులుగాని ఇతరులెవ్వరూ ఈ పరిశోధనా వ్యాసంగాన్ని చేపట్టలేదా? విశ్వవ్యాప్తంగా ఆచరణలోవున్న పరిశోధనా వ్యాసంగం ఏ విధంగా పరిత్యాజ్యం? అనే ప్రశ్నలకు సమాధానాలను తెలుసుకుంటే రచయిత ఈ నిష్కారణంగా ఆవేదన పొందడంపట్ల మనకు జాలి కలుగుతుంది. రచయిత డిగ్రీ పొందలేక పోవడం చేతనో, పరిశోధన చేయలేక పోవడంచేతనో, పదవి లభించక పోవడంచేతనో కలిగిన అసంతృప్తిని ఈ వ్యాసముఖంగా వెల్లడించుకున్నారని అనిపిస్తుంది.

ఈ దశాబ్ది సాహిత్య విమర్శకు 'వందిమాగధ స్తోత్ర పాఠంగా' వుండడం అనే లక్షణాన్ని శ్రీ సీతారామారావుగారు ఆపాదించారు. కాని ఇటీవల కాలంలో గ్రంథ సమీక్షలలో ఎక్కడా వందిమాగధ స్తోత్ర పాఠాలు వినిపించవు. కాగా శ్రీ సీతారామారావుగారే ఈ దోషానికి పాలయ్యారు. 'ఇనుగంటి న్నినుగంటి...' అనే పద్యంలో 'శబ్ద విన్యాసము పోవని పోకడలేదు. భావసౌందర్యము తిరుగని మలుపు లేదు. రచనాబంధము ఒదుగని తీరులేదు. ఇక్కడ కేవల శబ్దపటాటోపము, మాత్రమే యున్నచో పద్యమునకు సొగసులేదు...అని పూరకే స్తోత్రం చేశారు కాని ఆ భావ సౌందర్యాదులేవో సెలవిచ్చారుకారు. ఇందులో ఉక్తివైచిత్ర్యంవుందనీ, రాజవిషయికమైన కవి రతి గుణీభూతమైందనీ అలంకారికమైన పడికట్టు రాళ్లతో వెలకట్టేరేగాని, సారస్యం చూపలేక పోయారు. ఈ పద్యం నిజానికంత ఘనంగా మెచ్చుకోవాల్సిందేం కాదు. చిన్నరాయాధిపుడికి సూర్యుడితోనూ, చంద్రుడితోనూ, మేఘుడితోనూ అభేదాన్ని వర్ణించాడు కవి. అంటే ప్రతాపంలో, కీర్తిలో, దానంలో ఈ రాజుకి వారితో పోలిక చెప్తున్నాడు. ఇందులో రాజును మెప్పించి నాలుగు కాసులు సంపాదించుకోవడమేగాని అంతకంటె పెద్దవిషయాలేం లేవు. ఇలా నేను చెప్తేవారు నా హృదయం 'రసించ' లేదంటారు. 'దీనిలో రసము వ్యంగ్యమగుచున్నదా?—మాటల గారడీపలె మున్నదే'—అనే విమర్శలున్నాయని చెప్తూ 'వానితో ప్రస్తుతము ప్రమేయము లేదు' అని తప్పుకు పోతున్నారు.

అదలా వుండగా ఇంకో అభియోగం ఏమిటంటే అష్టవిధనాయికాభినయాల్ని గ్రహించగల్గిన పామరులకి పూర్వంవుండే రసజ్ఞత ఈ నాటి విద్యాధికులకు లోపించిందని. ఒక కాలంలో ఈ విధమైన అభినయాలు ప్రచురంగా వుండేవి. అప్పుడు వాటిని విభజించడానికి ప్రజలు అలవాటుపడ్డారు. ఆ నాటి వారి విమర్శకు కొలబద్దలు అభినయంలో ఆ నాటికి అమలులోవున్న శాస్త్రీయమైన 'ముద్రలు'. ఈనాడు అటువంటి ప్రదర్శనలుంటే, ఆ శాస్త్రజ్ఞానం ఈ నాటి వారికీ వస్తుంది. ఇది ప్రజలు కళలను కొలిచే కాలమానానికి సంబంధించిన విషయం. వారు అధునాతన కళలకి వేరే కొలమానాలు వుపయోగిస్తున్నారు. నేటి సినిమాకళని నిశితంగా అనేక కోణాలనుంచి విమర్శిస్తున్న ప్రజలకు విమర్శన దృష్టిలేదనిగాని, రసదృష్టిలేదనిగాని అనడం పొరబాటు. నయాపైసల లెక్కలు కట్టేవారికి, రూపాయిలూ, అణాలూ, పైసలూ తెలియనంతమాత్రాన వారికి గణితశాస్త్రం రానట్టుగాని, గణితశాస్త్రం నశించిపోయినట్టుగాని కాదు కదా. అలాగే సారస్వత విమర్శలోనూ, నృత్య విమర్శలోనూకూడా క్రొత్త రీతులు ఏర్పడ్డం, క్రొత్త కొలబద్దలు ఉపయోగించడం పరిణామక్రమంలో వచ్చిన సత్ఫలితాలేగాని 'సాహిత్య రసికత చచ్చిపోవడం' కాదు. పై పద్యం మెచ్చుకోలేక పోవడానికి 'పరప్రభుత్వ పరిపాలనము దుష్ఫలితం'. 'నేటి విద్యా సంస్కర్తల అసమర్థత' కారణాలుగా వీరు భావిస్తున్నారు. ఇలా పద్యంలో

లేని సొగసుల్ని ఉన్నట్టుగా భావింపజేయలేక పోవడానికి విద్యాసంస్కర్తం అసమర్థతే కారణమైతే, అటు వంటి దాన్ని అసమర్థతగాకాక సమర్థతగానే భావిం చాల్సి ఉంటుంది.

అదేవిధంగా 'శిఖిపింఛ కర్ణపూరా......'అనే శ్లోకాన్ని 'స్వలస్పంధవిగారున్న ధ్వని, వాక్య ప్రకాశ మెట్లగుమున్నదో పరిశీలించి చూడదగినది.'—అంటారే గాని ఆ ధ్వనిని వారు వివరించినదిలేదు. 'ఈ యర్థ ముల తీరులు, శబ్దపాటవములోని మెఱుగులు సంఘ టనా సంరంభములోని సౌరభ్యములు చవిజూచి యానందపరవశ్యులగు పొందదగిన రసజ్ఞత ంగా దేశములో ఎందుకు చచ్చిపోయినదో అవగతమగుట లేదు'—అంటారు. ఆధునికులు గుర్తించలేకపోతున్న ఆ 'అర్థాలు', 'మెఱుగులు', సౌరభ్యాలు' వీరు మాత్రం వివరించి చూపాలరా?

'పరానుకరణముగాని, విపరీతరాద్ధాంత ప్రతి పాదకముగాని కాకయున్నదే రసజ్ఞత అని శ్రీ సీతరామా రావుగారు చెప్పేనదాన్ని ఎవరూ కాదనలేరు. అటు వంటి రసజ్ఞు లెప్పుడూ వున్నారు. తప్పుని ఒప్పుగా, ఒప్పుని తప్పుగా చూపేవాళ్ళు, కవి ఒక దృష్టితో వ్రాసిన భాగం మరో దృష్టిలో పరిశీలించేవాళ్ళు ఆనాడూ వున్నారు. రామాయణాన్ని కావ్యదృష్టితో వాల్మీకి వ్రాస్తే, విశిష్టాద్వైతపరంగా కొందరూ, అద్వైతపరంగా కొందరూ పరిశీలించడం తెలిసిందే. ఇలా తమకు కావలసిన రీతిలో కావ్యానికి విమర్శ వ్రాసే పద్ధతి ప్రాచీనులలోనే ఎక్కువ.

'స్థాయినిబట్టి పాఠకుని రసజ్ఞతలో తరతమ భేదము యుండును' అంటున్నారు. అయితే యీ స్థాయి అనేది ఎటువంటిదో, దాన్ని ఎలా నిర్ణయించ డమో చెప్పలేదు. స్థాయి అంటే పాండిత్యమని అను కోవాల్సివుంది. అయితే పాండిత్యం లేనంతమాత్రాన రస జ్ఞత లేకపోదు. 'ఫలానివిట్లో వ్రాయలేదేమని యడిగెడి హక్కు పాఠకునికి లేదంటున్నారు. మరి ఈ ప్రశ్న వేయ గలిగే వాళ్ళు పాఠకులు గాక వేరెవరు? ఒకచోట సుగమ శైలిలో వ్రాసినవాడు వేరొకచోట క్లిష్ట బంధ రచన చేయువానికి అన్ని చోట్లా ప్రత్యేక ప్రయోజన ముంటుందా అనేది ఆలోచించవలసిన విషయం. ఒకసారి కవితావేశంలో సులభశైలీ, మరొ కప్పుడు క్లిష్టశైలీ రావచ్చు. అంతేగాని ఏదో ప్రయోజనం కోరి అక్కడక్కడా క్లిష్టరచన చేశా రని చెప్పలేం. అలా అనుకోకపోతే ఆముక్తమాల్యద లాంటి గ్రంథాలలో అడుగడుగునా క్లిష్టశైలి అవ సరమైందనీ, భోజ రాజీయంలాంటి వాట్లో క్లిష్ట బంధాలే అవసరంలేక పోయాయనీ అనాలి. ఇది ఎంతవరకూ సమంజసం? అందుచేత శైలి రక్తగత మైంది. అభ్యాసవశంతో అలవోకగా వచ్చినదేగాని, ఒక్కొక్కచోట ఒక్కొక్క రకంగా వ్రాయాలనీ లీసికగా ఆలోచించి తెచ్చి పెట్టుకున్నది మాత్రం కాదు.

విమర్శకుడంటే కావ్యం చదివి రసాస్వాదన మంచిచెడ్డలని బేరీజు వేయగలవాడు. అతనిలో సాహిత్య రసికతవుందా, చచ్చిపోయిందా—అని యింత వరకూ చర్చించాం. ఇలావుండగా శ్రీ సీతారామారావు గారు, విమర్శకులచేగాక కవులనగూడా సాహిత్య రసి కత చచ్చిపోయిన వాళ్ళుగా చెప్తున్నారు. 'రచనలలో ఛందస్సుకు తగిన గౌరవములేదు. వాడెడి అలంకార ములలో, ఆహ్లాదజనకతలేదు. అర్థములలో వ్యంగ్య వైభవములేదు' అంటున్నారు.

ఛందస్సుకి తగిన గౌరవము లేదనడంలో వారి వుద్దేశం స్పష్టంకావడంలేదు. అంటే ప్రాచీన ఛంద స్సులలో రచనలు చేస్తూవుండాలని వారి వుద్దేశం కావచ్చు. ఛందస్సులు కాలానుగుణంగా మారుతూ వచ్చాయి. అనుష్టుప్ వృత్తాన్నిగాక, మందాక్రాంతాదుల్ని కాళిదాసాదులు సృష్టించుకున్నారు. ఆంగ్లసాహిత్యంలో ఐతిహాసిక యుగంలో (Classical age) లో Closed couplet ను కవులు వుపయోగించారు. కాల్పనిక యుగంలో (Romantic age) లో Blank verse ని ప్రయోగించారు. ఆధునికులు Free verse లో రచి స్తున్నారు. అదేవిధంగా పరిణామ క్రమంలో మనకి మాత్రాఛందస్సుల యుగం దాటి వచనకవిత్వ యుగం వచ్చింది. ఏదో ఒక రకమైన ఛందోగుణం లేకుండా ఈ వచన కవిత్వం ఆవిర్భవించడంలేదు. అందుచేత ఛందస్సుకి తగిన గౌరవం లేదని విచారించడం అను చితం. అలాగే అలంకారాలలో ఆహ్లాదజనకత, అర్థంలో వ్యంగ్య వైభవం లేకుండా వుండదు. అలా వుంటే అది కవిత్వం కాదు. ఈనాడు మనం చూస్తున్న కవిత్వాలలో కవితా లక్షణాలు లేని రచనలు నశించిపోతాయి. ప్రాచీనకాలంలో కూడా వ్రాసిన ప్రతి

రచనా కవితా లక్షణాలు పుణికి పుచ్చుకున్నాయని చెప్ప గలమా ? ఎన్నో రచనలు వినష్టమైపోయాయి. కాల పరీక్షలో కవితా లక్షణాలు లేని వెన్నో నశించాయి. వాటన్నిటినీ కవిత్వం అనక్కర్లేదు. కవిత్వ వాచ్యం కావడానికి అర్హతలేని రచనలు అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ రచిస్తూంటారు. కాలగమనంలో అవి నశి స్తాయి. కాని వాటి సృష్టి, దేశంలోని సాహిత్య రసి కత చచ్చిపోవడానికి నిదర్శనం కాదు. ప్రాచీనులు సమా సాలతో, అలంకారాలతో, ఛందస్సులతో వ్యంజింప జేస్తే ఆధునికులు గేయాల్లోని లయ బాణీలతో వ్యంజితం చేశారంటున్నారు. ఇది కాలానుగుణమైన మార్పు 'అతివాస్తవిక కవులు, అభ్యుదయ కవులు, దిగంబర కవులు వారిలోనే ఏమాత్రమైనను ఈ రస జ్ఞత యొట్టునకు నిలిచియున్నది.' అంటే మరి 'ఈ దేశములో సాహిత్య రసికత చచ్చిపోయినది' అని చెప్పిన స్వవచనానికి వ్యాఘాతం కలిగినట్టేగదా. లేక పోతే వీరందరూ విదేశస్థులా ? లేక ఒక దశాబ్ది క్రిందటివారా?

'ఆధునిక రచనలో భావమునకు వ్యంజక ముగా రచన చేసిరిగాని అన్వయము ఎంత ప్రయ త్నించినను కుదురుటలేదు. ఎంతవరకు రచనకు ఆ పాత రమణీయత్వ లక్షణమును పట్టించుటయే గాని ఆలోచనావృతముగా వ్రాయుట ఆధునికులలో క్వాచిత్కముగా మాత్రమేయున్నది. పూర్వకావ్యములలో నీ రెండింటికి స్థానమున్నది'—అంటున్నారు. కవి త్వంలో ఈ రెండు లక్షణాలకీ ఎప్పుడూ స్థానం వుంటుంది. సర్వే సర్వత్రా పాచీనకావ్యాలన్నిటికీ ఈ లక్షణాలు రెండూవున్నాయనలేం. అయితే ఆధు నిక కవిత్వంలో అస్పష్టత (obscurity) ఎక్కువగా వుందనక తప్పదు. ఇది ప్రపంచమంతటా ఆధునిక కవిత్వానికి పట్టిన లక్షణం. అప్పుడు ప్రపంచం లోనే సాహిత్యరసికత చచ్చిపోయిందనాలి.

ఆధునిక రచయితలలో రసానందస్థితికంటె, బుద్ధిచమత్కారస్థితి ఎక్కువ అని శ్రీ సీతారామా రావుగారంటున్నారు. అయితే వారు ఆధునికులలో వున్న అవ్యక్తతని చమత్కారస్థితి అంటున్నారు. ఇదే పైన చెప్పిన అస్పష్టత.

వీరిదృష్టిలో రచనలు చేసేవారు పట్ట భద్రులుకావాలి. 'ఇటీవల వెలువడినవానిలో ఎక్కువ రచనలు చేసెడివారుగాని, దాని నాస్వాదించెడువారు గాని, పండితులుగాని పట్టభద్రులుగానికారు'—అంటు న్నారు. వేరొకప్రక్క 'అక్షరాస్యులకంటె నిరక్ష రాస్యులలోనే ఆర్ద్రత, ఆస్వాదయోగ్యత, సంస్కార సౌజన్యాదులు గోచరించుచున్నది' — అంటున్నారు. అలాంటప్పుడు రచనలు పండితులే చేయనవసరంలేదు గదా. మరి ఆ పండితుడు రచనలు చేస్తున్నారనే అభియోగం ఎందుకో తెలియదు. ఇంకా వీరు విద్యా ప్రణాళికలే లోపభూయిష్ట మంటున్నారు. విద్యా ప్రణాళికల గురించి ఏం మాట్లాడినా విద్యతో సంబంధంగలవారేగాని యితరులు మాట్లాడడానికి అనర్హులు. అటువంటి సంబంధంగలవారు నిర్ణయించాలి. వీరికి అలా నిర్ణయించే అర్హతుందా ?

పరిశీలించగా ఈనాటి రచయితలుగాని విమర్శ కులుగాని ప్రాచీనుల కేవిధంగానూ తీసిపోరు. ప్రాచీన మైన దానిపై శ్రీ సీతారామారావుగారికిగల గౌరవం చేత 'ఈ దేశములో సాహితీరసికత్వము చచ్చిపోయి నది' అని వ్రాయించింది. మానవజాతి వున్నంత కాలం రచయితలూ, సాహిత్యరసికతగల విమర్శకులు వుంటూనే వుంటారు. శబ్దార్థమాత్ర పరిజ్ఞానం మాత్రమే విద్యార్థులకి కలిగించడంచేత 'రసికత'కు నష్టం వాటిల్లుతోందని వారి వూహ. శబ్దార్థ మాత్ర పరిజ్ఞానంవుంటె చాలు. ఆదే ప్రతిభగల వారికి విమర్శనాశక్తి కలుగజేస్తుంది. విద్యాధికారుల దృష్టి సాహిత్యవిద్యలపై కేంద్రీకృతం కావాలంటు న్నారు వీరు. సాహిత్యవిద్యలంటే కేవలం ప్రాచీన ప్రబంధాలు ఆస్వాదిస్తూ మత్తుగా నిద్రించడం కాదు. భాషను శక్తివంతమైందిగానూ, ప్రయోజన కరమైందిగానూ చేసి ప్రజలకు విజ్ఞానాల్ని పంచి పెట్టడం మాత్రమే. అదే సాహిత్యరసికత. మనం ఆ త్రోవనే పురోగమిస్తున్నాం.

—

# భారతీయ చిత్రకళలో లక్ష్మి సరస్వతులు రెండూ అపరూప భక్తి భావములు

శ్రీ పిలకా లక్ష్మీ నరసింహమూర్తి

అనగా అనగా ఒక రాజు. ఆ రాజు కేడుగురు కొడుకులు. ఏడుగురు కొడుకులు కాసి వేట కెళ్లారు. ఏడు చేపలు తెచ్చారు. ఏడు చాపల్ని ఎండేశారు. అందులో ఒక చేప ఎండలేదు.

ఒకే ఒక చాప ఎండకపోవడమేమిటో చెప్పండి. సరే దుబ్బు చాటొచ్చింది. అల్లా వెళ్లి వెళ్లి కథ కంచికి మనము ఇంటికి చేరుకుంటాము. అదే కథా లహరి. మనస్సు విని విని ఆనందలహరిలో మునిగి బంగారుకలలు కంటుంది. అల్లా బంగారుకలలు కనే వాళ్లే దేశానికి లలితకళలకు కావాలి.

సాధరణంగా పెద్దలు మాటాడుతూ మాటాడుతూ చెప్పే విషయము మనస్సైందా అంటారు. అలా ప్రతి సుకుమార భావము మననవాలి. చింతన చేయాలి. చింతన చేయగా చేయగా చిమ్మచీకటితో పూర్ణచంద్రోదయము అయినట్లు చిత్ర స్ఫురణ కలుగుతుంది. ఆ స్ఫురణే చిత్రకళకు ప్రథమ సోపానము. రాజు_టలో మసిలిన లలితకళలు ప్రజల్ని కర్మవీరుల్ని చేస్తాయి. కలకలలాడే జీవితానికి వినోదము విశ్రాంతి కూడా కలిగిస్తాయి.

చిత్రకళలోను శిల్పములోను చేసే ప్రయత్నము అంతా ప్రవృత్తి మార్గము. అన్వేషణ. మూకుమ్మడిగా చూస్తే ప్రపంచ శిల్ప చిత్రకళలు రెండూ నిరంతరాన్వేషణ. పాశ్చాత్యులు మన కెంతదూరంలో ఉన్నా కళలలో చాలా అన్వేషణాతత్పరులు అని ఒప్పుకోక తప్పదు.

రాజా రవివర్మ చిత్రాలు చాలావరకు హైందవ భక్తిభావాలు. ఆయన సంపన్న కుటుంబములో పుట్టి పెరిగినా జీవితంలోని అన్ని అంతస్థుల్ని లోతుల్ని



కలయచూచి మరి చిత్ర రచన కుపక్రమించారు. సముద్ర మథనం చేయగా చేయగా లక్ష్మి సముద్భవము జరిగింది. రవివర్మ వేసిన లక్ష్మీ చిత్రము కూడా భావసముద్రాన్ని మధించివేశారు. గతించిన కాలానికి, ఇప్పటికి, భావికి. ఆ బొమ్మే శాశ్వతమా అనే విచికిత్సకు దిగకండి. గతంలో ప్రజలు ఆ చిత్రాన్ని ఎంతో సమాదరించారు. ఇప్పటికి ఆయన వేసిన లక్ష్మినే ఇంటింట పూజిస్తున్నారు. శిల్ప చిత్రకళల్లో ఎంత కాలము గొప్ప భావాలు ప్రజల మనస్సుల్ని అంటి పెట్టుకుని ఉంటాయో ఆయాభావాలు చిత్రాలు

అంతవరకు శాశ్వతమే. ముందు తరాలవాళ్లు రచనా చమత్కృతులతో ఆ భావాన్నే తీసుకునివేసిన చిత్రాలు గొప్పవైతే ప్రజలు పూజిస్తే అవన్నీ దేశంలో తప్పక చిరకాలం నిలుస్తాయి.

కొత్త చిగుళ్లు పుట్టి కొత్త రెమ్మలు పెరిగి లలితకళావృక్షము శాఖోపశాఖలుగా విస్తరిస్తూనే ఉంటుంది. చిత్రకారులు తాము పుంస్కోకిలలు అనుకుని అణిగిమణిగి కుహూకుహూ నినాదం చేస్తూ చిత్రకళలో కొత్త విన్నాణము కొత్త పోకడలు సృష్టించాలి.

రవివర్మలక్ష్మి చిత్రంలో పైన ఉదహరించిన పాశ్చాత్యుల రీతి—అన్వేషణ — కానవస్తాయి. అంటే ఎంతో మెళకువ, జాగ్రుతి, ప్రాక్‌ప్రతీచీ సౌందర్య సంప్రదాయాల ఎరుక అందులో ఉన్నాయి. కొంత వరకు బాహ్యచక్షువులతో చూచిన అందచందాలు ఉన్నాయి. అంటే అంత దృష్టి లేదని కాదు. ఆ కాలాని కాయన వేసిన లక్ష్మి ఒక కొత్త వెలుగు. కనుక ఆయన చూపులో ఉన్నంత ధ్యాన నిమగ్నత భక్తిప్రపత్తులు ఉన్నాయి.

భక్తిభావాలు కర్మాచరణకు ముఖ్యము. చిత్రములు శిల్పములు చూచి ప్రజలు నియమనిష్ఠలు అలవాటు చేసుకుంటారు. నేటి చదువరులు వేషభాషల్లో చాలా మారిపోయారు. మనకు వేగబాహ్యమైన చూపు, అలవాట్లు వచ్చిపడ్డాయి. కనుక బొమ్మల్లో భక్తిభావాలు అర్థం చేసుకుందుకు ఇంకా కొంతకాలం పడుతుంది. పాశ్చాత్య నాగరికతా వెల్లువ రవివర్మ కాలంలోను ముంచెత్తింది. ఈనాడు చిత్రకళలో ఇంకో విధంగా ఉద్రూత లూగిస్తోంది.

ఇంకా ప్రపంచ చిత్రకళా రంగంకేసి పారచూస్తే స్త్రీ సౌందర్యాన్ని ఊర్ధ్వ దృష్టితో చిత్రించిన వాళ్లే ఘనులనిపించుకున్నారు. నిత్య జీవితంలో మనం తిని తిరుగుతూ దేహ పోషణ చేసుకుంటున్నాము. శరీర పోషణ కేవలము పశువాంఛా ప్రేరణకు కానట్లే చిత్రకళలోని సౌందర్య పోషణకూడా అతిలోక సౌందర్యాన్ని సాక్షాత్కరింప చేయడానికే కాని క్రిందికి దిగలాగడానికి కాదు. అధోదృష్టితో చూచే భావాలకు చిత్రకళలో ఎప్పుడూ శాశ్వత స్థానము ఉండదు.

నా బాల్యంనించి తరచు రవివర్మ వేసిన లక్ష్మీ సరస్వతుల చిత్రాలు చూడ్డం ఉండేది. కారణము ఆ రెండు బొమ్మల్ని పూజలో పెడుతూండే వారు. తరువాత చిత్రకళలో అడుగుపెట్టాక కూడా ఆ రెండు బొమ్మలు నా మనఃకుహరములో అల్లాగే ఉండిపోయాయి. కేవలం భక్తి భావంవల్ల అల్లా నిరంతర నివాస మేర్పరుచుకున్నాయని చెప్పలేను. ఏదో తెలియని కారణము ఉంది. ఆ దేవేరు లిదర్దిలో ఒకరు విద్యలకు తల్లి. రెండో ఆవిడ సమస్త శుభాలకు, మంగళములకు, సంపదలకు పూజనీయురాలు. ఇంటి గడపలు తోరణములు, పసుపు కుంకుమలు, ముత్తైదువలు, పువ్వులు, లక్ష్మికి నివాస' స్థానములు. స్త్రీ అంటే అమ్మ అనే భావన. అవి నా చిన్ననాటి సంగతులు. మా అమ్మగారు పుస్తకాలు కింద పెట్టవద్దని, కాగితాలు నీళ్ల పొయ్యిలో పెట్టవద్దని కేకవేసేవారు. మంగళ—లక్ష్మి—శుక్రవారాలు ధన వ్యయం చేయరు. వీళ్లంతా ఇప్పుడు చాదస్తులు అనిపించుకుంటారు.

ఇప్పటికి మనదేశంలో పురుషులకంటే స్త్రీలే చాలా సంప్రదాయాల్ని కాపాడుతున్నారేమో అని పిస్తుంది. నవనాగరికులకంటె చదువుకోని వాళ్లని అంటి పెట్టుకునే చాలా మంచి విషయాలు వాళ్లమాటల్లోనూ కష్టసుఖాల్లోను నిత్యజీవితంలోను దొర్లుతూంటాయి. ఈనాటి చదువరులకంటె వాళే నయమేమో అనిపిస్తుంది. రవివర్మలక్ష్మి అలాంటి అమాయక ప్రజలు పూజించుకునే బొమ్మ.

ఇంకో విషయము ఏమిటంటే సాధారణంగా తిష్ఠమూర్తులయిన దేవతలు ఎవరు వరాలు ప్రసాదించరని, నుంచున్నవాళ్లు నుంచున్న పళంగా నడిచి వెళ్లిపోతారని, కొందరు సంప్రదాయజ్ఞులంటారు. ఒక విధంగా ఆరాధ్య దేవతామూర్తులు చాలావరకు కూర్చున్నవే కనిపిస్తాయి. అయినా పై విషయం రూఢి అనడానికి వీల్లేదు. నుంచున్న దేవతలు పుష్కలంగా వరాలు ఇస్తారు.

రవివర్మకు పూర్వులు ఎందరో గుడ్డలపైన పలకలపైన రకరకాల పద్ధతుల్లో లక్ష్మి చిత్రాన్ని వేశారు. ఆ రకంగా వేసిన గొప్ప బొమ్మలు చాలా అపూర్వమైనవి ఇళ్లలోను భజనమందిరాల్లోను ఇప్పటికి పదిలంగా ఉన్నాయి. స్థూలంగా చూస్తే రవివర్మకు

ఆయనకంటే పూర్వులకు లక్ష్మీదేవి బొమ్మ చిత్రించ డానికి ఈ దిగువ నుదహరించిన శ్లోకము ఆధారంగా కనిపిస్తుంది.

శ్లో. నియుజ్య మానాస్తు గజాస్సు
హస్తా స్సకేసరాశ్చోత్పలపత్ర హస్తాః,
చ భూవ దేవీ చ కృతాను
హస్తా లక్ష్మీస్తథా పద్మిని పద్మహస్తా.

సూర్యోదయాత్పూర్వము లేచి లేవగానే ఇష్ట దేవతా ప్రార్థన చేసుకునే అలవాటు మనదేశంలో ఇప్పటికి చాలామందికి ఉంది. అటువంటి ఆస్తికతా బుద్ధికల సహృదయులు ఏ తల్లి రూపాన్ని స్మరించు కుంటున్నారు — అనే ప్రశ్నకు రవివర్మ లక్ష్మి ఒక సమాధానము. అలాగే అష్టవిధ లక్ష్ములూను. అష్ట విధ లక్ష్మిల్ని ప్రాచీన చిత్రకారులు వేశారు. అంతే కాదు నిద్రనించి లేచి లేవడంతో అరచేతిలో శ్రీకారం వ్రాసుకుని కళ్ళకద్దుకుని మరి ఇతర కార్యక్రమాలకు దిగుతారు కొందరు. మరికొందరు శుక్రవారం పూజలు పునస్కారాలు చేస్తారు. వారం రోజుల్లో లక్ష్మివారము ఒక రోజు ఆవిడపేర ఉండనే ఉంది. మహర్షులు సరేసరి. 'శ్రియైనమః' అని చెప్పి మరి పురాణాలు వ్రాశారు. సామాన్యులు ఎక్కడి కైనా . యలుదేరితే కన్యలో ముత్తైదువలో ఎదురు రావడంచూచి మరి నడక ప్రారంభిస్తారు. మన దేముళ్ళు కూడా ముందుగా ఆవిడ పేరు చెప్పుకుని పిలిస్తేనే కాని పలకరు.

అదలా ఉండగా ఇప్పటి చిత్రకారులుకూడా కొందరు విఘ్నేశ్వరుని చిత్రం ప్రతిఏడాదివేసి, తరు వాత లక్ష్మి సరస్వతుల బొమ్మలువేసే వాళ్లను కొందర్ని ఎరుగుదును. పూర్వులు, ఈ నాడు చిత్ర కళలో నవ్యరీతులు తొక్కిన వాళ్లు, లక్ష్మి బొమ్మలు వేశారు. ముందు తరాలవాళ్లు వేస్తారు. అష్టవిధ లక్ష్ముల్లో ఎవరీమె అనే మీమాంస వచ్చినప్పుడు అదుగో ఆ పైన ఉదహరించిన శ్లోకాన్ని రవివర్మ ఆయన పూర్వులు తీసుకున్నారనడానికెలాంటి సందే హము లేదు.

మరో ముఖ్యవిషయము ఏమిటంటే లక్ష్మి కదంబ స్తోత్రాలకుకాని, వేరే ఏ ఇతర శ్లోకాలకు



కాని పూర్వులు వేసిన చిత్రాలు ఎవరి ఇళ్ళలోనయినా పూజలో ఇప్పటికి ఉన్నాయో, కాలక్రమేణ అవి శిథిలా వస్థనొంది పాడయిపోయాయో, లేక వేరే ఏ ఇతర శ్లోకాన్ని పూజలో పెట్టుకోవడానికి చిత్రకారులు అసలు చిత్రించనే లేదో తెలియదు. పూర్వం నిరక్ష రాస్యులైన వారిలోకూడా గొప్ప చిత్రకారులు స్థానిక రచనా పద్ధతుల్లో లక్ష్మిబొమ్మలు వేసిన వాళ్లు ఉన్నట్లు పై శ్లోకానికి వేసిన బొమ్మలు ఇప్పటికి కొన్ని నిలిచి ఉన్నాయి. కాని అవన్ని విలవలు సంప్ర దాయాలు తెలీని వాళ్ల చేతుల్లోపడి నలిగిపోతూ మర మ్మత్తులకు వెళ్లివస్తున్నాయి. అసలు చదువుకొని గొప్పచిత్రకారులకు శ్లోకార్థాన్నిచెప్పి భావమును మన నము చేయించిన సంప్రదాయజ్ఞులయిన పండితులు వారి వెనుక ఉండేవారనే విషయము నిర్వివాదాంశము. అదల్లా ఉండగా రవివర్మ మంచి డ్రాఫ్ట్స్‌మన్ అనంటే ఇప్పటి చిత్రకారులు ఏకగ్రీవంగా ఒప్పు కుంటారనుకుంటాను. ఎందువల్లనంటే నా చిన్న తనంలో కొందరు చిత్రకారులు ఆయన బొమ్మలకు

రకరకాల పేర్లు పెట్టి హాస్యరసమైన సంగతులు చెబుతూండేవారు.

పూర్వ చిత్రకారులువేసిన లక్ష్మి చిత్రాలు చాలా అందమైనవే ఉన్నాయని చెప్పాను. శ్లోకాన్ని యథాతథంగా చిత్రించి ఇంకా అనేక రమణీయమైన సంగతుల్ని కూడా కల్పించారు వాళ్లు. ఉదాహరణకు ఒక పూర్వ చిత్రంలో ఆవిడ పద్మాసీనురాలై సుష్ఠుగా కూర్చుని మందహాసంతో, కటాక్ష వీక్షణంతో, ఒప్పుతూ ఉంటుంది. రెండుప్రక్కల రెండు ఏనుగులు తొండాలు పైకెత్తి పద్మమాలలు పట్టుకుంటాయి. ఇద్దరు జవ్వనులు వింజామరలు వేస్తూ నిలుచుని ఉంటారు. శ్లోకంలో లేని ఇంకా ఎన్నో మనోహరమైన విషయాలు పూర్వ చిత్రకారులు చిత్రించారు. బౌద్ధులు కూడా ఆవిడ కటాక్ష వీక్షణం కోసమని తమ తమ పేర్లలో చివర శీకారాన్ని చేర్చుకున్నారు. ఎట్టు చూచినా లక్ష్మీదేవి వేయి వెలుగుల తల్లిగా చిత్రకళతో భాసించింది. చక్రవర్తులను కవులను, గాయకులను, చిత్రకారులను దీనారాటంకాల తీర్థమాడించింది. కాని నా చిన్ననాటి చిత్రకారులు ముచ్చిలనే పేరుతో ఎందుకో నిరాడంబరంగానే జీవితం గడిపేవాళ్లు. వారి ఇంటినిండా ఎన్నో రకాల బొమ్మలు చాలా అందంగావేసి పెట్టుకునేవారు. వాటిలో లక్ష్మి సరస్వతుల బొమ్మలు కూడా ఉండేవి.

ఇప్పటి చిత్రకారుల్లో ప్రాచీన సంప్రదాయాల్లో చిత్రరచన చేసేవాళ్లు రవివర్మ లక్ష్మికంటే పలకల మీద గుడ్డలమీదవేసిన పూర్వపు లక్ష్మి చిత్రాలనే ఎక్కువ గౌరవిస్తారు. దానికీ కారణము మరేంలేదు. సంప్రదాయ భేదము.

పనిలో పని రవివర్మ లక్ష్మితోపాటు దక్షిణ దేశంలోని దీపలక్ష్మిమాట చెప్పడము సముచితము. ఈ దీపలక్ష్మి చిన్నచిన్న అర్ధలోహ శిల్పాల్లో ప్రతి చోట కనిపిస్తుంది. మళ్లీ ఆ అర్ధకాంశ్య శిల్పము ఒక కొత్త విన్నాణము. ప్రతిరోజు భగవత్ సాన్నిధ్యంలో, సంధ్యాసమయంలో గృహిణులు నూనె దీపం వెలిగిస్తారు. ఆ దీపకలికకు ఈ దీపలక్ష్మి ఆధారము. దీపము వెలుతురు నిస్తుంది. వెలుతురు జ్ఞానికి చిహ్నము. కొంచెంసేపు మనస్సుని ప్రవృత్తి మార్గం నించి నివృత్తికి మళ్లించడము. అగరుధూప సుగంధిలమైన వాతావరణంలో మనస్సులోని అర్థకాంక్ష. ఇంకా ఏవేవో లౌకికమైన కోరికలు క్షణంసేపు తప్పుకుని ముకుళిత హస్తాలతో మనస్సు ధ్యాన నిమగ్నం కావడానికి భారతీయులు దీపలక్ష్మిని సృష్టించారు.

ఇంకా పల్లెటూళ్లలో ముఖద్వారాలపై అర్ధ శిల్పంగా చెక్కిన లక్ష్మి, లతలతో చిలకలతో ఒప్పారుతుంది. ఉత్తర హిందూ దేశంలోకూడా స్వల్పమార్పులలో ఆ శ్లోకాన్ని ఆధారంగా తీసుకునే లక్ష్మిబొమ్మలు వేసినట్లు తెలుస్తోంది.

సాధారణంగా పద్యానికో శ్లోకానికో ఇది అర్థము ఇది భావము అని చెప్పుకునేటట్లు ఒక్కొక్క బొమ్మ అర్థం చెప్పుకుపోతూ ఉన్నట్లు బొమ్మలు వేస్తారు కొందరు. అలావేసే బొమ్మలు ప్రజలకు చప్పున అర్థం అయిపోతాయి. తికమకలుండవు.

కాని పూర్వ సంప్రదాయములు భావస్ఫోరకత్వం ఎక్కువైన కొద్దీ ఆయా చిత్రాల లోతులు సహృదయులయిన రసజ్ఞులకే అర్థం అవుతాయి. ఆ విధంగా రెండు తరగతుల బొమ్మలు ప్రతిదేశ చిత్రకళయందు కనిపిస్తాయి. రెంటియందు సమర్థులు ఉంటారు. కొందరు ఘనులు చిత్రంలో భావార్థములు సమపాళంగా చిత్రిస్తారు. రవివర్మ ఆ తెగకు చెందిన ఘనుడు. పాశ్చాత్యుల్లో మాస్టర్సు ఆఫ్ డ్రాయింగు అనే సంతతికి చెందిన భారతీయుడు. బొమ్మలద్వారా హైందవ ధర్మాన్ని పునరుజ్జీవింపచేసిన మేటి. దేశంలో పాశ్చాత్య నాగరికత ఉధృతంగా ఊగిస్తున్న రోజులలో పౌరాణిక చిత్రాలద్వారా ప్రజల దృష్టిని ఆకర్షించాడీయన. యుగ పురుడన దగినవాడు.

అంతేకాని 'స్మశాన చైత్య ప్రతిమః భూషితోపి భయంకరః'అన్న చిత్రరచనా మార్గాలుతొక్కి పేరు సంపాదించినవాడు మాత్రము కాదు. ఇంకా చాలా విషయాలు ఆయన్నిగూర్చి చెప్పవలసి ఉంది. విషయ విస్తరణ భీతిచేత వదలవలసి వచ్చింది.

ఆయన గౌరవార్థం భారత ప్రభుత్వము పోస్టల్ స్టాంపు ముద్రించడం ఎంతో సముచితమైన విషయము.

---

# కలగూరగంప

## నిర్వచనోత్తర రామాయణంలో పదప్రయోగ పాటవము: చిత్రీకరణ వైభవము

ఉభయ ధారాధన విధేయుడైన తిక్కన—'నే నుభయ కావ్య ప్రౌఢన్ బాటించు శిల్పమునన్ బారగుండ, కళావిదుండ' అని ఆత్మ ప్రత్యయంతో చెప్పుకొనిన మాట నెగ్గించుకొను, తమ ప్రథమ రచన—నిర్వచనోత్తర రామాయణమునందే, యీ గుణవికాస శోభిత మైన రచనను మొదలుపెట్టినాడు. ఆయన తెనుగు దనము, చిత్రీకరణ వైభవము, పదప్రయో గౌచిత్యము యీ రామాయణమునందే పూచికాచినవి. ఇక భారతంలో యీ పండ్లు మాగినవి; శాంతిపర్వంలో మదర మాగినవి రామాయణ కవిత్వంలోనే, సంస్కృతము తెనుగు రెండూ పోతరించి కారెలు దిరిగిన జోడెడ్ల వలె చారుతర గంభీరంగా నడచినవి. తిక్కన కవితా శిల్పం ఒంటబుట్టినదే? ఈ సంగతి చెప్పను నిర్వచనోత్తర రామాయణమునుండి ఒకటి రెండు అంశాలు.

దశవదన—రావణ పదప్రయోగాలు

శ్రీరామచంద్రుడు అగస్త్యుని రావణాదుల జనన వృత్తాంతం చెప్పుమనగా, ఆ ఋషి యిట్లా చెప్పుచున్నాడు:—సుమాలి, తన కూతురు—కైకసిని వెంటబెట్టుకొని, తగిన వరునికై వెదకుచు, పౌలస్త్యుడైన విశ్రవసు ఆశ్రమానికి వచ్చి, ఆయనను తన కూతురుకు చూపి, తన దారిన పోయినాడు. ఆమె—'పౌలస్త్యుంగని వినయ విలాస భయవికాస వ్రీడా జనిత వికార సుభగ నిజతనులత వెడ్రనాల జతురతం బ్రణమిల్లి'నది (3:48) (వర్ణనా వైభవం చూడండి.) ఆయన 'లల్లని నగవున మునింగి' యియ్యకొని సంతానం అనుగ్రహిస్తాడు.

ప్రథమ సంతానం వదనదశకంతో వికటుడుగా పుట్టును. తండ్రి ఆ బిడ్డకు 'దశవదనుడు' అనే పేరుబెట్టినాడు. 3 ఆ. 57 పద్యం మొదలుకొని 4. 97 వరకు యీ దశవదనుడు పెరిగి పెద్దయి, చేసిన జయయాత్రలు, బ్రహ్మనుగూర్చిచేసిన తపస్సు, కైలాసమును చేతులతో పెల్లగించువరకు వర్ణిస్తాడు—తిక్కన. ఈ 150 పద్యాలలో యీ వీరునికి—దశవదనుడు, దశకంధరుడు, దశాననుడు, పంక్తిముఖుడు, అసురపతి, సురారి అనే పదాలనే ఉపయోగించినాడు. 'పేరు దశాననుండు' (4 : 10) అని ఆయనే చెప్పుకొంటున్నాడు. శివుడు ప్రత్యక్షమై:

'కేళీకందుక మల్లనెత్తుకొను మా
డ్కింబట్టి, నాయన్న యీ
కైలాచల మిట్లు నీవు నెగయం
గా నెత్తినం, జోద్యమై
నీ లావే గొనియాడు చెల్లరును వ
ర్ణింపంగ నీకొక్కపే
రీలోకంబున జెల్ల, దైత్యులకు బెం
పెక్కంగ నే నిచ్చెదన్. (4 : 96)

'ఏ వినగ నీవుడు నీదగు
రావంబు త్రిలోకభీకరంబయి చెలగెం
గావున విన్న భయంబగు,
రావణుడను నామమున బరగు త్రిజగమునన్.'
(4 : 97)

అని రావణనామం ప్రసాదిస్తాడు. ఇది మొదలే రావణ నామమొక్కటే వాడుకలోకి వచ్చినది. కాబట్టే యీ నామకరణం జరిగేవరకు తిక్కన ఇతరపదాలనే వాడి ఔచిత్యం చూపినాడు. ఆ తర్వాత, వెంటనే (5 : 2) రావణుడని ప్రయోగిస్తాడు. ఇదీ! ఆయన ఉచితజ్ఞత—కళామయదృష్టి!

అచ్చులో సంపాదకులు శీర్షికలలో రావణ పదాన్ని చేపట్టి అసలు కిటుకు పట్టుకోలేక పోయినారు.

ఈ పట్టున మూలసంస్కృతం చూస్తాం. తిక్కన—'శైలమూలమునకేగి చేతుల గ్రుచ్చి యమర బట్టి' (4 : 90) 'ఎగయనెత్తిన' (4 : 96) అని చెప్పగా మూలంతో 'పాదాంగుష్ఠేన' (16 స. 27 శ్లో) అని ఉన్నది. కాబట్టే తిక్కన వ్రాతలో కథక నైపుణికి జీవం, పాండిత్యానికి చేవ అబ్బినది.

'రావణాత్కుంభ కర్ణాచ్చ' అని (4 స: 5శ్లో) అని యీ సోదరుల జననం వర్ణింపబడినది. అది

మొదలు కత చెప్పటలో—దశగ్రీవం, లంకేశం, అనే మాటలతోబాటు, ఇంకా పుట్టని రావణపదప్రయోగాన్ని—రావణస్య (10:35) రావణ సూనునా (11:9½) రావణాంతఃపురే (11:30½) రావణం జహి (15:2) మొదలగుచోట్ల చాలమార్లు వాడినారు. ఇది కథ పూర్వాపరాలనుబట్టిచూస్తే అనౌచిత్యం. తిక్కన దీనిని పరిహరించి, తన రచనకు సొంపు వాటింపజేసినాడు. ఇదే శ్రీనాథకవి సార్వభౌముడుకొనియాడిన—'రసాభ్యుచిత బంధము.'

## చిత్రీకరణం

వర్ణితమూర్తి కనుల ఎదుట నిలబడి నడయాడేటట్లు, మూలంలోలేని సొంపులు సొమ్ములుగాగూర్చే పనితనంలో తిక్కన ఆరితేరిన కవి. ఒకటి రెండు పరికించండి.

రావణుని అన్న—కుబేరుని దూత, రావణుని కొలువు కూటానికివచ్చి బుద్ధి చెప్పినట్లు—

'నీ సరకు సేయమి గర్వముగాక కర్జమే'

'అనిన నిరువది కన్నుల నడరుకెంపు పద్మవన బాలా తపంబు బోల' (4:37)—అని,

ఈ యిరవై సంఖ్యను వదలదు. ఆయుధాలనుగూడ ఈ యిరవై చేతులే ప్రయోగించును. మూలము సంఖ్యను వదలివేసినది. కోపపు చూపు, రేపటి ఎండ—రెండునూ ఎర్రగానే ఉండును. అందులో పద్మాలుగల కోనేరది.

'కేసరము లదరు హరిక్రియ మీసలదరరేచి' దూతను చంపును. (1:34)

ఒక మీసమైతే కేసరములకు సరిపోదు; కాబట్టే పదిమోముల పైనున్న పదిమీసాలు — కేసరములు లేచినట్లు అదరినవి.

బ్రహ్మ, దశాననునికి వరమివ్వనువచ్చిన ఘట్టంలో—

'వదన చతుష్టయాంబలర వారిజ సంభవు డేగుదెంచి', అని బ్రహ్మ నాలుగు మొగాలు పనిచేస్తున్నట్లు సహజంగా చెపుతున్నాడు. ఈ చణుకునే పింగళి సూరన కళాపూర్ణోదయంలో సొంతం చేసుకొన్నాడు. (3 : 67)

వెంటనే—(3 : 69)
'ధరజాగి మ్రొక్కి దశకం
ధరుడు వినయమొప్పనిలిచి, తఱుగని తలపై
వెరవున దనకరపద్మము
లిరువదియును మొగిచి, యల్లనిట్లనిపలికెన్.'

ఆ దృశ్యం అప్పుడే మనసులో మెదలుచున్నది. నరికి ఆహుతి యివ్వగా మిగిలి ఉన్న ఒక్క తలపై పూర్వ దశకంధరుడు—తనకున్న ఇరవై చేతులు మోడ్చి మ్రొక్కు లిడుచున్నాడు. ఎంతటి హృదయంగమం! ఎంతటి శిల్పము!

చచ్చుగా పేలనంగా ఉండే మూలం చూస్తే మీరు ఇంకా ఆనందించగలరు :

పితామహస్తు సుప్రీతస్సార్ధం దేవైరుప
స్థితః (9 స : 13 శ్లో)
దశగ్రీవ ప్రీతోస్మిత్యభ్య భాషత (9 : 14)
అథా బ్రవీద్దశగ్రీవః ప్రహృష్టేనాంతరాత్మనా
ప్రణమ్య శిరసాదేవం హర్ష
గద్గదియాగిరా (9 : 15)

పితామహుడు సుప్రీతుడై వాడు; దశగ్రీవుడు ప్రీతుడై ఇట్లా మాట్లాడినాడు; మరలా దశగ్రీవుడు అంతరాత్మలో ప్రహృష్టుడై, ఆ దేవునికి శిరసా ప్రణమిల్లి హర్షగద్గదితమైన మాటతో (గిరా) చెప్పెను (అబ్రవీత్)—అంతే!

ఇటువంటి పసిడి తునకలు ఆ రామాయణం నిండా ఉన్నవి. ఈ గుణం భారతంలో ఎలపానపరచుకొనిపోయి ఉన్నది.

—శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి.

## తెలుగుదేశంలో గీరన గింజలాట

1974 మేనెల భారతిలో 'కలగూరగంప' శీర్షిక క్రింద వ్రాయబడిన 'తెలుగుదేశంలో గీరన గింజలాట' వ్యాసము చదివిన తరువాత క్రింది వాక్యాలు వ్రాయాలనిపించింది. నాకీవాక్యాలు వ్రాయుటకు సహకరించినది కేవలం నా స్వానుభవమే. ఆ వ్యాసము చదువుతుంటే, యెప్పుడో చిన్నప్పుడు, నేను మా గ్రామమధ్యంలోనున్న రామాలయం రాతిబండలపై నా మిత్రులతో ఆడుతూయుండిన ఆట గుర్తుకొచ్చింది. ఆరోజుల్లో అర్థం తెలియకుండానే 'గీరన గింజలాడుకుందాం, రావోయ్' అని మేము పిలుచుకొన్న పిలుపులు గుర్తుకొచ్చాయి. ఇప్పటికీ మావూతి

లోనేగాక ప్రక్కగ్రామాలలోగూడా, యీ జాతీయ క్రీడను ఆడుతుంటారు.

శ్రీ ఆరుద్రగారు సమగ్రాంధ్ర సాహిత్యం 6వ సంపుటంలో 'గీరన గింజలాట ఏలా ఆడుతారోగాని' అంటూ అర్ధాంతరంలో ఆగిపోయినా, పింగళి సూరన (క. పూ. 6—202); ధూర్జటి (కా. మ.3–33); శేషము వెంకటపతి (శ. వి. 2—19); అయ్యల రాజు నారాయణుడు (హం. విం. 3 — 146); ఏల్చూరి సింగన (ప. ర. 474); తదితరులు యీ ఆటను పేర్కొన్నారంటూ, 'ఒకనాడు తెలుగుదేశం లోని తెలుగు పిల్లలు దానిని ఆడేవా'రన్నారు. ఒకనాడే కాదు. ఈనాడు కూడా యీ దేశీయక్రీడను తెలుగు దేశంలో ఆడుతున్నారు.

ఈ గీరప గింజలాటను, శ్రీ ఆరుద్రగారు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, ఆడేవిధానం తెలుప లేదంటూ, శ్రీ బాగలూరి బాలకృష్ణగారు వివరిం చారు. వివరణ బాగుంది కాని ఆడేవిధానం అదికాదు. స్వానుభవపూర్వకంగా యీ ఆటను ఆడే విధానం వివరిస్తాను.

ఆటపేరు : గీరన గింజలాట; గీరన అంటే గీతలో. లేక గీతయందు; గీర అంటే గీత. గీరప్రైవ సప్తమీవిభక్తి ప్రత్యయం, న చేరింది. 'గిరిన' కాదు. కాబట్టి గీరకు గింజలకు గల సంబంధంతో ఆడే ఆట. గీరలోపల గింజలాట. గీరయందు గింజ లాట. గీరన గింజలాట. (గీర+న);

## విధానము :

కొందరు (నలుగురైదుగురు) బాల బాలికలు చింతగింజలతోగాని, వాటితో యించుమించు పరి మాణం గలిగిన రాళ్లతోగాని, యీ ఆటను ఆడ వచ్చును. ఇది ఓ మన గుంటలు, అచ్చనగాయలు తొక్కుడు బిళ్ళ, కోలాటము, కోతి కొమ్మచ్చి మొద లగు ఆటలవంటి దేశీయ క్రీడ.

సప్పటి నేలపై ఒక గుండ్రని గీర (వృత్తము) గీయవలెను ఆ గీరకు చుట్టూ ఆడేవారు కూర్చొన వలెను. అందరూ సమానముగా గింజలను (రాళ్లను) వేసి, మొత్తము కలుపవలెను. తరువాత ఒకడు ఆ గింజలను దోసిలియందుంచుకొని, ఆ గీరలోపలనే (పరిధి లోపలనే) గింజలుపడే విధంగా, కొంచె మెత్తునుంచి పోయవలెను. గీరదాటి గింజపోతే అతని ఆట చెల్లు. ప్రక్కవాడికి ఆట యివ్వవలసిందే. అందువలన చాల జాగ్రత్తగా గింజలను గీరలోపలనే పోయవలెను. తరువాత కుడిచేతిమధ్య వ్రేలితో, గింజను, గింజతాకకుండాయుండే గింజలనన్నిటినీ, తనవైపునకు గీరుకొనవలెను. (గిల్లుకొనవలెను). అంటే గింజపై వ్రేలుపెట్టి, గింజ గీరదాటే విధంగా బయటకు నెట్టాలి. అవసరమైతే ఏ వ్రేలునైనా ఉపయోగించవచ్చు. ఇట్లు సులభంగా వచ్చే గింజ లను మొదట గెలుచుకొని, తరువాత గింజను గింజ తాకియున్నా, ప్రక్కగింజ కదలకుండా చాచక్యంతో నేర్పుతో, వచ్చినన్ని గింజలను గెలుచుకోవచ్చును. గింజలు గీరుకొనేటప్పుడు ఏ మాత్రంప్రక్క గింజ కదిలినా, గిరినగింజ గీరదాటి బయటకురాకపోయినా, ఆటప్రక్క వాడికి వదలవలసిందే. అంటే గింజ కది లినా, గింజ గీరలోపలనేయున్నా, ఆ గింజ (గిరిన గింజ)తోబాటు, మిగిలిన గింజలన్నీ తీసుకొని ప్రక్క వాడు (కుడివైపువాడు) ఆడుతాడు. ఇట్లు ఆట జరిగి సాగిపోతుంది. ఒక్కొక్కసారి ఒకరిద్దరితోటే ఆట ముగియవచ్చు. ఒక ఆట ముగిసిన వెంటనే, ఇతరులవద్ద మిగిలిన గింజతో మరల ఆట మొదలు పెడెదరు. చివరకు ఒకడే అందరి గింజలను గెల్చు కొనుట జరుగుతుంది.

ఇట్లు తెలుగుదేశంలో అనాదిగా గీరన గింజ లాట లాడటం ఉంది. ఈ ఆటనే మన కవులు తమ కావ్యాలలో పేర్కొన్నారు. గీరలోపల గింజలనువేసి, గింజలు గీరుకొంటూ (గిల్లుకుంటూ, గెల్చుకుంటూ) ఆడుతారు కాబట్టి యీ ఆటకు గీరన గింజలాట యని పేరు వచ్చింది. ఓమన గుంటలాటలో గుంటలు ప్రధాన పాత్ర వహించినట్లు, కోలాటంలో కోల (కట్టె) ప్రధాన పాత్ర వహించినట్లు, తొక్కుడు బిళ్లలోబిళ్ల (పెంకుబిళ్ల) ప్రధాన పాత్ర వహించి నట్లు, యీ గీరన గింజలాటలో గీర ప్రాముఖ్యం వహించి, ప్రధాన పాత్ర వహిస్తుంది. అందుకే యీ ఆటకు యీ పేరు కూడా వచ్చింది. అయితే మొత్తము మీద యీ ఆట నిజంగా ఆడేవారికి, ఆడేదానికి చాలా సంతోషం కలిగిస్తుంది.

—శ్రీ పోరూరు హనుమంతరావు.

* * *

అయ్యా!

1974 సం॥ జూన్ భారతిలో గ్రంథ విమర్శనములను శీర్షికకింద యువభారతి వారు ప్రచురించిన 'వికాసలహరి'యను వ్యాస సంపుటిని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు విమర్శించియున్నారు. అందు ఆద్యంతముల రచయిత (అనగా నన్నయను గూర్చియు తిరుపతి వేంకటకవులను గూర్చియు వ్రాసినవారు డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారని తెలియ జేయుచూ తిరుపతి వేంకటకవులనుగూర్చిన వ్యాసమును ప్రస్తుతించుచూ వారిట్లు వ్రాసియున్నారు. 'శ్రీ తిరుపతి కవిగారి పుత్రులును ఆ కవులతో సన్నిహిత సంబంధము కలవారును అగు వేంకటావధానిగారే ఆ విషయాన్నిగూర్చి వ్రాయగల సమర్థులు.'

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు డాక్టరు వేంకటావధానిగారే తిరుపతి కవిగారి పుత్రులని వ్రాసిన వ్రాత భ్రమ ప్రమాదములకు దారి తీయునదిగ నున్నది. డాక్టరు వేంకటావధానిగారు తిరుపతి శాస్త్రిగారి అన్నగారైన సుందరరామయ్యగారి పుత్రులు.

తిరుపతిశాస్త్రిగారి జ్యేష్ఠపుత్రులగు బ్రహ్మశ్రీ వేంకటావధానిగారు ఉద్యోగమునుండి విరమించి సుమారు 15 సంవత్సరములనుండి పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకా నవుడూరు గ్రామములో నివసించుచున్నారు. అనువాద కవిత్వ విషయమున 'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' అను నార్యోక్తి సార్థకమైనదను వాక్యము వినకయే తిరుపతిశాస్త్రిగారు పరలోకగతులైనందులకుం జింతించుచుందును. ఈ వేంకటావధానిగారి యనువాదము స్వతంత్ర రచనయని భ్రమింపఁజేయును. వీరు స్వప్నవాసవదత్తము, రామచంద్రుని సత్యహరిశ్చంద్ర నాటకమును, శ్రీ హర్షుని నాగానందము, భవభూతి మాలతీ మాధవము, ఆలివరు గోల్డుస్మిత్తు వ్రాసిన vicar of wake fie'd, కాళిదాసుని మేఘసందేశము, వాయు పురాణాంతర్గత గోస్తనీనదీ మాహాత్మ్యము, రుద్రకవి భావవిలాసము అను గ్రంథముల నాంధ్రీకరించిరి. రెండు సంవత్సరములకు బూర్వము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచ్చిన ధనసహాయముతో తిరుపతి కవి జీవిత సంగ్రహమను పుస్తకమును విరచించిరి.

నామసామ్యమునుబట్టి ముందు ముందాంధ్ర పాఠకలోకము భ్రమింపకుండుటకై నేను బంపిన యీ చిన్న వ్యాసమును భారతీ పత్రికా ముఖమును బ్రకటింపవలయునని మనవి చేసికొనుచున్నాను. భారతి పత్రికాధిపతులకును దత్సోదరులకును బ్రహ్మశ్రీ వేంకటావధానిగారు చిరపరిచితులు. —శ్రీ గొర్తి కామశాస్త్రి.

## 'ర నం డి'

ఆరుద్రగారు 'త్వమేవాఽహం'లో వ్రాసిన 'రనండి నాపంథా' అన్న వాక్యంలో 'రనండి' అన్నమాట దేశ్యమని, నెల్లూరు మాండలికమని మేనెల భారతిలో శ్రీ పాకాల వెంకట కృష్ణయ్య వ్రాశారు. 'రనండి' అన్నమాటకు 'రండి' అని, అలాగే 'పొనండి' అన్న మాటకు 'పొండి' అని అర్థం చెప్పారు. ఈ అర్థం ఆరుద్రగారి వాక్యంలో సిద్ధించదు. 'రనండి' అన్న నెల్లూరు మాండలికాన్ని ఆరుద్రగారు వాడే రనడం సమంజసంగా కనిపించడంలేదు.

'రనండి' అన్న తెలుగుమాట వ్యవహారంలో ఉన్నా అది కేవలం నెల్లూరు మండలానికే పరిమితమైందనడం కూడా సరికాదేమో అనిపిస్తోంది. 'రనండి' 'పొనండి' వంటి రూపాలు విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లో కూడా వాడుకలో ఉన్నట్లు కనిపిస్తోంది. ఈనాడు ఉన్నదో లేదో నాకు స్పష్టంగా తెలియదు కాని కొంతకాలం క్రిందట అవి వాడుకలో ఉండేవని రూఢిగా తెలుస్తోంది.

బొబ్బిలియుద్ధం ఈజిల్లాల్లో పదం పాడడం కద్దు. 'పెదబొబ్బిలి రాజుకథ' అనే బొబ్బిలియుద్ధంపాటఅచ్చై ప్రచారంలోఉంది. అందులోని ఈ క్రింది పంక్తులను చూడండి:

(1) జాబు చూచిన తక్షణమ్మున నాబేటికి రన్నండి
(2) రాజారంపై బాటల్లోకి రాణీ పొన్నండి
(3) వన్నెనన్నె ఒకలక్షకోడిని డాబుగ తెన్నండి
(4) తామస మేమిమున్యంమీాదికి తయారు గన్నండి

పై పంక్తులలోని 'రన్నండి' 'పొన్నండి' 'తెన్నండి' 'కన్నండి' అన్నమాటలు 'రండి' 'పొండి' 'తెండి' 'కండి' అన్న అర్థాలలో ప్రయుక్తాలన్నది స్పష్టమే. అందుచేత ఈ దేశ్య పదాలకోసం ఆరుద్రగారిపై నెల్లూరు కవుల ప్రభావం వెతకవలసిన అవసరంకూడా కనిపించడం లేదు. ఇంతకూ ఆరుద్రగారు వాడినది ఆంగ్లపదంపై తెలుగు ప్రత్యయంచేర్చిన కృతకరూపమే కాని, దేశ్యపదంకాదని నా అభిప్రాయం.

శ్రీ గంటి శ్రీరామమూర్తి.

# గ్రంథవిమర్శలు

## వరూథినీ ప్రవరమ్.

(సంస్కృతైకాంకికా.) (రచయిత శ్రీ వేదుల—సుబ్రహ్మణ్యశాస్త్రి, ఎం. ఏ. దొండపర్తి—మండా వారిపేట, వాల్తేరు, ఆర్. ఎస్. క్రౌన్ సైజు 8+20 పుటలు. వెల లేదు.)

ఆంధ్రప్రబంధాలలో అల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్ర బహుళ ప్రచారాన్ని పొందినది. సాహిత్యంలో కొంతయినా అభిలాష కలవారికి అందరికీ వరూథినీ ప్రవరుల వృత్తాంతం సువిదితమే! మొదటి మూడాశ్వాసాలలోనూ వుండే కథాంశానికి సంబంధించిన పద్యాలు చాలామందికి కంఠస్థాలయి ఉంటాయి. ఆ కథాంశాన్నే ప్రధానంగా గ్రహించి రచయిత సులభాతి సులభమైన గద్యంలో సంస్కృత భాషలో ఏకాంకికగా రచించారు.

శ్రీ శాస్త్రిగారు దీనిని సుఖాంతంగా ముగించారు. వరూథిని ప్రవరునిచేత తిరస్కరించబడిన తర్వాత అతని రూపాన్ని ధరించిన గంధర్వుడు గాంధర్వ విధిని వివాహం చేసుకోవడం వర్ణించబడింది. కథాంశంలో కొంచెం మార్పు కనబడుతుంది. ప్రవరుడు చూచినప్పుడు వరూథిని ఒక్కర్తే ఉన్నట్లు మనుచరిత్రలో 'ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటి చరించె దోటలే, కివ్వనభూమి' అనే పద్యంవల్ల తెలుస్తున్నది. ఇందులో వరూథిని ఒంటరిగాకాక చెలికత్తెలతో కూడా ఉంటుంది. ఆమె ప్రేమమయ దృష్టులు ప్రవరునిపై ప్రసరించడం చూచి చెలికత్తెలు చల్లచల్లగా జారిపోతారు. ఈ మార్పు రసవంతంగా కానవస్తుంది.

రచయిత వీలయినంతవరకూ పెద్దనగారి పదజాలాన్ని, సమాసాలనూ తన రచనలో స్వీకరించారు. ఉదాహరణకు—

'అట చని కాంచె భూమి సురుం
డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠద
భంగతరంగ మృదంగనిస్వన
స్ఫుటనటనానుకూల పరి
ఫుల్లకలాప కలాపిజాలమున్
కటక చరత్కరేణు కర
కంపితసాలము శీతశైలమున్.'

[మనుచరిత్ర—2 ఆశ్వా. 2]

'మధురం నృత్యం త్యస్మిన్నంబరచుంబి గిరిశిరస్సరతాం ఝరీపటలానాం ముహుర్ముహుర్లుఠ దభంగ తరంగనిర్ఘోషాన్ శృత్వా మృదంగ నిస్వనభ్రాంత్యా స్ఫుటనటనానుకూల పరిఫుల్ల కలాపాః కలాపినః.

అత్యంతం దర్శనీయాః కటకచరత్కరేణు కర కంపితాః సాలవృక్షాః.

[వరూథినీ ప్రవరమ్. పుటలు 3, 4.]

దీనిపైని ఆచార్య తూమాటి దోణప్పగారూ, ఎ. వి. యన్. కాలేజి ప్రిన్సిపలు దివాకర్ల—రామమూర్తిగారూ, ఆంధ్ర విశ్వవిద్యాలయం సంస్కృత శాఖలో రీడరు పి. శ్రీరామమూర్తిగారూ, కళాప్రపూర్ణ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారూ, ఆంధ్ర విశ్వవిద్యాలయ సంస్కృత శాఖకు చెందిన అప్పల్ల—సోమేశ్వర శర్మగారూ సదభిప్రాయాలు ఇచ్చారు. దోణప్పగారి ప్రశస్తి తెలుగులోనూ, మిగిలినవారివి సంస్కృతంలోనూ ఉన్నవి.

సుప్రసిద్ధ విద్వాంసుల ఆమోదముద్ర వేసుకున్న ఈ చిన్న కృతి సంస్కృత భాషాభిమానులకు ఆదరణీయమైనదే!

## శ్రీ లలితాదేవి వేలుకొలుపు

(నామావళీ సహితము. రచయిత్రి శ్రీమతి లక్కరాజు శారదాంబ, క్రౌన్‌సైజు నూరు పేజీలు. వెల మూడు రూపాయలు. ప్రతులకు శ్రీ ఎస్. బి. మనోహరరావు, W 16/1281–1—2 గాంధీ నగర్ స్వతంత్ర పార్కు రోడ్డు, నెల్లూరు.)

స్త్రీదేవతలో లలితాదేవి ప్రాధాన్యాన్ని వహించినది. ఆస్తికు లందరూ ఆ దేవిని సహస్రనామాలతో పూజ చెయ్యడం జరుగుతున్నది. లలితాసహస్రనామా

వళికి మంత్రశాస్త్రవేత్తలు విపులమైన వ్యాఖ్యానాలు రచించారు. నామావళితత్త్వాన్ని గ్రహించదలచినవారు వాటిని పఠిస్తారు. అవి సామాన్యులకు అందుబాటులో ఉండవు. సామాన్యులకు ఆ యా నామాల అభిప్రాయం తెలిసేటట్లుగా ఇందు గేయరూపంగా రచన సాగింది.

వేంకటేశ్వర సుప్రభాతం బహుళప్రచారాన్ని పొందిన తర్వాత వివిధ దేవతలనుగురించిన అనేక సుప్రభాతాలు వెలువడినవి. ఆ పద్ధతిలోనే ఇంగా గేయం 'మేలుకొలుపు'గా కూర్చబడింది. ప్రతి చరణం లోనూ ఒక్కొక్క లలితాదేవినామం, ఆ నామవివరణం సులభశైలిలో ఇవ్వబడినవి. దీనికి

'మేలుకో మమ్మేలుకో శ్రీరామా
ఇదే సుప్రభాతమూ.'

అనే మకుటం ప్రతిచరణంలోనూ ఉంటుంది. పుస్తకమంతా ఒకటే గేయమని చెప్పవచ్చును.

'దిక్పాలకులకు పాలకులౌ
బ్రహ్మవిష్ణు రుద్రాదులకు
పాలిక నీవే పరమకృపాకరీ
'రాజరాజేశ్వరి' మహేశ్వరీ
నీ భక్తులకిచ్చుచుందువు
నిజమౌ రాజ్యాధిపత్యములు
'రాజ్యదాయినీ' కైలాసాధిపత్యము
వైకుంఠము భూమండలమును.'

(684. 685)

మొదలైన చోట్ల నామానికి తగినట్లు వివరణం ఉన్నా కొన్ని స్థలాల్లో అట్టి వివరణ కానరాదు. దానికి ఉదాహరణాలుగా—

'భక్తుల కానందము నిను
భక్తిమీర పూజించుటెగ
భక్తచిత్తకేకి ఘనాఘనా
రిక్తులంజేయకు భక్తులనందరి' (747)

భక్తుల మనస్సులనే నెమిళ్లకు వర్షాకాలపు మేఘమైనదానా! అని నామమునకు అర్థం. అది ఇందులో లేదు.

'శ్రీదేవీ నీవు ప్రేమతో జూచితె
రోగములేవియు దాకజాలవు
'రోగపర్వతదంభోళి' బాగుగ
నీకయి గానము చేతును.' (748)

రోగములనే పర్వతాలకు వజ్రాయుధమైనదానా! అని నామంయొక్క అర్థం. అది చరణంలో కానరాదు.

రచన సాధారణంగా సాగింది.

'నామావళీ సహితము' అని ముఖపత్రంమీద ఉన్నది. కాని. ఇందులో ప్రత్యేకంగా 'నామావళి' లేదు. గేయంలోని నామములనే 'నామావళి'గా గ్రహించవలసి ఉన్నదేమో!

ఇందులో మొదటి పుటలో ప్రారంభంలోనే 'శ్రీ లలితా సహస్రనామ మేలుకొలుపు' అని ఉన్నది. ఇలా చెప్పడం ఉచితంగా లేదు. మేలుకొలుపు లలితాదేవికే కాని నామములకు కాదుగదా! సహస్రనామ మేలుకొలుపు తప్పుపదంగా కానవస్తుంది.

రచయిత్రికి ఈ విధమైన మేలుకొలుపు కీర్తనగా వ్రాయాలనే ఉత్సాహం ఉన్నదేగాని, తగిన కవితాశక్తి, రచనా సామర్థ్యం ఉన్నట్లు తోచదు.

పరమహంస, పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ నృసింహానంద భారతీస్వామివారు 'శ్రీమతి లక్కరాజు శారదాంబ శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమును దీర్ఘకాలము పారాయణచేసి, అందలి భావమును ఆకళింపు చేసికొని, స్త్రీ లోకమునకు అందుబాటులో ఉండునట్లు మేలుకొలుపు పాటలో తీర్చిదిద్దినది. ఇది ఒక చక్కని క్రొత్తబాట. దీనిని చదివి కంఠస్థము చేసికొని స్త్రీలందరు శ్రీ లలితాపరదేవతానుగ్రహమునకు పాత్రములు కాగలుగుటలో సందేహము లేదు' అని ఆశీర్వదిస్తూ ప్రశంసించడం ఈ రచయిత్రికిగల ఉత్సాహాన్ని పురస్కరించుకొనే జరిగి ఉండవలెను.

## గౌరీశంకరప్రణయరసతరంగిణి

(రచన : విద్వాన్ కోనూరు వెంకట నరసింహ రాజుగారు, డెమ్మీసైజు 20+256 పేజీలు. వెల 6 రూ. ప్రాప్తిస్థానములు—ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజారు, హైదరాబాదు—1' లేక నందినీ పబ్లికేషన్సు, నెం—16-11-19 5 సలీంనగర్ కాలనీ—హైదరాబాదు—36.

కాళిదాసు రచించిన రసవత్కావ్యాలలో కుమార

సంభవకావ్యం, ఎన్నదగినది. ఇందులోని హిమాలయ వర్ణన, దేవతలమొర, పార్వతీదేవి శివునికి చేసే శుశ్రూష, మదనుని భస్మసాత్కృతి, రతీవిలాపం, పార్వతితపస్సు, పరమేశ్వరుని పరీక్ష, సప్తర్షుల రాయబారం, పార్వతీపరమేశ్వరుల వివాహం రసవంత మైన ఘట్టాలు ! సంస్కృతం నేర్చుకునేవారు ఈ కావ్యాన్ని లేదా ఇందులోని కొన్ని సర్గలను చదివి తీరుతారు. దీనికి తెలుగులో పద్యానువాదాలు, గద్యానువాదాలు ఎన్నో వెలువడ్డాయి. అయినా దీనిపై మోజు తగ్గలేదు. ఆ కథాంశాలనే సంస్కృత శ్లోకాలతో సహా 'గౌరీశంకర ప్రణయరసతరంగిణి' అనే పేరుతో రచయిత అందజేస్తున్నారు.

రచయిత వెంకట నరసింహరాజుగారు విద్వత్పట్టభద్రులు. సంస్కృతాంధ్రాలలో పండితులు. కాళిదాస రచనలపైని—అందును, కావ్యములలో కుమారసంభవముపైని అపారమైన గౌరవం. కాళిదాసుని ప్రతిశ్లోకంలోనూ అపారంగా గూఢార్థాలు ఇమిడి ఉన్నవని గ్రహించి వాటిలో కొంతవరకైనా ఆంధ్రులకు అందజెయ్యాలనే తలంపుతో ఈ రచనకు పూనుకున్నట్లు తెలుస్తున్నది.

రచయిత కాళిదాసు కుమార సంభవంలోని ఎనిమిది సర్గలలోను తమకు ముఖ్యములని తోచిన శ్లోకాలను గ్రహించి, వాటికి దండాన్వయం, ప్రతిపదార్థం భావం వ్రాశారు. భావంలో తమ మనస్సుకు, ఊహకు తట్టిన విశేషార్థాలను వివరించారు. ఆ భావావిష్కరణమే ఈ గ్రంథ రచనకు ప్రధానోద్దేశంగా కానవస్తున్నది. శ్రీ రాజుగారు ప్రథమ సర్గనుంచి 33 శ్లోకాలు, ద్వితీయాది సర్గలనుంచి వరుసగా 24, 38, 20, 35, 24, 34, 36 శ్లోకాలు తీసుకున్నారు. తక్కినవి అంత ముఖ్యం కావని భావించి ఉండవచ్చు. హిమాలయాది వర్ణనలతో కొన్నిచోట్ల మూలాన్ని విడిచి స్వాతంత్ర్యం అవలంబించి తమ భావాలను వెల్లడించారు.

దండాన్వయ, ప్రతిపదార్థాలు విద్యార్థులకు ఉపకారకాలు. భావం విపులంగానూ, పండితులుకూడా గ్రహించదగినదిగానూ ఉన్నది. భావం సంగ్రహంగా ఒక శ్లోకానికి ఉదాహృతి—

'ఇత్థ మారాధ్యమానోఽపి
క్లిశ్నాతి భువన త్రయమ్,
శామ్యేత్ ప్రత్యపకారేణ
నోపకారేణ దుర్జనః'

అన్వయం—ఇత్థం ఆరాధ్యమానః అపి భువన త్రయం క్లిశ్నాతి. దుర్జనః ప్రత్యపకారేణ శామ్యేత్, ఉపకారేణ న.

అర్థం—ఇత్థం=ఈ ప్రకారము (శతవిధముల) ఆరాధ్యమానః అపి=సేవించబడినను, భువనత్రయం=ముల్లోకములను, క్లిశ్నాతి=పీడించుచున్నాఁడు. దుర్జనః=దుష్టుఁడు, ప్రత్యపకారేణ(ఏవ) = ప్రతీకారముచేతనే, శామ్యేత్=శాంతించును, ఉపకారేణ=ఉపకారముచేత, న=శాంతించఁడు.

భావం-ప్రభూ! సూర్య చంద్రాదులు, ఇంద్రాది దిక్పాలురు, ఋతువులు శత విధము లతనిని సేవించినను, ఆ దుష్టుని కీషన్మాత్రమైనను దయ జనించదు, కనికర మెఱుఁగని కఠిన హృదయుఁడు. సురలందఱు వరుస వెంబడి సపర్యలు సలిపి సలిపి అలసిపోయిరి. మూఁడు లోకములకును ముప్పు తప్పలేదు. ప్రతీకారము తప్ప అన్యమార్గ మగపడదు. మన్నన పని చేయదు. దుష్టునికి ఉపకృతి యొనరించుట నాగుబామునకు పాలుపోయుటవంటిది. అది కాటువేయుట మానునా ? ఓ దేవా ! ప్రతి క్రియ నాలోచింపుము. మా ఇడుమలు బాపి మా దుఃఖమును నివారింపుము?

[పుట. 58.]

రచన ఈ పద్ధతినే సాగినది. పేరునుబట్టియే ఇందులో శృంగారరసానికి ప్రాధాన్యం తెలుస్తూ ఉన్నది.

దీని పీఠికలో డాక్టర్ వేంకటావధానిగారు 'భావవివరణమున వా రవలంబించిన పద్ధతి ప్రశంసా

పాత్రముగ నున్నది' అని వ్రాయుచున్నారు. 'మీభావము చక్కగ నడచినది. మంచి తెలుగుపదముల వచనము. శ్లోకములో లేని అనేకవిషయముల తెలియబరచిరి' అని డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు తమ అభిప్రాయము నిచ్చి యున్నారు. భావప్రకటనము మధురాతి మధురమైన శైలీపాకములో చేయబడినట్లు డాక్టర్ ధూళిపాళ అర్కసోమయాజులుగారు వ్రాశారు. భావం అనేదాన్ని భావంగా వ్రాయక అనువాదం అని వ్రాస్తే బాగా వుండేదని సుప్రసిద్ధపండితులు చర్ల గణపతి శాస్త్రిగారు వ్రాస్తున్నారు. ఎంచేత అలా అన్నారో వివరంగా బోధపడడం లేదు. వారి అభిప్రాయాన్ని అనుసరించే కాబోలు ముఖపత్రంపైనీ, అట్టమీదా ఇది అనువాదమైనట్లు తెలుపబడింది. అయితే అనువాదమంటే భాషాంతరీకరణమని అనుకోకూడదు. అను+వాదం—అనగా మహాకవి కాళిదాసు అభిప్రాయాలకు అనుగుణంగా చేయబడిన చర్చ అని అనుకోవలసి ఉన్నది.

సంస్కృతానికి కావ్య వాఙ్మయంలో ఇదొక కొత్తపద్ధతి వ్యాఖ్యాన గ్రంథమనీ, మూలాభిప్రాయాన్నీ విశేషాలతోకూడా సులభంగా గ్రహించడానికి మిక్కిలి ఉపయోగిస్తుందనీ చెప్పవచ్చును.

## ఆంధ్ర కవుల ఔచిత్య విచారణ

(ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ద్రవ్యసహాయం పొందిన గ్రంథం.) (రచన: శ్రీ కాశీభొట్ల—సత్యనారాయణ, క్రౌను సైజు 9+249 పుటలు. వెల. 6 రూ. ప్రతులకు—శ్రీ కాశీభొట్ల—సత్యనారాయణ, నర్సాపురం, ప. గో. జిల్లా, ఆంధ్రప్రదేశ్.)

ఏ సాహిత్యమైనా ఔచిత్యానికి దూరమయితే రసవంతం కాదనీ, అది సహృదయ హృదయాలను ఆకర్షింపజాలదనీ ఆలంకారికుల అభిప్రాయం. ధ్వనికారుడు 'అనౌచిత్యాదృతే నాన్యత్ రసభంగస్య కారణం' అని తెల్పియున్నాడు. ఆ ఔచిత్యాన్నే ప్రధానంగా గ్రహించి, క్షేమేంద్రుడు 'ఔచిత్య విచార చర్చ' అనే గ్రంథాన్ని రచించి, ప్రసిద్ధ కవుల రచనలలోని అనౌచిత్యాలనూ, ఉచితంగా ఉన్న వాటినీ చూపాడు. ఔచిత్యం ఎన్ని విధాలుగా పాటించబడవలసినదీ వివరించాడు.

'క్షేమేంద్రకృత 'ఔచిత్య విచార చర్చ' ఆధారంగా వేయి సంవత్సరాల ఆంధ్ర కవితా సురూప, విరూపాలను అనిదంపూర్వంగా సమీక్షించిన ప్రథమ గ్రంథం' ఇది అని వెనుక అట్టమీది ప్రకటన. నిజమే! రచయిత నన్నయను మొదలుపెట్టి ఇప్పటున్న కవులతోసహా అందరినీ చేర్చుకుని, వారి గ్రంథాలనుండి ఉదాహరణలను గ్రహించి విమర్శాత్మకంగా ఔచిత్యాన్ని ఇందులో వివరించారు. సంప్రదాయకవిత, నవ్య కవిత్వం అనే భేదం గ్రహించబడలేదు. ఇది 'అనిదంపూర్వమైన' రచనయే! రచయిత ఔచిత్యచర్చలో క్షేమేంద్రుని ఔచిత్యలక్షణాలను గ్రహించి, లక్ష్యాలను ఆంధ్రగ్రంథములనుంచి గ్రహించారు. అవసరాన్నిబట్టి సంప్రదాయౌచిత్యం, పాత్రౌచిత్యం మున్నగు వాటిని చేర్చారు. తనకు స్తనశల్యపరీక్ష చేయవలెననే దలపు లేనందున ఆయా విషయాలను సున్నితంగా తెలియజేశారు.

ఔచిత్యాన్ని వివరించేటప్పుడు ఎక్కడ, ఏ విధంగా ఔచిత్యం పాటించబడినదీ తీసుకున్న ఉదాహరణలలో స్పష్టంగా తెలియజెయ్యాలి. 'ఇందులో ఈ ఔచిత్యం ఉన్నది' అని ఉదాహరణ ఇచ్చినమాత్రాన యెక్కువ ప్రయోజనం ఉండదు. ఇందులో ఇచ్చిన ఉదాహరణలలో కొన్ని ఆయా ఔచిత్యాలతో ఎక్కువ సంబంధం కలిగి ఉన్నట్లు తోచదు. మూల లక్షణాలను, ఉదాహరణలను చూపుటలో తగిన శ్రద్ధ తీసికొనబడలేనట్లు తోస్తున్నది. కొన్నిమాత్రం ఇక్కడ చూపబడుతున్నవి.

'తలచుట్టి వారఁగన్నులు
గల్గిన పద్యంబు దప్పగాచన వశమే.'

[పుట 10]

ఇచట 'తలచుట్టువారఁ గన్నులు, గలిగిన...' అని ఉండవలెను. అలా లేకుంటే పద్యం అర్థమూ కాదు; ప్రాసా తప్పిపోతుంది.

అదే పుటలో చివరి పంక్తిలో రాధికాసాంత్వనం రచించినది 'ముద్దుపళ్లని' అని ఉంది. 'కవినామ సూచి క'లోనూ అలాగే ఉంది. 'పళని'కాని 'పళ్లని' కాదు.

12 వ పేజీలో కంకటి పాపరాజు పద్యం—

'వైదర్భీ విలాసమునఁ జెల్వం బూని...'అంటూ ఉదాహరించబడింది. 'వైదర్భీ విలసద్విలాసమునఁ జెల్వం బూని' అనే ఉత్తర రామాయణంలో ఉన్నది. అలా లేకుంటే పద్యమే కుదరదు.

14—వ పుటలో పదౌచిత్య లక్షణం—

'తిలకం బిభ్రతీ శ్యామా
భాత్యేకముచితం పదం,
చంద్రాననేవ కస్తూరీ
శ్యామేవ చందనం'

అని ఇయ్యబడింది. అర్థం కాక శ్లోకం కుదరక మూలాన్ని చూడగా అందులో

'తిలకం బిభ్రతీ సూక్తిః
భాత్యేక ముచితం పదమ్,
చంద్రాననేవ కస్తూరీ
కృతం శ్యామేవ చాందనమ్'

అని ఉన్నది. రచయిత మూలాన్ని అర్థం చేసుకుని లక్షణం గ్రహించినట్లు తోచడం లేదు. 'శ్యామా' పదం రెండుసార్లు రావడం, 'కృతం' లోపించడం, అసలు ప్రధానమైన 'సూక్తి' శ్లోకంలో లేకపోవడం గమనించదగినది.

15 వ పేజీలో నన్నయభారతంలోని 'ఆయత పక్షతుండహతి' అనే పద్యంలో మూడవ పాదంలో 'పాయక ఊమ్మనంద కడుబాముల మోవను' అని ఉన్నది. ఇక్కడ 'పాయక ఊమ్మనం దవడుబాముల మోవను' అని ఉంటేనేగాని అర్థం కుదురదు.

17 వ పుటలో వాక్యౌచిత్యాన్నిగురించి చెప్పేటప్పుడు 'ఔచిత్యం రచితం' అన్నదానికి బదులుగా 'ఔచిత్యరచితం' అని సమస్తపదంగా అనుస్వార రహితమై ఉంటేనేగాని లక్షణం కుదరదు.

దానికి ఇచ్చిన ఉదాహరణం— తిక్కన సోమయాజిగారి ఉద్యోగపర్వంలోని పద్యం—

'బకవిధ్వంసి జటాసురాంతకుఁడు హైడిం
బాప్రాణహారీణు కీ
చక నిర్మూలన కేళిలోలు—'

ఇత్యాదిగా ఉదాహృతమయింది. ఇది అర్థం కావడం లేదు. అన్నీ ద్వితీయాంతాలుగా ఉండగా 'జటాసురాంతకుఁడు' అని ప్రథమాంతం ఎలా వచ్చింది? 'హైడింబా' అనే వ్యక్తి ఎవ్వరు?' అని సందేహాలు కలిగాయి. తొలిపాదంలో ఛందస్సూ యతీ కుదరలేదు. ఏదో అచ్చు పొరపాటువల్ల ఇలా పడిందేమో ? అని అనుకుందామంటే—అలా అనుకొనడానికిన్నీ, అవకాశం లేకుండా

'ఈ పద్యమందు బకవిధ్వంసి, జటాసురాంతకుఁడు, హైడింబాప్రాణహారీణు, కీచకనిర్మూల కేళిలోలు—' ఇత్యాదిగా ఆ పుటలోనే వివరణలో చెప్పబడింది.

తిక్కన ఉద్యోగపర్వంలో మాత్రం పద్యం

'బకవిధ్వంసి, జటాసురాంతకు, హిడిం
బప్రాణ హారీణు, కీ
చకనిర్మూలన కేళిలోలు—'

అని సులభంగా అర్థమయేటట్లు నిర్దుష్టంగా కానవచ్చింది.

మొదటి కొలది పుటల్లోనే చిన్న చిన్న అచ్చు పొరపాట్లు మినహాగా ఇవి కానవచ్చాయి.

రచయిత చాలా శ్రమపడి వివిధ గ్రంథాలనుండి ఉదాహరణలను స్వీకరించినప్పుడు సరియైన పద్ధతిలో ఉదాహరిస్తే బాగుండేది. ఆ యా పుస్తకాలనుంచి ఎత్తి వ్రాసుకునేటప్పుడు శ్రద్ధ చూపడం ఉచితం. అలా చెయ్యకుండా 'ఔచిత్యాలకు' ఉదాహరణలుగా చూపినా, వివరించినా తగినంత ప్రయోజనం ఉండదు.

అది ఔచిత్యానికి దూరంగానే ఉంటుంది.

—'అంగీరస'

# వైతరణి

(నవల)

(రచన: వాసిరెడ్డి సీతాదేవి. ప్రకాశన: ఎం. శేషాచలం అండ్ కంపెనీ—మద్రాసు—మచిలీపట్నం—సికింద్రాబాదు. పేజీలు—160. వెల—రు. 2–50 పైసలు.)

మన సమాజంలో ఉమ్మడి కుటుంబాలు అచ్చటచ్చట కాన్పిస్తాయి. ప్రతికుటుంబానికేవో సాధక బాధకాలు సామాన్యంగా ఉంటాయి. కొన్ని సంసారాలల్లో తల్లిదండ్రులమాట నెగ్గించుకొని తమ అధికారాన్ని చెలాయించి ఆ కుటుంబాన్ని చక్కదిద్దుతారు. మరికొన్ని కుటుంబాల్లో తల్లిదండ్రులు నామమాత్రంగా ఉండి కొడుకుల పెత్తనం క్రింద సంసారం సాగిపోతూ

ఉంటుంది. మనలో తుదివరకు ఏకత్రాటిపై ఉమ్మడి కుటుంబాన్ని నడిపింపగల సమర్థులు చాల తక్కువ. ఈ కుటుంబాలు చీలిపోవటానికి కారణం ఆ యింటిలోని ఆడవారే. అన్నదమ్ముల మధ్య సంబంధం పెనువేసికొనిఉన్నా ఆడవారి ప్రమేయంతో సంబంధం కాస్తా తెగిపోతుంది. ఆ విధంగా తెగిపోయిన ఉమ్మడి కుటుంబ గాథను వివరించేదే యీ 'వైతరిణి' నవల. దీనిని రచించినది కుమారి వాసిరెడ్డి సీతాదేవి.

పున్నమ్మ—మాధవయ్యలకు నలుగురు మగపిల్లలు. ఒక ఆడపిల్ల ఉన్నారు. అందరికి వివాహాలు అయి పిల్లలుకూడ కలిగారు. జీవితాలు సాఫీగానే సాగుచున్నాయి. పున్నమ్మ కన్నకూతురిపై ప్రేమ కొర్దీ పెట్టుపోతలు ఘనంగా సాగించింది. అది కోడండ్రకు కన్నెఱ్ఱ అయి కలతలకు నాంది పల్కింది. మనుష్యులు మారిపోయారు. బుద్ధులు వక్రించాయి. మాటలు పెడదారి బట్టాయి. ఇంటి గమనాన్ని పరిస్థితులే అరికట్టాయి. పున్నమ్మ అల్లుడు చనిపోయాడు. కూతురు నాగమ్మ పుట్టింటికి వచ్చింది. కష్టాలు వచ్చాయి. కోడండ్ర సూటిపోటు మాటలకు, కన్నకూతురు దురదృష్టానికి పున్నమ్మ తల్లడిల్లి మానసిక వ్యధ భరింపలేక కన్ను మూసింది. కొంతకాలానికి మాధవయ్య చనిపోయాడు. నాగమ్మ, తన కూతురు పార్వతి ఆ యింటిలోనే ఉన్నారు. ఆ యింటిలో వారు నరకాన్ని అనుభవిస్తున్నారు. దాని నుండి బయటపడాలని పార్వతి ముసలి భద్రయ్యను పెండ్లిచేసికొన్నది. కాని మనసు సమానవయస్కుడైన సూర్యనారాయణపై లగ్నమై అతనితో లేచిపోయింది. తల్లి నాగమ్మ మరణించింది. ఇది నవలయందలి సంక్షిప్తంగా కథ.

ఇందులోని ప్రతిపాత్ర సమాజానికి ప్రతీకగా ఉంటుంది. అడ్డాలలో ఉన్నంతకాలం బిడ్డలేగాని గడ్డాలు మీసాలు వచ్చిన తరువాత బిడ్డలుకారని మాధవయ్య వెంటనే గ్రహించినా పున్నమ్మ గ్రహించలేకపోయింది. అంత సంపద సంపాదించి బిడ్డల హస్తగతంచేసినా వారినుండి మానసికంగా దూరమయ్యాడు. కలిమిలో కష్టాన్ని చూచాడు కాని అనుభవించలేదు. ఆ కష్టం బిడ్డలదగ్గర అనుభవిస్తున్నాడు. తనకు తెలివితేటలున్నా తన బ్రదుకును పూలబాటగా మార్చుకోలేకపోయాడు. తాను కొవ్వొత్తిలా ఉండి బిడ్డలకు కాంతి యిచ్చి చివరకు ఏమీ లేకుండా కాలిపోయాడు. పున్నమ్మ కూతురు కూతురు అని కలవరించి కన్నవారికి దూరమయ్యింది. కోడళ్ళ మాటలలోని ఆంతర్యం గ్రహింపకుండ తన పని తాను చేసికొంటూపోయింది. కాలగమనాన్ని పరిశీలించి చూడలేకపోయింది. కన్నబిడ్డలు కాంతాదాసులని గ్రహింపలేకపోయింది. కన్నప్రేమచేత బిడ్డలందరి లోపాలను తడవి చూడలేకపోయింది. విపరీతమగు మమకారాంధకారంలో మునిగిపోవటంచేత తన ప్రక్కలకుకూడ చూడలేకపోయింది. నాగమ్మ కష్టాలే పున్నమ్మ ప్రాణాలు హరించాయి.

సుబ్బారాయుడు, నాగభూషణం, రామదాసు, సత్యనారాయణ నలుగురూ నాల్గురకాల మనస్తత్వాలు కలిగినవారు. అయితే మాధవయ్య మనస్తత్వం ఒక్క సత్యానికే వచ్చింది. సుబ్బారాయుడు తన భార్య నాగరత్నం అంటే వ్యతిరేకత ఉన్నా ఆమె యిచ్చే సలహాలకు తలవొగ్గాడు. నాగభూషణం సుందరమ్మ మాటకు విలువయిచ్చాడు. రామదాసుకు కమల సలహా అంటే ప్రాణప్రాయం.

సత్యానికి పెళ్ళిలేదు. రాజకీయాలే అతనికి పరమార్థం. కొడుకులు ముగ్గురు తల్లిదండ్రులకు ప్రాధాన్యం యియ్యలేదు.! భార్యలచేతుల్లో కీలుబొమ్మలై వారు ఆడించినట్లుగా ఆడారు. భార్యలకు భయపడి వారి ముందు భర్తలు చేతులు జోడించి నిలబడ్డారు. పెద్దవారు ముగ్గురు కుమారుల్లో వ్యక్తిత్వం మంటకలిసింది. వీరు మువ్వురు మనసులు లేని మనుష్యులు. తల్లిదండ్రులు బాధపడుతూంటే పరిష్కారమార్గం కనుగొనలేని వాజమ్మలు.

రచయిత్రి సత్యానికి పెళ్ళిలేకుండా ఉమ్మడి కుటుంబంనుండి రాజకీయాలకు పంపించారు. అతడే రాజకీయాల్లో పాల్గొనకుండా ఉంటే మాధవయ్య సంసారం మరొకరకంగా ఉండేది. అయితే అతడున్నంతసేపు పాఠకులకు మంచివాడుగా కన్పించినను వదినలకుమాత్రం కంటకంగా కాన్పించాడు. సత్యం యింటినుండి వెళ్ళిపోవటం నాగరత్నానికి మహాసంతోషమయ్యింది. అతడుద్యమాల్లో పాల్గొని యింటికిరాడనే ఉద్దేశంతో అతని వాటాకూడ వారే తీసుకుని వచ్చే ఆదాయం అనుభవింపవచ్చునని ప్లానువేసి మాట

నెగ్గించుకొన్నది. నాగరత్నంవల్లనే ఉమ్మడి కుటుంబం ముక్కలైపోయింది.

నాగమ్మ వట్టి అమాయకురాలు. పౌరషహీన మైన బ్రదుకులో బాధను గ్రహించినా తలవంచి ఊరుకొన్నది. అన్నల అనురాగానికి దూరమయ్యింది. కర్తవ్యాన్నిగూర్చి ముందు ఆలోచనలేదు. గానుగ ఎద్దులా జీవితం గడిపింది. నిజంగా నాగమ్మ కాబట్టి అంతకాలం అన్నల యింట్లో ఉన్నది. మరొకరయితే ఎప్పుడో ప్రాణం తీసికొని ఉండేది. కాని చివరకు రచయిత్రి నాగమ్మను నిండిన కోనేరు కప్పగించి చేతులు దులుపుకొన్నారు.

నాగమ్మ కూతురు పార్వతి. చలం పుస్తకం చదివింది. అతడు నేర్పిన సిద్ధాంతాన్ని అక్షరాలా పాటించింది. శారీరక వాంఛకు తారతమ్యం గమనించ లేదు. ఒకరికి భార్యయై మరొకరితో లేచిపోయింది. రచయిత్రి పార్వతికి లేచిపోవటం నేర్పారు.

వాసిరెడ్డి సీతాదేవి కథలు—నవలలు వ్రాశారు. వ్రాసిన నవలల్లో 'మట్టిమనిషి! మంచి నవల. ఆ నవల ముందు వారి రచనలేవీ నిలబడలేవు. రచయిత్రికి ఉమ్మడి కుటుంబంమీద విశ్వాసంలేదు. అందు వల్లనే సంసారాన్ని ముక్కలుచేసి చూపెంచారు. నవలలో అసహజఘటనలు కొన్ని ఉన్నాయి. వానిద్వారా రచయిత్రి ప్రయోజనమేమీ సాధించలేదనే చెప్పాలి.

పున్నమ్మను మరీ అమాయకంగా తీర్చారు. కోడండ్రు ఎత్తిపొడుపులకు సమాధానం చెప్పలేని అత్తలు యీ రోజుల్లో ఉండరు. కాని రచయిత్రి పున్నమ్మను ఏమీ మాట్లాడనీయకుండా నోరు నొక్కారు. ఈ పాత్ర అసహజంగా ఉన్నది.

పార్వతి పాత్రకూడా అసహజమే. తల్లికోసం త్యాగంచేసింది. కాని చివరలో తల్లినిగూర్చి పటించు కోకుండా ప్రియునితో లేచిపోయింది. అంతటి కుమార్తె యీవిధంగా చేయుటం సందేహంగా ఉన్నది.

కథమధ్యలో నాగమ్మకు కలవచ్చినట్లు చూపిం చారు. ఆ ఘటన సినిమాలో కలలా ఉన్నది. నవలలో కల చూపింపవలసిన అవసరంలేదు. సరే వీరి సంస్కారం చూడండి. రచయిత్రి కథాంతంలో పార్వతి చేత లేఖ వ్రాయించి సంస్కారంపై ఉపన్యాసమిచ్చారు. అయితే యీ సంస్కారం కూడుగుడ్డ యియ్యకపోగా సంఘంలో మాయనిమచ్చ తెస్తుంది. రచయిత్రి ఏ ఉద్దేశంతో పార్వతిని ముసలి భద్రయ్యకిచ్చి పెండ్లి చేసారో చివరకా ఉద్దేశానికి తిలోదకాలిచ్చి యింటి నుండి లేచిపోవునట్లు చేసారు. లేచిపోయేవారు ముసలి వారిని వివాహమాడటాని కంగీకరింపరుకదా. మరి పార్వతి అంగీకరించినట్లు రచయిత్రి చెప్పారు. వీరి ఉద్దేశ్యంలో స్త్రీ లేచిపోవటమే యిష్టం. అదే స్త్రీకున్న స్వాతంత్ర్యమని వీరి భావం ప్రతిస్త్రీ ఆవిధంగాచేస్తే యీ సమాజం గతి యేవిధంగా ఉంటుందో ఊహించుకోవచ్చును. రచయిత్రి పార్వతి పాత్రద్వార విశృంఖలాన్ని ప్రబోధిస్తున్నారు. ఈ విశృంఖలత్వాన్ని స్వాతంత్ర్యం అని వ్యాఖానిస్తే హాస్యాస్పదం అవుతుంది. వీరు చెప్పిన ధోరణినిబట్టి చూస్తే సమాజంలో అభ్యుదయంకంటె అనర్థమే అధికం. రచయిత్రి చలాన్ని చూపిస్తున్నారు. అందు వల్ల నవలా రచన ప్రయోజనం ఏమిటో వారికే తెలియాలి.

నేటి సంస్కరణవాదులు ముసుగులో గుద్దు లాట సాగిస్తున్నారు. పేరు ప్రతిష్ఠలమాటున కొట్టుమిట్టాడి పదిమందిలో గుర్తింపబడాలని లేని పోని ఆర్భాటాలు సాగిస్తున్నారు. సంస్కారం పేరు చెప్పి నీతికంటే అవినీతిని ప్రోత్సహిస్తున్నారు. జీవితానికొక నియమము పద్ధతి లేకపోతే ఎవరికి వారు యమునాతీరే అయిపోతారు. సంప్రదాయానికి విపరీతమగు వ్యాఖ్యానాలు చేసి సంప్రదాయం నోరు మూయటానికి ప్రయత్నిస్తున్నారు. దానిపై ధ్వజ మెత్తినంతమాత్రమున వీరికేమీ ఒడిలో వచ్చిపడదు. అంతేగాక తూలనాడినంతమాత్రన సంస్కరణవాదులుగా చెలామణి కాలేరని గ్రహిస్తే మంచిది.

రచయిత్రి నవలను సాఫీగా నడిపించారు. కాని కథలో ప్రదర్శించిన సంస్కరణవలన పటుత్వం తగ్గింది. అయినా నూటఅరవైపేజీల కథ ఒక్కసారి చదివి చూడండి.

—రామమోహన్.

## అతిమానస ఉషోదయము

(మాతృశ్రీ ప్రవచనాల సంకలనం. $\frac{1}{8}$ డెమ్మీ. 240 పుటలు. ప్రచురణ: శ్రీ అరవింద సొసైటీ తెనాలి. వెల. రూ. 2.50.)

అరవిందుల ఆశ్రమానికి ఆధారచక్రం మాతృశ్రీ. 'మాతృశ్రీ లేనిదే ఆశ్రమమే లేదు' అని అరవిందులు స్వయంగా ఒకసారి చెప్పారు. ఫ్రాన్సులో భోగభాగ్యాలమధ్య జన్మించిన మాతారవిందులు భారతీయ వేదాంతంద్వారా ఆకర్షింపబడి భారతదేశంవచ్చి అరవింద యోగసాధనలో తాదాత్మ్యం చెంది అరవిందుల జీవనకార్యానికి తన్నుతాను అంకితం చేసుకున్నది. 1926 నవంబరు 24 నుండి అరవిందాశ్రమ ప్రధాన నిర్వాహకురాలిగా ఉంటూ వచ్చి అరవిందుల పార్థివదేహ విసర్జనానంతరం అరవింద తత్వానికి వారే మూలస్తంభంగావుంటూ భక్తులను 'దివ్యమాత'గా సాక్షాత్కరించారు. భారతీయులు ఆమెలో ఉమను, కాళినీ, సరస్వతినీచూస్తే పాశ్చాత్యులు మేరీ అవతారంగా భావించి ఉపాసించారు. శ్రీ మాతారవిందులు వివిధ సందర్భాలలో ప్రవచించిన సందేశాలనూ వ్యాఖ్యానాలనూ అనువదించి సంకలన రూపంలో ఒక అజ్ఞాత భక్తులు తీసుకొని వచ్చారు. ప్రధానంగా 'ది బుల్లెటిన్' 'ది మదర్ ఇండియా' ఆల్ఇండియా మాగజైన్'వంటి అరవిందాశ్రమ పత్రికలమండి ఈ ప్రసంగాలూ, సంఘటనలూ స్వీకరించబడ్డాయి. వీటన్నింటి సమాహార స్వరూపమే ఈ 'అతిమానస ఉషోదయము.'

ఇందులో మొత్తం పది ప్రకరణాలున్నాయి. మాతారవిందుల సందేశాలు, విద్యార్థులకు వారిచ్చిన హితవచనం, ప్రత్యేక వ్యక్తులకు వారిచ్చిన సందేశం, సాధనాకిరణాలు, సమస్త జీవనము యోగమేనన్న తత్వమూ, ఆత్మరాత్మ సాధనావిధానం, దివ్యకర్మ యోగరహస్యం— భారతదేశముగూర్చి మాతారవిందుల అభిప్రాయాలు, మాతృశ్రీ మహానుభూతులు వరుసగా ఆయా ప్రకరణాలలో వివరింపబడి చివర మాతారవిందుల మహనీయత ఏమిటో శ్రీ అరవిందుల వాక్యాలలోనే వివరించబడింది. దీనినిబట్టి విషయ విశ్లేషణంలో సంకలనకర్త శాస్త్రీయమైన, జనోపయోగమైన మార్గాన్ని అనుసరించారనేది సుస్పష్టం. అమెరికాఖండానికి మాతారవిందులు 4–8–1949లో సందేశమిస్తూ 'మీరు పాశ్చాత్యులని ఇతరులను ప్రాచ్యులని భావించడం ఇక విరమించండి. మానవులందరిదీ ఒకే దివ్యమూలం. ఆ మూలముయొక్క ఏకత్వమును అభివ్యక్తము చేయడానికే వారు ఉద్దేశింపబడినారు' అని తూరుపు—పడమరల ఎల్లలను చెరిపివేసే భారతవేదాంతాన్ని వారు చాటారు. 'చెప్పుదుము—చేయుదుము —ప్రకటింపకుము —సాధింపుము' అని 1950 లో ఒక సందర్భంలో పాఠకులకు హెచ్చరిక హితోపదేశమూ చేశారు. మహిషాసురుణ్ణి దుర్గ వధిస్తుంది. ఆ తర్వాత వచ్చేదే విజయ దశమి. అయితే మహిషుడు ఒక యుగానికి చెందినవాడు వాడు. మహిషుని తామసతత్వం మానవాళిలో• ఒక భాగమే. దానిని జయించడమే, అతిమానస సాధన. ఈ అంశాన్నే మాతారవిందులు ' విషాద నిరాశారూపమైన అసురునే ఈ రాత్రికి మనము వధింపనున్నాము. అలా ఉద్యమించినప్పుడు ఈ రుగ్మతను వదిలించుకోవాలని ఎవరు నిజముగా సంకల్పించుకున్నారో వారు దానిని జయించడానికి అవసరమగు సాయమును స్వీకరింతురు' అని 20–10–1950 లో ప్రవచిస్తారు. మృత్యువుకు నీవు భయపడితే అది నిన్ను ఓడిస్తుందనీ (21–2–1954) మృత్యుం జయత్వం సాధించలేవనీ, మాటలవైపుకాక క్రియకు ఉన్ముఖుడవు కమ్మనీ (1950) వారు ఉపదేశించారు. 'సత్యము ప్రపంచమును పాలించే శుభముహూర్తము చేరు దెంచుతున్నదని' (రాయగడ్ కేంద్రమువారికిచ్చిన సందేశం.) అతిమానస యుగావతరణాన్నిగూర్చి మాతారవిందులు మానవాళికి ఇందులో హామీ ఇస్తున్నారు. ఈ హామీ సమస్త శాస్త్రవేత్తలు, తత్వవేత్తలు ఇంతవరకు భూతలంలో ఇచ్చిన హామీలకన్నా సర్వశ్రేష్ఠమైనదని విజ్ఞులకు తెలిసిన విషయమే కదా! మానవజాతి అస్తిత్వానికె ఇది ఏకైక ఆశాకిరణం!! 'పరలోక రాజ్యము నీకై ఉన్నది' అన్న హామీకీ భూతలంలోనే సత్యయుగావతరణం జరుగుతుందన్న ఈ నమ్మకానికీ ఎంతో అంతరం లేదా మరి !!

'సమస్త జీవనము యోగమే' అన్న అధ్యాయం చాలా ముఖ్యమైంది. కర్మయోగ భాష్యంగా ఈ అధ్యాయాన్ని భావించవచ్చు. 'స్వేచ్ఛ' అంటే మన 'ఇష్టం' వచ్చినట్లు ఉండటంకాదనీ, ఇంద్రియాల ప్రేరణలకే స్వేచ్ఛ' అని ఆధునికుడు భావిస్తున్నాడనీ 'నేను' ఎవరో తెలుసుకోవడంలేదనీ మాతృశ్రీ అంటున్నారు ఇందులో (103 వ పుట.) 'నీ మాట స్థాయి విధానముకూడా మిక్కిలి నిర్మలముగా ప్రశాంతముగా

అగ్రహరహితముగా నుండునట్లు' చూచుకొనాలని వాఙ్నియమాన్నిగూర్చి చెప్పడం 'అనుద్వేగకరం వాక్యం' అన్న గీతార్థ వివరణమా, అన్నట్లు ఉంటుంది.

'All life is yoga' అన్న ఈ భావం తత్వ శాస్త్రంలో శిఖరాగ్రదశ!

'భారతదేశము—మాతారవిందులు' అన్న అధ్యాయంలో అరవిందులు — మాతారవిందులు — భారత జాతీయవాదానికి ఇచ్చిన నిర్వచనాలు గమనింపవచ్చు. భారతదేశం అనాదిగా ప్రాదేశిక జాతీయవాదాన్నికాక (Territorial nationalism) ఆధ్యాత్మిక జాతీయ వాదాన్ని ప్రతిపాదిస్తూవచ్చింది. ఇదే ఈ జాతి వైభవానికి శాశ్వతత్వానికి మౌలికమైన కారణం. జాతీయ సమైక్యతకు 'భారతయాత్మ'ను మేల్కొల్పాలని మాతృశ్రీ ఇందులో సూచిస్తున్నారు. 'శ్రీమతి ఇందిరా గాంధీ మాతృశ్రీని దర్శించినపుడు పార్టీ రాజకీయాలకు స్వస్తిచెప్పి సమైక్య రాజకీయాలకు శ్రీకారము చుట్టమని సందేశమిచ్చారు.' (150వ పుట) సామ్యవాదదేశాలలోకూడ సమైక్యతా లేకపోలేదు కాని 'బయట'నుండి బలవంతంగా వచ్చిన ఆ ఏకత ఎక్కువకాలం నిలువదు. (151వ పుట) అందుకే ఆధ్యాత్మిక ప్రాతిపదికమీద ఇక్కడ జాతీయ సమైక్యత సాధించాలని మాతృశ్రీ సూచిస్తున్నారు. బలము సత్వలక్షణమనీ, ఆర్యశబ్దం జాతివాచకంకాక శ్రేష్ఠవాచకమనీ వివరిస్తున్నారు ఇందులో. గోవాలోని సైనికచర్యవంటి చర్య అవసరంలేకుండానే అరవిందుల ఇచ్ఛానుసారం మాతృశ్రీ పాండిచ్చేరిని భారత యూనియన్ కలిపే ప్రయత్నానికి దోహదంచేసి జాతీయ సమైక్యత సాధించారు. (165వ పుట.)

గీతకు ప్రవృత్తిపరంగా వ్యాఖ్యానం నిర్దేశించి సన్యాసపరమైన వ్యాఖ్యానానికి స్వస్తి చెబుతున్నారు మాతృశ్రీ. (173) తిలక్ గీతారహస్యంకూడా ఇదే. To be (177వ పుట) అన్నదే అమ్మ మనకిచ్చే పెద్దకానుక. To know is good. To live is better. 'To be' treat is perfect!!

కారణమేమిటో తెలియదు కాని వివేకానంద గ్రంథాలకు వచ్చినంత సరళ వ్యాఖ్యానాలు అరవింద సాహిత్యానికి రావడంలేదు. అసలే విషయం గహనమైనది. దానికి తోడు తెలుగు నుడికారం కనుక లోపిస్తే అర్థంకావడం అసంభవం!! ఈ విషయాన్ని అరవిందుల భక్తులైన వివిధ అనువాదకులందరూ ఆలోచించవలసిందిగా సవినయంగా మనవిచేస్తున్నాను.

'అతిమానస ఉషోదయం' కారుచీకటిలో కాంతి రేఖ! 240 పుటల ఇంత మంచి గ్రంథాన్ని ఇంత తక్కువ వెలకు ఇవ్వడం సొసైటీవారి నిష్కామమైన అరవింద తత్పరతకు నిదర్శనం!!

—"శివప్రసాద్"

## మల్లన మంత్రి కథలు

(రచన: శ్రీ మహేష్. 144 పేజీలు. వెల: రు. 4/-లు. ప్రచురణ: జగ్‌జీవన్ పబ్లికేషన్స్, నంద్యాల.)

తరతరాలుగా పరంపరగా తెనుగునాట యుక్తి కథ లెన్నో ప్రచారంలో ఉంటున్నవి. యుక్తి కథ లన్నప్పుడు తెనాలిరామన్న, మర్యాదరామన్న, బీర్బల్ మంత్రి—ఈ ముగ్గురి పేర్లూ చటుక్కున స్ఫురణకు వస్తాయి. ఒకే కోవకు చెందినవి కనుక, జనపదంలో ఈ గాథలన్నీ కలగాపులగమై. ఏవి ఎవరికి చెందినవో విడమర్చి చెప్పలేని సమస్యగా ఏర్పడింది. అయినా అది ఒక పెద్ద వివాదాంశం కాదు. ఏమంటే—ఈ గాథలన్నీ ఎన్ని రూపాలలో అయినా ఎన్నిమారులయినా కుతూహలంతో వింటాం, చదువుతాం.

ఇదే బాణీలో ఇప్పుడు శ్రీ మహేష్‌కలంనుండి 52 చిట్టికథలు వెలువడ్డాయి. వీటికి కథా నాయకుడు మల్లనమంత్రి. రాజ్యాంగంలో ఎదుర్కోవలసిన గడ్డు చిక్కులను విడదీయటంలో మల్లన చూపిన చాతుర్యం అనన్య సామాన్యమైంది. అదే పాఠకుల వినోదం, విజ్ఞానం, ఆనందం.

ఇవన్నీ మహేష్ సొంత కల్పన. పెద్ద సమస్యలను చిన్ని కథలలో ఇమిడ్చి చెప్పడం మహేష్ ప్రత్యేకత.

## బాలలకు 'బాబు' కానుకలు

(1. అవ్వ చెప్పిన అద్భుత కథలు 2. తాత చెప్పిన తమాషా కథలు 3. గున్నడి ఘనకార్యాలు 4. మంచివాడు—మోసగాడు 5. వాగ్మహిమ 6. దుష్టగ్రహంనుంచి దండయాత్ర. ఇవి శ్రీ కె. పి. బాబు రచనలు. ఒక్కొక్కటి 48 పేజీలు. రు. 1–75 లు.

రెళ్లడవని మాత్రం రు. 1–50. (ప్రచురణ: జగ్‌జీవన్ పబ్లికేషన్స్, నంద్యాల.)

ఈనాడు పాఠ్యపుస్తకాలతో పిల్లల విద్య పూర్తి కాదు. తోడుగా మరెన్నో పుస్తకాలూ పత్రికలూ చదివినప్పుడే విజ్ఞాన సముపార్జనకు వీలవుతుంది. ఇదే ఉద్దేశంతో 1946 లో పిల్లల పత్రిక 'బాల' ప్రారంభమైంది. నాటినించీ బాబు 'బాల' లోను ఇతర పత్రికలలోనూ పిల్లలకు ఉపకరించే కథలు రాస్తూ ఉన్నారు, అవే ఇప్పుడీ ఆరు పుస్తకాలుగా ఒక క్రమపద్ధతిలో వెలువడినాయి.

ఒక్కొక కథ శీర్షిక, అందులో ఇమిడివున్న సమస్య, ఏది చూసినా పిల్లలకు ఆహ్లాదాన్ని కూర్చి, వారి మనస్సుకి హత్తుకునే ధోరణిలో వినోదం కలిగిస్తూ ఉన్నాయి. పాతకాలపు కథలే కాకుండా, ఈనాటి విషయాలు కూడా పిల్లలకు తెల్పడం ఈ చిన్నికథల విశిష్టత. మచ్చుకి—'గన్నడి ఘనకార్యాలు' డిటెక్టివ్ కథలు, 'వాగ్మిహిమ'లో మంత్రాలూ, తంత్రాలు, 'దుష్టగ్రహంనుంచి దండయాత్ర' ఆధునిక విజ్ఞాన విషయాన్ని చక్కగా బోధపరుస్తుంది. ఇటువంటి మరెన్ని కథలయినా మన పిల్లలకు అవసరమే.

—శివకుమారి.

## వె లు గు లో కి

(వెల తెలియదు. ఇందూరు భారతి, 3–12–32 అశోక్‌వీధి, నిజామాబాద్ (ఆం. ప్ర.)

నిజామాబాద్‌లోని రచయితల వేదికగా ఏర్పడిన ఇందూరు భారతి నాలుగోవార్షిక సంచిక మనముందు వుంది. ప్రస్తావన, ప్రగతి చదివి పరోక్షంగానే కాకుండా ఈ సంపుటినిచూస్తే ప్రత్యక్షంగా కూడా నిజామాబాద్ మండలంలో కవుల్నీ, రచయితల్నీ సమీకరించడానికీ, వారి సాహిత్య వ్యాసంగంలో తోడ్పడి బలమైన పునాది కల్పించడానికీ 'ఇందూరు భారతి' చేస్తున్న కృషిని అర్థం చేసుకోగలం.

ఒక ప్రదేశానికి పరిమితమైనా, నవరచయితల సంకలనంలో కనిపించే మంచీ చెడ్డాకూడా దీనిలోనూ మనకి కనిపిస్తున్నాయి. నేడు దేశాన్నీ, సమాజాన్నీ, వ్యక్తినీ ఎదుర్కొంటున్న సమస్యలు నవరచయితలకు కావ్యవస్తువులయాయి. వారిని ఆందోళనపరుస్తున్నాయి. ఆలోచింపచేస్తున్నాయి. 'స్వయంపాకం'గా వూరుకోకుండా తమ ఆందోళనలూ, ఆలోచనలూ సాహిత్యరూపంలో వ్యక్తం చేస్తున్నారు. ఇది మంచిదే.

అయితే ఆ వ్యక్తీకరణం చాలా బలహీనంగా వుంది, సర్వసామాన్యంగా. అనవసరమైన పదాడంబరం, వ్యర్థమైన పెంపుదల విషయం నవకవులు జాగత్తపడాలి. చిన్న విషయాన్ని సుదీర్ఘంగా చెప్పడం గాక, బరువైన పెద్ద విషయాన్ని సూక్ష్మంగా, స్పష్టంగా చెప్పడం కవికి కావలసిన మంచిగుణం. మన తెలుగుదేశపు కవులలో— అక్కడ పాతకొత్తల మధ్యనున్న భేదం తక్కువ— లోపించినదదే. చెయ్యి తిరిగిన వారి కవితలలో పద పయోగ కౌశల్యం కనిపిస్తుంది. నవ్యులలో అది తక్కువ. అంతే భేదం.

ఇందుకు వుదాహరణ దీనిలోని కవితలే.

ఈ వార్షిక సంచికలో కవితాభాగమేగాక వచన విభాగం—వ్యాసాలూ, కథలూ—కూడావుంది. అందులో కవితనుగురించి శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి వ్యాసం (కవిత్వానికి జబ్బుచేసింది) ఒకటీ, శ్రీ ఏ. సూర్యప్రకాశ్‌గారిది (కథలూ—కాకరకాయలూ) ఒకటీ ముఖ్యంగా ఆలోచించదగివున్నాయి.

'కవిత్వం అన్నికాలాల్లోనూ కొంతదూరంపోయి యిక ఎటూపోలేక దిక్కుతోచకుండా నిలబడిపోతుంది ...అటువంటిచోటికే వచ్చి నిలబడిపోయామేమో అనే అనుమానం నాకు కలుగుతుంది'— అంటారు శ్రీ పురాణం తమ వ్యాసాన్ని ముగిస్తూ. అల్లాగే—

'కథల్లో ఏదో ఒక పెద్ద వుప్పెనవచ్చి...' చెత్తంతా కొట్టుకుపోయి ... కాని మార్పురాదు. మార్పువస్తే కాని...కొత్త వెలుగు ప్రవేశించి కథాసాహిత్యంలో కొత్తయుగం ప్రారంభంకాదు' అంటారు శ్రీ ఏ. సూర్యప్రకాశ్ తమ వ్యాసం ముగిస్తూ.

సాహిత్యంలోని రెండు ప్రధాన ప్రక్రియల్ని గురించి వచ్చిన ఈ ఏకాభిప్రాయం నిజంగా పరిశీలించతగివుంది.

సాహిత్యంలో ఎప్పుడూ సామాజిక పరిస్థితుల్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నమోదుచేస్తూ, వానిని ప్రతిబింబిస్తూంటుంది.

అయితే ఆ సామాజిక పరిస్థితులు ఎప్పుడూ స్థిరంగా వుండవు. మారుతూంటాయి. ఆ మార్పులు

పరిమాణాత్మకంగానే సాగుతున్నంతకాలం మనం గుర్తించం. గుణాత్మకమైన మార్పు వచ్చినప్పుడేనా గుర్తించాలి. ఆ విధంగా గుర్తించక పాత ధోరణిలోనే సాహిత్య సృష్టి సాగుతూంటే విగాసాలు వొచ్చినవాడు తొడలాగు తొడుక్కున్నట్లు ఎబ్బెట్టుగా కనిపిస్తుంది. ఆ ఎబ్బెట్టుగా కనిపించడమే సాంఘిక పరిస్థితులకీ సాహిత్య ప్రక్రియలకీ మధ్య వైరుధ్యంగా ఏర్పడి నందుకు నిదర్శన.

సాహిత్యంలో ఇటువంటి వైరుధ్యాలను అధిగమించి, ముందు కడుగువేయడం ఎప్పుడూ గుడ్డివాని చేతిరాయి తగిలినట్లే జరుగుతూంది. రచన అపారంగా సాగుతుంది. అనంతంగా ప్రయోగాలు సాగుతాయి. ఆ వైరుధ్యాన్ని గుర్తించి, అర్థం చేసుకొని జరిపే ప్రయోగాలు కావవి. సర్వసామాన్యంగా ప్రజల దృష్టిని ఆకర్షించేందుకు చేసే ప్రయత్నాలుగానే అవి సాగుతాయి. ప్రజా ప్రయోజనాలను ఈషణ్మాత్రంగా గుర్తించినా అది విజయం పొంది నవ్యపంథాను దారి వేస్తుంది. శ్రీ శ్రీ 'మహాప్రస్థానం' అందుకు వుదాహరణ వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రం, గురజాడవారి కవితా ప్రక్రియ అందుకు వుదాహరణ. ఆమాదిరి మార్పు రాకపోతే ప్రకృతిలో, చరితలో జరిగినట్లే సాహిత్యంలోకూడ ప్రతిష్టంభన, క్లైబ్యం వస్తాయి. బంధకవిత్వాలు కవిత్వపు గారడీలు సాగిన 19 వ శతాబ్దపు తెలుగు కవిత్వపు దశ అదే.

సంఘంలో వచ్చే బృహత్తరమైన మార్పులేగాక, చిన్నచిన్న మలుపులూ, వ్యత్యాసాలూ కూడ వ్యక్తం అయేది అట్లాగే. అయితే ఈనాడు ఆ వ్యత్యాస వ్యక్తీకరణలూ, మార్పులూ అంధప్రాయంగా జరగనక్కరలేదు. బుద్ధిపూర్వకంగా వానిని ప్రవేశపెట్టేందుకు అవసరమైన శాస్త్రీయ సమాచారం నేడు మన వద్ద వుంది. సాహిత్య ప్రక్రియల్లో వచ్చిన ప్రతిష్టంభన దశను గుర్తించడమే ఆ సమాచారం మన వద్ద వుందనడానికి సాక్ష్యం. మార్పు తేవడానికి పథమ దశ దాని అవసరాన్ని గుర్తించడంకదా?

స్వాతంత్ర్యానంతరం దేశం ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక జీవితరంగా లన్నింటా పురోగతీ (దేశం మొత్తంగా), తిరోగతి (ప్రజల దృష్టిలోంచి) జమిలిగా సాగుతున్నా, 1960 నుంచి తిరోగమనం ప్రధానం కాజొచ్చింది. 1950 నుంచీ మన సాహిత్యం దీనిని గుర్తుచేస్తూ వచ్చింది. 1960 తర్వాత దేశ ప్రజల దుస్థితిని గుర్తు చేయడమే మన సాహిత్యపు ప్రధాన లక్ష్యం అయింది. ప్రజల్నీ, పాలకుల్నీ పట్టుకొని తిట్టడమూ, 'లే. నడు. పొడు. కొట్టు' అని ఉత్తేజపరచడమూ, 'విప్లవం తుపాకీ గొట్టం, రక్తం, యుద్ధం' గురించి కైవారాలూ అందులో అంతర్దశలూ, అవాంతర దశలూ అయాయి.

1970 నాటికి ఒక నూతన పరిస్థితి ఏర్పడింది. ముందు తెలంగాణా (విభజన) వుద్యమమూ, తర్వాత (జై) ఆంధ్ర వుద్యమమూ దేశంలోని దుస్థితిని నివారించే మార్గంగానే ప్రజల ముందుకు వచ్చేయి. వానికి వచ్చినంత విస్తృతి లేకపోయినా, ప్రాముఖ్యంలో దేశాన్నే ప్రభావితం చేయడంలో అంతకన్న విశేష శక్తివంతాలుగా భూమి ఆక్రమణ వుద్యమమూ, ఆహారధాన్యాల స్వాధీనోద్యమమూ ప్రజల దుస్థితిని నివారించే మార్గాలుగానే ప్రజల ముందుకు వచ్చేయి.

ఈ రెండు జట్ల వుద్యమాలూ ఆంధ్రలోని రెండు వర్గాల వుద్యమాలు. రెండు వర్గాల వుద్యమాలూ ప్రజల దుస్థితిని, దేశంలో వివిధ రంగాలలో వస్తున్న క్షీణ్యాన్నీ గుర్తుచేస్తూ వచ్చినవే. అంటే 1950 నాటికే, అంతకన్న ప్రధానంగా 1960 నాటికి పీడిత వర్గాన్ని హెచ్చరిస్తూ, బలపరుస్తూ వచ్చిన సాహిత్యరూపం 1970 నాటికి వాడీ, వేడీ పోగొట్టుకొని రంగూ, రుచీ, వాసనా లేకుండా తయారయింది.

కాని సమాజంలో స్థితి, వైరుధ్యాలు, సంఘర్షణలు నిశితం అవుతున్నాయి. అంటే సంఘ పరిస్థితులకూ, సాహిత్య రూపానికీ పొత్తు కుదరడం లేదన్న మాట.

ఈ వ్యాస కర్తలు ఇద్దరిలో—

విప్లవ రచనోత్సాహులయెడ ఆదరభావం, (జై) ఆంధ్ర విభజనోద్యమంయెడ సద్భావం కల వారొకరు. తెలంగాణా (విభజన) వుద్యమాన్ని వ్యతిరేకించినవారూ, అభ్యుదయ రచనోత్సాహీనులు రెండో వారు. ఈ రెండు దృక్పథాలవారూ సాహిత్య ప్రక్రియలలో స్తబ్దత ఏర్పడిందని గుర్తించడం వాస్తవ స్థితికి సూచనగా తీసుకోవాలి.

ఇటువంటి సమస్యల మీద సాహిత్య గోష్ఠులలో చర్చలు జరగడం చాల అవసరం. ఇందూరు భారతి ఈ విషయం ఎరిగి ఎరిగి లేవనెత్తినదిగా భావించను. ఏమంటే ఆయా వ్యాసాలలో విషయం లేదు. వ్యాసకర్త లిద్దరూ కూడ ఈ ముగింపు ప్రాసంగికంగానే తెచ్చేరు. ఏలా తెస్తేనేం ఒక ముఖ్యమైన విషయం లేవనెత్తేరు. అందుకు వ్యాసకర్తలనూ, ఇందూరు భారతి వార్షిక సంచిక ప్రచురణ కర్తలనూ అభినందిస్తున్నాను.

## మనసుగీసిన బొమ్మలు

(రచన: శ్రీ ఎం. ఉమాకాంత్. వెల 1–50 రు. చైతన్య ఆర్గనైజర్స్, 10—2—317/50 విజయ నగరకాలనీ, హైదరాబాద్—28.)

రచయిత విజ్ఞానశాస్త్ర పట్టభద్రుడు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ఆర్థికసహాయంతో ముద్రణ పొందిన కవితాసంపుటి. ఎంతో మెలకువగానే అయినా డా. సి. నారాయణరెడ్డిగారివంటి ప్రముఖకవులు ఇచ్చిన అభినందనవుంది. కనక శ్రీ ఉమాకాంత్‌గారి ఈ 'మనసు గీసిన బొమ్మలు' కనీసం సంసారపక్షంగానైనా వుండక పోతాయా అని చదవబోతే ప్రగాఢమైన నిరాశకు లోను గాక తప్పదు.

ఏవేవో మాటలు పేర్చుకుపోవడం భావుకతకు లక్షణంకాదు. గణబద్ధంగానో. మాత్రాబద్ధంగానో, పంక్తిబద్ధంగానో మాటలను పేర్చడం కవిత్వానికి లక్షణంకాదు.

రచయిత చూపిన 'మూకీచిత్రం' (పీఠిక)లోని మొట్టమొదటి వాక్యం— 'మనసులోని నిశ్శబ్దం లోంచి భావనపుడుతుంది' నంటివి తాత్వికజ్ఞానం వెలారుస్తున్నట్లు భ్రమ కలిగిస్తాయి కాని నిజానికి అర్థశూన్యాలు.

కాలచక్రంలో కలిసిపోయి బుసలుకొడుతూ
కాలసర్పాలన్నీ కాటుకోసం
మాటువేసుక్కూర్చున్నాయ్'

('నేస్తం! జాగ్రత్త'లో)

దీని అర్థం, లేకుంటే భావం, కనీసం సూచన ఏమిటో వూహకి అందదు. ఈ సంపుటి ఆద్యంతం మొత్తంమీద—ఇలాగే వుంది.

శ్రీ 'ఉమాకాంత్ మనసుగీసేబొమ్మలు ముందు ముందు మనోజ్ఞకవితాశిల్పాలుగా రూపుదిద్దుకోవాల' న్న డా. నారాయణరెడ్డిగారి ఆకాంక్షనే నేనూ పునశ్చరణచెయ్యాలి. చేస్తున్నాను.

—'అవంతి'

## ఈశ్వరార్చన కళాశీలుడు

(డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి; డెమ్మీ 152 పుటలు; వెల: రు. 6—00; పుస్తకాలకు గ్రంథకర్త; రీడర్—తెనుగుశాఖ; పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్, గుంటూరు, లేక— కె. వి. రమణ; 7/4 అరండేలుపేట; గుంటూరు–2.)

ఆంధ్రకవులలో, తిక్కనమనీషి తర్వాత సర్వశాస్త్రములు తెలిసిన పండితకవి — శ్రీనాథు డొక్కడే అన్న సత్యాన్నిచాటుచు కీర్తి ధ్వజమెత్తిన విమర్శక గ్రంథమిది. శ్రీనాథకవి సార్వభౌముడు తన కృతు లన్నిటిలో పరచిపెట్టిన ఈశ్వరార్చన తత్పరతను ఒక కళగా ఉపాసించి, శైవమత భిన్న సంప్రదాయమును తెలిసికొని అనుభూతినిపొంది, విస్పష్టఫణితిలో వ్రాసిన అపూర్వగ్రంథము. తెనుగువారికి అరిది గుణమైన కారణ విమర్శకశక్తిని చదువుల గద్దెపై కూర్చుండబెట్టినాడు— యీ గ్రంథకర్త! ఈశ్వరార్చన ఒక కళ అనిన శ్రీనాథుని మతమును స్థిర పరుస్తున్నాడు—గ్రంథకర్త.

ఈ గ్రంథకర్తకు పాండిత్యపు నిగ్గు ఎంతో, సరిచూచిపోల్చి వెలమదింపు చేయగలిగినగుణ వివేచనపు నేర్పుగూడ అంతటిది. పాఠకునికి— ముఖ్యంగా విద్యార్థికి ఇంకొకమేలును కూరుస్తున్నది— యీ పుస్తకం. శ్రీనాథుడు తన గ్రంథాలలో ఏయే పట్టులలో సంస్కృతమూలమును అతిక్రమించి, శివుని నిజపూజావిశర్దియందు నెలకొల్పి, ప్రాణప్రతిష్ఠచేసి తెనుగుకవితకు మెరుగులు వెలయించినాడో, విపులంగా తులనాత్మకంగా విమర్శించి చెప్పినాడు. ఇంకా, శ్రీనాథుడు తన విద్యుత్ప్రభాభాసితమైన రచనా శక్తితో అల్లిన కొత్త సంగతులను యీ విమర్శకుడు ఏరిచూపినాడు. శ్రీనాథుడు అప్పటమైన తెనుగుబిడ్డ! తెనుగుదనాన్ని తన వ్రాతలలో ఎట్లు రూపొందించినాడో, ముఖ్యంగా భీమఖండంలో— యీ గ్రంథకర్త

ప్రత్యేక శ్రద్ధతో నేర్పుతో చెప్పుచున్నాడు. అంటే—యీ గ్రంథం, శ్రీనాథుని పాండిత్యానికి రచనా పాటవానికి కవితాశిల్పానికి జీవంపోసి, చదువరికనుల ఎదుట నిలుపుచున్నది— అనాలి.

శ్రీ రామమూర్తిగారి రచన సందర్భానుసారంగా ప్రౌఢిమ సారళ్యముల గలగలుపు పాకంగా ఆనందమును గొలుపుచున్నది. 'అంతే గాదు' అనే ఒక ఊతపదం పలుమారు, హల్వాలో పలుగురాయి పంటిక్రింద పడినటు న్నది. దీనిని పరిహరించడం యీ వ్రాతగాని కొలదికి మించిన పనిగాదు.

—శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి.

## కాదంబిని

(సాహితీ పరిశోధన వ్యాస సంపుటి)

(సంపాదకుడు : శ్రీ ఎస్. బి. రఘునాథాచార్య ప్రచురణ : వసంతసాహితి, 6—2—155 టి.నగర్, తిరుపతి వెల : రు. 6.)

సాహితీ సమాలోచనము విషయమునను, శాస్త్రీయ విషయపరిశోధనమునను ప్రత్యయబుద్ధిగలిగిన ప్రాచ్యవిద్యాకళాశాలాధ్యాపకులు తొమ్మిదిమంది రచించిన సంస్కృతాంధ్ర సాహిత్యములకును భాషా వ్యాకరణశాస్త్రములకును సంబంధించిన తొమ్మిది వ్యాసములున్న గ్రంథమిది. వ్యాసకర్తల వృత్తులను బట్టి వారి యోగ్యతలు సుస్పష్టమగుచున్నవి.

మొదటి వ్యాసము 'మహాకవి ధూర్జటి మాధురీమహిమ' రచించినది శ్రీ కె. జె. కృష్ణమూర్తిగారు. 'చిత్తద్రుతి పూర్వకహ్లాదము ద్వారా ఉత్కృష్ట రసపరిపుష్టికి ఉత్తమహేతువగుచుండు గుణవిశేషమే' అయిన మాధుర్యమును (1) సంవిధాన (2) రచనా (3) భాషా (4) శైలీ (5) ప్రభావ (6) స్వభావ (7) అర్చనా (8) సందేశమాధుర్యము లని విభజించి ఉదాహరణ పూర్వకముగా వ్యాసమును సమగ్రముచేసి వ్రాసినారు శ్రీ కృష్ణమూర్తిగారు. ధూర్జటిని ఒకపాటి పరిధిలో ఈ వ్యాసము సలక్షణముగా ప్రదర్శించుచున్నది. రెండవ వ్యాసము 'భారత పాత్రములు భాసుని చిత్రణము' రచించినది శ్రీ డి. నాగసిద్ధారెడ్డిగారు. భాసుడు రచించిన భారత నాటకములు ఆరింటియందు పాత్ర చిత్రణ మెట్లు జరిగినదియు విచారించుచు మహాభారతమునందలి యా పాత్రల స్థితిగతులను తులనాత్మకముగా పరిశీలించు ఉద్దేశ్యముతో వ్రాయబడిన ఈ వ్యాసము విషయగౌరవమును బట్టి మరికొంత విస్తరించియుండదగియున్నది. శ్రీ సిద్ధారెడ్డిగారు భాసుడు చిత్రించిన దుర్యోధనుని లెస్సగా వ్యాఖ్యానించినారు.

శ్రీ కె. సర్వోత్తమరావుగారు రచించిన 'తమిళ సాహిత్యము—కొన్నిమాధురములగు పద్యములు' మూడవ వ్యాసము. శిలప్పదికారం, నీలకేశి, కంబరామాయణము మొదలయిన ప్రసిద్ధములయిన తమిళ కావ్యములనుండి మాధురములయిన కొన్ని పద్యముల నుదాహరించి శ్రీ సర్వోత్తమరావుగారు చక్కగా వివరించినారు. తమిళ కవితా మాధుర్యము నాస్వాదించుటకు సహృదయులనీ వ్యాసము ప్రేరేపించునదిగా నున్నది. శ్రీ ఎస్. బి. రఘునాథాచార్యులుగారు రచించిన 'బాణభట్టు భావనా మాధుర్యము' నాల్గవది. బాణుని దేశ కాలములను ఆతని కృతులను పరిచయము చేసినమీదట ప్రధాన కృతియైన కాదంబరిని గ్రహించి, అందలి కథావస్తు నిర్వహణమును, పాత్ర చిత్రణ విధానమును, వర్ణనా విశేషములను, రచనా విశేషములను నిశిత దృష్టితో విచారణచేసి వ్రాసిరి. ఇది సమగ్రముగాను సలక్షణముగాను బాణుని రచనా వైచిత్రిని ప్రదర్శించుచున్నది. ఈ వ్యాసము చదివినమీదట బాణుని గూర్చి అనేక విషయములు తెలిసికొనవచ్చును. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య వ్రాసిన 'కావ్యగుణ సమీక్ష' సర్వభారతీయాలంకారికులును కావ్యగుణములను పరిగణించిన తీరుతెన్నులను సమీక్షించుచున్నది. ఇది ఆయిదవ వ్యాసము. శ్రీ ఆచార్య జి. యన్. రెడ్డిగారు చెప్పి

---

## సవరణ

జులై సంచికలో వెలువడిన శ్రీ తుమ్మల సీతారామమూర్తి 'గృహస్థ ధర్మము' అను పద్య రచన లోని 'రాజును మంత్రియు' అను పద్యమునందలి 3 వ, 4 వ పాదము లిట్లు చదువుకొనవలెను.

'శ్రీ జాటి గొడగరి
యెదో తాఁజెప్పఁ దలంచి వెఱపు దండడిసేయన్—'

—సంపాదకుడు.]

నట్లు ఇది ప్రాచీన నవీనాలంకారికుల అభిప్రాయాలకు మత భేదాలకు దర్పణము వంటిది. శ్రీ లక్ష్మణయ్య గారి బహుగ్రంథ పరిశీలనమునకు పాండిత్యము నకు ఈ వ్యాసము నిదర్శనము. ఆరవ వ్యాసము శ్రీ సి. వి. శేషాచార్యులు రచించిన 'కాళిదాసుని కమనీయ వర్ణనలు.' ప్రకృతి, స్వరూప స్వభావ, అవస్థా, సంవాద, సందేశ, సంక్షేప వర్ణనములని మొత్తము ఏడు విధములుగా కాళిదాసు కృతుల నుండి ఉదాహరణము లెత్తి వ్రాసి శ్రీ శేషాచార్యులు గారు ఆయా సమయసందర్భములను వివరించుచు అర్థ విశేషములను వివరించారు. కాళిదాసు కవితావైశిష్ట్య మును ఉపన్యసించుచున్న ఈ వ్యాసము జాగ్రత్తగా వ్రాయబడినది. ఏడవవ్యాసము 'ఆచార్యపాణిని —అష్టా ధ్యాయి' శ్రీ ఉ. వెంకటరామయ్యగారు పాణిని మహర్షి జీవితమును పరిచయముచేయుచు అష్టాధ్యాయి తత్వ మును సూక్ష్మముగానే అయినను సుస్పష్టముగా తెలియజెప్పినారు. వ్యాకరణరచన అదొక ప్రత్యేక ప్రక్రియ. దాని రచనాపద్ధతిని, సూత్రవిభాగము, అధ్యాయవిభాగము అను శీర్షికలక్రింద విశదము చేయుచు వ్రాయబడిన ఈ వ్యాసము చక్కగా నున్నది. సూక్ష్మములో మోక్షమన్నట్లు అష్టాధ్యాయిలో ఎక్కడ ఏమున్నదో ఈ వ్యాసమును చదివి కొంత గ్రహింప వచ్చును. ఎనిమిదవ వ్యాసము శ్రీ ఐ. వేంకటేశ్వర రావుగారు రచించిన 'ఉదంకోపాఖ్యానము – ఒక పరి శీలన' మహాభారతమునందు రెండు పర్యాయములు ఈ ఉదంకుని కథ ఆదిపర్వమునందును అశ్వమేధ పర్వమునందును రచింపబడినది. నన్నయ తిక్కనల రచనా విశేషములను తులనాత్మకముగా పరిశీలించిన వ్యాసమిది. మరియు ఆధ్యాత్మిక వైజ్ఞానిక విషయము లతో ఈ ఉదంకుని కథకు సమన్వయమును కల్పించు టకు శ్రీ వేంకటేశ్వరరావుగారుచేసిన ప్రయత్నము గమ నింపతగియున్నది. ఆయా విషయములను వ్యాసకర్త మరికొంత విపులముగా వ్రాసియుండవలసినది. చిట్ట చివరకున్నది శ్రీ కె. భాస్కరరావుగారు వ్రాసిన వ్యాసము 'భాషాశాస్త్ర విషయ విభాగము' ఆధునిక భాషాశాస్త్రమునకు సలక్షణమైన శాస్త్రమర్యాద దానికింకను అబ్బలేదన్న తాత్పర్యముతో వ్రాయబడినది. భాషాశాస్త్రముయొక్క స్థూలస్వరూపమును నిరూ పించుచు, అది వ్యాకరణమును విభజించిన ఆయిదు విధములను పరిచయముచేయుచు శ్రీ భాస్కరరావు గారి వ్యాసము జిజ్ఞాసాత్మకముగా నున్నది.

వ్యాసములన్నియును జాగ్రత్తగా ఆ యా విషయములయందు నిష్ణాతులయిన వారిచేత చక్కగా కృషిచేసి వ్రాయబడినవి. ఉన్నతపరీక్షలకు పోవుచున్న విద్యార్థులకు ఇందలి వ్యాసములెన్నో మిక్కిలి ఉప యోగకరులుగా నున్నవి. తిరుపతి వసంతసాహితి నిర్వాహకు లింకను ఇట్టి వ్యాస సంపుటలను ప్రచు రించి విమర్శన వాఙ్మయమును మరియు నభివృద్ధి చేయుదురని ఆశింపవచ్చును. సంపాదకుల శ్రద్ధా సక్తులను పుస్తకము ప్రత్యక్షముగా ప్రదర్శించు చున్నది.

– క్షేమేంద్ర.

## శ్రీకృష్ణదేవరాయలు

Archaeological Series no 33

## విజయనగరచరిత్ర

రెండవ భాగము

Ar Series no 35

(రెండును డా. నేలటూరు వెంకటరమ ణయ్యగారి రచనలు. మొదటిది రు. 15—00, రెండ వది రు. 12–50 రెంటికిని ప్రకాశకులు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము, జనరల్ ఎడిటర్, డైరెక్టరు, పురావస్తుశాఖ, హైదరాబాదు)

ఇందు కాలము ననుసరించి రెండవది ముందును మొదటిది తర్వాతను ప్రకాశనలో రావలసినవి. అట్లే ప్రకటించియుండదగును; కాని ఏవో సందర్భములు, ఎట్లెట్లుండినవో తెలియదు. పోనిందు పరవాలేదు. మొదటిది పది ప్రకరణములు, 138 పుటలు, శ్రీకృష్ణదేవరాయల నిర్యాణవిషయ చర్చతో సమ గ్రము. ప్రకాశక వక్తవ్యమును (Preface) సంపాద కులు శ్రీ మహమ్మద్ అబ్దుల్‌వహీద్‌ఖానుగారు వ్రాసి నారు. అవతారిక శ్రీ డా. ఆర్. సుబ్రహ్మణ్యము (సూపరింటెండింగ్ ఆర్కియాలజిస్టు, ఆర్కియ లాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, న్యూఢిల్లీ)గారి రచన. రెండవది 105 పుటలు, ప్రకరణములు కాదుగాని రాజవంశములుగా విభక్తము. ఇందులో 'నాందీ ప్రస్తావనలు'గాని 'భరతవాక్యము'గాని— అనగా సంపాద

కీయ వక్తృవ్యముగాని, అవతారికగాని, గ్రంథాంత విరామవాక్యముగాని చిహ్నముగాని లేవు. మొదటిదాని నుండియే, ఒకపాటిమార్పుతో, గ్రహించియుండ దగును. ఆదిలో విషయసూచికగాని అంతమున అకారాది విషయసూచిక (Index) గాని లేవు. డబల్ కాలములో మాసపత్రికవలె వెడల్పు ఆకృతిలో, బోడిగా. చరిత్రనుమాత్రము ముద్రించినారు. ముద్రణ కళ, సంపాదకీయ నైపుణ్యముతో ఎంతో అభివృద్ధి యైయున్న యీ కాలములో చదువరులకు తటాలున శ్రమలేక చూచుకొను సహాయకరణములైన విషయసూచి కాదులు సంపాదకులు పొందింపలేకపోవుట విచారకరము. వీనిని ఏల వదలినారో తెలియదు. కృష్ణదేవరాయలులో పుస్తకము పూర్తియైనదని, తర్వాత అచ్చులేనందున గ్రహింపవలసినదేగాని గ్రంథాంత విరామ చిహ్న మేదియులేదు.

విజయనగరచరిత్ర ఇదివరలో కీ. శే. శ్రీ ఖాసా సుబ్బరావుగారి స్వరాజ్యపత్రికలో ముద్రింపబడినదిగా తోచుచున్నది. వారికే అంకితముకూడ. ఇది దానికి పునర్ముద్రణమో, పునర్లిఖితమో సంపాదకులు తెలిపి యుండిన బాగుండెడిది.

బైండు చూచుటకు ఆకర్షకముగా గట్టి అట్టలో పూర్తి క్యాలికోగిలడిగానున్నను కుట్టుపని వట్టిమోసము. లావు కాలికో అట్టను మోయదగిన వీపు పని, తగిన వ్రజపు (సర్వీసు) పూత, దానిమీద గుడ్డలేనందువలన, గట్టి పట్టులేక, పుస్తకము తెఱవగనే రెండుగా విరుగుచున్నది. ఫారములు ఊడి వచ్చుచున్నవి. బైండింగు విషయమున తగు శ్రద్ధ వహించుట ఆవశ్యకము. ఈ డిపార్టుమెంటునారే లావు పుస్తకములనుకూడ పొడిచికుట్టి విపు వంచి బైండుచేయుచున్నారు. ఇందువలన పుస్తకమును పూర్తిగా తెఱచుటకు వీలగుటలేదు.

చక్కగా, డెమ్మీ ఆకృతిలో, మామూలు పుస్తకములవలె విషయసూచికాదులలో ముద్రించి యుండినయెడల ఎంతో రమ్యముగా నుండియుండును.

ఇక ప్రధాన విషయము రచనను గుఱించియు రచయితను గుఱించియు — సుప్రసిద్ధులు, సిద్ధహస్తులు, శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు విజయనగరచరిత్రలో ప్రమాణపదవి నధిష్ఠించి యున్నారు. అట్టివారిని గుఱించి చెప్పుట అనవసరము. ఎందులకనగా చెప్పుటకు ప్రారంభించినయెడల ఎంత చెప్పినను చాలదు. హిందూదేశచరిత్రను గుఱించియు అందులో దక్షిణదేశచరితను గుఱించి, ఇంకను సూక్ష్మముగా చూచిన విజయనగర సామ్రాజ్యమును గుఱించి ఇంతలోతుగా అక్షరమక్షరము పరిశోధించి ప్రామాణికమైన రచన గావించినవారు చాలకొద్ది మంది. కొద్దియేమి, మఱియొకరు, ఇంతటివారు, లేరనుట అతిశయోక్తి కాజాలదు. కొందఱు కొంత భాగము చేసినారు, కొందఱు ఒక్కొక్క రాజును గూర్చియో, రాజవంశమును గూర్చియో పరిశోధించి నారుగాని, సమగ్రముగా, ఆదినుండియు అంతము వఱకు, నలిపినలిపి, కూలంకషముగా వాఙ్మయ విషములతోచేర్చి పరిశోధించినవారు వీరొక్కరే కన బడుచున్నారు.

విజయనగరచరిత్ర రచనావిధానము, పునర్నిర్మాణ క్రమము, సాధనసామగ్ర్యన్వేషణ, చర్చలు, వీనియొక్క చరిత్రయే ఎంతో కలదు. ఎందులకంత యేర్పడిన దనగా దాదాపు ఒక శతాబ్దమునకుముందు మనకు విజయనగరమును గుఱించిన జ్ఞానమత్యల్పము. ఆంధ్ర వాఙ్మయరంగమున శ్రీకృష్ణదేవరాయలను గుఱించియు, వారి అష్టదిగ్గజములను గుఱించియు వారి గ్రంథములవలనను, కవుల పారంపరివలనను, కొంత తెలిసియుండినది. మాధవవిద్యారణ్యులను గుఱించియు సాయనాచార్యులనుగుఱించియు వారి గ్రంథములవలన కొంతకు కొంతకు తెలిసియు తెలియని స్థితియం దుండినది. ఇవిగాక అక్కడక్కడ కవులు, కావ్యములు, చాటువులు. శ్రీనాథాదుల చరిత్రలు — ఇట్లు మబ్బు చాటు చంద్రునివలె కనబడియు కనబడని విధముగా నుండినచోట, వీనినన్నిటిని సమన్వయపరచి, విశద ముగా, ఆనుపూర్విగా వ్రాయబడిన చారిత్రకగ్రంథము పెద్దలనాటిది లేదు. ఇటీవలిది అంతకన్నలేదు. చారిత్రకపురుషులను గుఱించి సమకాలికపండితుల రచనలు కొంత చరిత్రను చెప్పినను ఎక్కువభాగము కవిత్వమునకు వదలి నమ్మరాని ఆశ్చర్యకర విషయ ములతో నింపుచుండిరి. అప్పటమైన డైరీ వంటి చారిత్రక రచన మనపెద్ద లెఱుగరు. ఈ దుర్గతి మనదేశమునకు వాఙ్మయమునకును పట్టి యుండి పాశ్చాత్త్యులవలన క్రమముగా తొలగిపోయి ఎంతో చారిత్రక జ్ఞానము కలిగినది. మహానుభావుడు పోతన వ్రాసినట్లు 'కారేరాజులు, రాజ్యముల్గలుగవే,

గర్వోన్నతిం జెందరే, వారేరీ...భూమిపై పేరైనం గలదే' అన్నట్లు, పేరుకూడ మాసిపోగా, దానికి తగినట్టు సూయలు పండితుడు 1900 సం॥ లండనులో ముద్రించిన విజయనగరచరిత్రను 'విస్మృత సామ్రాజ్యము' (A Forgotten Empire) అన్నాడు. 1910–11 ప్రాంతములో కాబోలు వ్రాయుచు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు 'విస్మృతాంధ రాజకవి' (A Forgotten Emperor Poet) అని శ్రీ కృష్ణదేవరాయలను గురించి వ్రాసినారు. పురావస్తుశాఖవారును, చరిత్రకారులును, ఎందరోచేరి శాసనాది నానావిధసాధన సామగ్రిని సంపాదించి కొన్ని సంవత్సరాలుగా తమ సాంవత్సరిక నివేదికలలో ప్రకటించుచువచ్చినందునను, OMఓ లైబ్రరీవారి తాళపత్ర సంచయమువలనను, క్రమముగా చీకటి తొలగి ఎంతో ప్రకాశము కలిగినది.

ఈ సాధనసామగ్రి ఆంధ్ర వాఙ్మయమందును, శాసనాదికములందును మాత్రమేగాక మహమ్మదీయ చరిత్రకారుల రచనలలోను విదేశయాత్రికులైన పోర్చిగీసువారు వ్రాసికొన్న జాబులలోను అపారముగా దొరకినది మన అదృష్టము. విన్సెంట్‌స్మిత్తుగారు హిందూదేశచరిత్రము వ్రాయుచు 1920 లో పరిశోధనావకాశములను గురించి ఇట్లు వ్రాసినారు. '... The story of the Hindu monarchy which set itself up as a barrier to check the onrush of the armies of Islam is one of singular interest, and might be narrated with a fullness of detail rarely possible in Indian History. The multitude of relevant inscriptions, numbering many hundreds, is extraordinary. Several European and Muslim travellers from the fourteenth to the sixteenth century have recorded the historical traditions of the empire with vivid descriptions of the system of government and the glories of the magnificent capital. The study of the polity, manners, customs and religion of the Vijayanagara empire merits particular attention, because the State was the embodiment of the Telinga or Telugu and Kanarese forms of Hinduism which differed widely from the more familiar forms of the north. The sources of our knowledge are not confined to inscriptions and the notes of foreign observers The Muhammadan historians who lived in the Deccan, headed by Firishta, give valuable information; and much may be learned from critical examination of the monuments and coins. A remarkable school of art was developed at Vijayanagara, and literature both Sanskrit and Telugu was cultivated with eminent success.' (p. 300.)

తర్వాత వ్రాయుచు, తమ కాలమునకే (1920), సూయెలుగారి రచనకు వెనుక, మంచి గ్రంథము వెలువడ లేదన్నారు. 'It is a matter for regret that no history of the Vijayanagara empire in the form of a readable, continuous narrative, embodying the results of specialist studies after critical sifting, has yet been written. Mr Robert Sewell's excellent book......which recalled the attention to the long neglected subject, and largely increased the store of historical material by making the Portuguese accounts accessible is avowedly a pioneer work desegned as 'a foundation upon which may hereafter be constructed a regular history of Vijayanagar empire?...... The desired narrative in literary shape still is wanting and much additional matter collected in the publications of other writers remains to be worked up (p. 300) చివర ఆధారములను గురించి చెప్పిన తర్వాత ఇట్లు వ్రాసినారు—'New inciptions are published continually. Many dates and other matters of detail remain unsettled and cannot be disposed of until somebody takes the trouble to write a bulky monograph.' (p 320.)

ఇట్టి 'బల్కీ మోనోగ్రాఫ్' రచనకు కావలసిన వస్తుసామగ్రి సంపాదించిన చరిత్రకారులలో డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు అగ్రగణ్యులు. ఆంధ్రకర్ణాటకులేగాక ఇతర చరిత్రకారులును ప్రారంభించి 1925 ప్రాంతమునుండియు వ్రాయసాగిరి. మదరాసు విశ్వవిద్యాలయమునకు చెందిన శ్రీ ఎస్. కృష్ణస్వామి అయ్యంగారు Sources of Vijayanagara History అని యొక ఉద్గ్రంథ

మును తయారుచేసి ప్రకటించిరి. దీనిలో చారిత్రక వివరణ మత్యల్పము. విజయనగర చరిత్రలో సంశయ గ్రస్తములును వివాదగ్రస్తములునైన యంశములు లెక్కలేనివి కలవు. అసలు ప్రారంభకు లెవరు, ఆంధ్రులా కర్ణాటకులా యని యొక నిరర్థక ప్రశ్న ఆదిమండియు బాధించుచున్నది. భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంత విషబీజములు ఏనాడు మన దేశీయుల హృదయసీమలలోపడినవో నాటినుండియు, చారిత్రకజ్ఞానము మన యజ్ఞానమును పోగొట్టి పై విషయమును ఖండించుటకు బదులు దానికి దోహద మిచ్చి, విద్వేషాంకురముల మొలచి, పెరిగి, మహా వృక్షములై విషఫలములు ఫలించి, అసలు జనజీవన చరిత్రాన్వేషణకన్న ఈ యాంధ్రకర్ణాటక సమస్య పెద్దదైపోయినది. హరిహరబుక్కరాయ సోదరులు ఆంధ్రులా కర్ణాటకులా, మాధవాచార్యులు ఆంధ్రుడా కర్ణాటకులా, వారే విద్యారణ్యులుకారా, శ్రీ కృష్ణ దేవరాయలు ఆంధ్రుడా కర్ణాటకుడా, రెండు నుకాడా, లతని మాతృభాషయేది, తులువవంశమనగా నేమర్థము—ఇట్లు ఒకదానివెనుక నొకటిగా. సమస్యలుగా, పండిత పరస్పరవైషమ్యకరముగా పరిణమించినవి. వీనినెల్ల వివరించి విజయనగరచరిత్ర పునర్నిర్మాణ రచన ఎట్లు సాగినదో వ్రాయుటకు ప్రారంభించిన కొన్ని సంపుటములు వ్రాయవచ్చును. ప్రస్తుతము అవకాశము చాలదు. కాని శ్రీ వెంకటరమణయ్యగారి రచన నిష్పాక్షికముగా సాగినది. వారి కృషిని గురించి ఒక మాట చెప్పదగును.

వెంకటరమణయ్యగారు సంస్కృతాంధ్రద్రవిడ కర్ణాటక భాషలనేకాక మహమ్మదీయ చరిత్రకారుల రచనలను మూలగ్రంథములందే, అనువాదములపై ఆధారపడక, చారిత్రక ప్రామాణికతకొఱకు, మున్షీల సాయముతో ఆ యా భాషలలో పాండిత్యము సంపాదించుకొని, చదివి, మన ఆధారములతో పోల్చి చర్చించి, సత్యాసత్యములను తేల్చుకొని ఆ తర్వాతనే రచనకు పూనుకొన్నారు. మదరాసు క్రైస్తవ కళాశాలలో ఉపాధ్యాయులుగాచేరిన త్వరలోనే, విజయనగర చరిత్రను, బి. ఏ; ఆనర్స్, ఎమ్.ఏ.ల వారికి అభిమాన విషయముగా బోధింపవలసి వచ్చినప్పుడు (1927—28—29—30 ప్రాంతము) తమ కృషిని ప్రారంభించి పరిశోధనయొక్క లోటుపాతులను గుర్తించిరి. ఎక్కడనుండి ప్రారంభింపవలెనో అనునదియే పెద్ద సమస్యగా యేర్పడినది. అసలు విజయనగరమునకు ప్రారంభకులు-పట్టణమునకును సామ్రాజ్యమునకును—ఎవరు, ప్రోత్సాహకులెవరు, హిందూధర్మ పునరుద్ధరణ మెట్లు జరిగినది, వీని కాలమేది. నాటి రాజకీయ సాంఘిక నైతికాది వాతావరణ మెట్లుండినది—వీని నెల్ల నిర్ణయించుటకు తగిన యాకరములు మహమ్మదీయులు రచనలేయని తేల్చుకొనిరి. మహమ్మదీయులు ఎత్తివచ్చినప్పుడు మన హిందూరాజ్యముల విచ్ఛిత్తికి ప్రబలకారణమైన మన యైకమత్యరాహిత్యమును అటుంచి, దైవికముగా వచ్చిపడిన వైదేశిక దండయాత్రల—చరిత్రను, వానివలన మనకు కలిగిన అనిష్టములను తెలిసికొనవలసివచ్చినది. ఢిల్లీలో సుల్తానులు వెలసినది మొదలు వారు దక్కనుపై ఎత్తి వచ్చినన్నటినుండి ప్రారంభించి పరిశోధించినగాని అంతు దొరకునట్లులేదని గ్రహించిరి. కల్యాణీచాళుక్యుల పతనానంతరము యాదవులును. కాకతీయులును హొయసలులును కొంతకాలము వెలిగినను తమలో భేదబుద్ధిగలవారగుటచే అల్లాఉద్దీనుకాలమునుండియు వచ్చిన దండయాత్రలకు తాళలేక ఒకరొకరుగా పడిపోయి. మహమ్మదీయులకు పాదాక్రాంతులగుటయేగాక, మారన మార్కండేయ పురాణమును అంకితముపొందిన నాగయగన్నసేనానివంటి మహాయోధులుకూడ ఇస్లాము మతమును స్వీకరించి, మాలిక్ మక్బూల్ అన్న పేరు వహించినవాడీతడు హిందూధర్మమునే త్యజించెను. ఎందరో హిందూరాజన్యులేగాక పండితులు పామరులు, స్త్రీలు ఢిల్లీకి చెరగొంపోబడి మన మతములు, మందిరములు, దేవాలయములు విద్యాస్థానములు రాజసౌధములు అగ్రహారములు, ఊళ్లు పాడుపడిపోయినవి. మతాంతర ప్రవిష్టులు కానివారనేకులు చంపబడిరి, పలువురు ప్రతాపరుద్ర చక్రవర్తివంటివారు ఆత్మహత్య గావించుకొనిరి. కొందఱు బుద్ధిమంతులు మాత్రము కాలము ననుసరించి మహమ్మదీయులకు లొంగి తమ భాగధేయములను చక్కజేసికొనిరి. ఇట్లు కాలానుగుణ్యముగా ప్రవర్తించి హిందూమతమును ధర్మమును పునరుద్ధరించినవారు విజయనగర సామ్రాజ్యస్థాపకులు, హరిహర బుక్కరాయ సోదరులు.

ఈ చరిత్రనంతయు పరిశోధించి శ్రీ వెంకటరమణయ్యగారు 'కంపిలి అండ్ విజయనగర్' అని ఓరుగల్లు పడిపోయినది మొదలు కంపిలిరాజ్యము పడిపోయి విజయనగరము స్థాపింపబడువఱకును,

'ఫౌండర్స్ ఆఫ్ ది సిటీ అండ్ ది ఎంపైర్ ఆఫ్ విజయనగర' అని పట్టణమును రాజ్యమును స్థాపించిన చరిత్రను, 'అర్లీ ముస్లిం ఎక్స్‌పాన్షన్ ఇన్ సౌత్ ఇండియా' అని మహమ్మదీయుల దక్షిణాపథ దండయాత్రలను గురించియు, 'ఫర్‌దర్ సోర్సెస్ ఆఫ్ విజయనగర' అని ప్రామాణికాధారములలో కొద్దిగా ఎస్. కృష్ణస్వామయ్యంగారు ప్రకటించినవిపోను మిగిలిన యెన్నోవిషయములను సమకూర్చి మూడుసంపుటము గాను, 'స్టడీస్ ఇన్ ది థర్డ్ డైనాస్టీ' అని సంగమ సాళువవంశముల తర్వాతవచ్చిన తుళువరాజవంశమును అందును అచ్యుతరాయలనుగూర్చి విశేషముగాను గ్రంథములుగా ప్రకటించి, పండితాభిప్రాయ తర్జన భర్జనాది తతంగమును ఎంతోచూచి, తమ సిద్ధాంతములయొక్క సత్యాసత్యములను తేల్చుకొని గట్టిచేసికొని నికరమైన యీ రెండు చరిత్ర గ్రంథములను ప్రకటించినారు.

విజయనగరమును స్థాపించినవారు హరిహర బుక్కరాయలు. వీరి పెద్దలది మొదట గుంటూరు దగ్గరి మంగళగిరి. (కాదు మంగుళూరో మఱియొకటియో అని కర్ణాటకులు వాదించినను కుదురునట్లు లేదు) మాధవాచార్యులు వీరికి కులక్రమాగతమైన మంత్రి. మాధవ సాయన భోగనాథాచార్యులది ఆది నుండియు నెల్లూరు గుంటూరు ప్రాంతమే. సంగమ రాజపుత్రులు హరిహర బుక్కయ్యలు మొదట కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తియొక్క భాండాగారాధికారులుగా నుండి, 1323 లో ఓరుగంటి పతనానంతరము తుంగభద్రా తీరమందలి కంపిలి రాయల నాశ్రయించి ఉద్యోగములు సంపాదించుకొని, రాజ కుటుంబముతో సంబంధ బాంధవ్యములు పొంది, కంపిలి పతన సందర్భమున, పిచ్చితుఘ్లక్ అని ప్రసిద్ధుడైన మహమ్మద్ బిన్‌తుఘ్లకుచేత ఖైదీలుగా ఢిల్లీకి కొనిపోబడి, ఇస్లాము మతమును స్వీకరించి, సుల్తాను దయ సంపాదించుకొని, తర్వాత అతని చేతనే ఆ కంపిలి రాజ్యమునే పరిపాలించుటకు పంపబడి, ఇక్కడ యుద్ధములలో మొదట నెగ్గలేక, మాధవ విద్యారణ్యుల నాశ్రయించి, ప్రాయశ్చిత్తము చేసికొని, మరల హిందువులై, ఆనెగొందిలో కొంతకాలము పాలించి, ఆచార్యుల యనుగ్రహమున, తుంగభద్రకు దక్షిణ తీరమున విజయనగరమును స్థాపించి (1338) రామేశ్వరము వఱకును జయించి, మధుర సుల్తానును ఉన్మూలించి, కృష్ణా తుంగభద్రలకు దక్షిణమున మహమ్మదీయుల ప్రాభవమును పూర్తిగా తొలగించి, హిందూధర్మమును ఉద్ధరించినట్టివారు. ఇంత చరిత్ర ఎంతో ఆశ్చర్యకరముగా కుదిరినది. వెంకటరమణయ్యగారు రాత్రింబగళ్లు చేసిన పరిశ్రమకు ఫలితము. ఈ రాజవంశము హొయసల వీరబల్లాలుని బంధువులనియు కర్ణాటకులనియు నొక సిద్ధాంతమును కొందఱు ప్రతిపాదించినారుగాని ఈ కన్నడ సిద్ధాంతము ఆధార రహితమని వెంకటరమణయ్యగారు విశదీకరించినారు. ఇటీవల దొరకిన శాసనములు కూడ ఓరుగంటి సంబంధమునే గట్టిపరచుచున్నవి. కాని 'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్' అన్నట్లు ఆంధ్రులును కర్ణాటకులును ఒక్క తల్లిబిడ్డలే, అన్నదమ్ములే, అసలు కర్ణాటక శబ్దమే ఆంధ్ర శాతవాహనుల 'కర్ణి' శబ్దమనియు శాతకర్ణినాడే, కర్ణినాడై, కర్ణాడై కన్నడ కర్ణాటకములైనవనియు వెంకటరమణయ్యగారు 1935 ప్రాంతమున కాబోలు వ్రాసియున్నారు. దక్షిణాపథములో జనులలో జాతులు కులములు, మతములు మనసులు కలసిపోయి, ఎక్కడెక్కడివారును స్థలములు మారి, మరల మరల మారుచుండగా, ఈ యభిమానములకు అర్థము లేదు.

ఇట్లే ప్రామాణికాంశములతో నిండిన శ్రీ రమణయ్యగారి రచనలలో మరల నూతనాంశము — శ్రీ కృష్ణదేవరాయలు మరణకాలమున చాల వృద్ధుడే గాని ఇదివరలో చరిత్రకారులు భావించినట్లు నలువది నాలుగు నలువదియైదేండ్లవాడు కాడనియు, పోర్చుగీసు రచయితలో ఒకచోట ఇరువదియేండ్లకు పైబడిన వాడనియు, ఒకచోట వృద్ధుడనియు వ్రాయుటలో స్వవచోవ్యాఘాతము లేదనియు, వారిభావము—మరణకాలమునకు వృద్ధుడే, షష్టిపూర్తియైనవాడే, రాజ్యమునకు వచ్చినప్పుడు బాలుడో యువకుడోకాక యుక్తవయస్కుడనియు, ఇరువదికిమించి ఎంతయైన నుండవచ్చుననియు—ఇంకను ఎన్నో చక్కగా చర్చించియున్నారు. అళియరామరాయల జీవితచరిత్రము ఈ సందర్భమున వీరు చర్చించియుండిన ఇందుకు చాల బలము కలిగియుండును. రక్కడి తంగడి యుద్ధమున గతించునప్పుడు రామరాయలకు తొంబది యారేండ్ల వయస్సట. కొందఱు కొంత తగ్గించి చెప్పియున్నారు. ఎట్లైననేమి, చాల పెద్దవాడు, 1565 నాటికి

96 అయిన 1529 లో రాయల నిర్యాణకాలమునకు 60 యేండ్లవాడు గదా (1565—1529=36. 96—36=60), మఱి, అల్లునికి అరువదియేండ్లైనయెడల మామగారికి ఎంత వయసుండును? కుమార్తెకు పదునైదేండ్లకు పెండ్లి చేసియుండినను, రాయలకు డెబ్బదియైదైననుండవా, లేక డెబ్బది తప్పకుండనుండియుండవా? కాబట్టి నీరు వృద్ధుడన్నది సరిగానే యున్నది. ఇది చర్చించియుండిన బాగుండెడిది. ఇట్లే చూచిన పోర్జరీయైన మారీచీ పరిణయమందలి తారీఖుకూడ తప్పే. దానిని విస్మరించుటకుబదులు స్పష్టముగానే విసర్జించియుండినయెడల పరిశోధక యువకబృందమునకు మార్గదర్శకముగా నుండియుండును.

శ్రీ రమణయ్యగారిది అప్పటమైన చారిత్రక రచన. కావ్యముకాదు, కల్పనకాదు. ఒక్కయక్షరమైనను నిరాధారమైనది కానరాదు ఇంతటి మహోవైభవముతో వెలిగిన యీ సామ్రాజ్యముయొక్క చరిత్రను ఇంకను చాలసమగ్రముగా, సాంఘిక చారిత్రకాది సకలవిషయ సమాకలనపూర్వకముగా ఆంగ్లములోరచించు తలంపు వీరికి మిక్కుటము. అందులోను విద్యావంతులనెల్ల అభిమానపాత్రుడైన శ్రీ కృష్ణదేవరాయల చరిత్రను ఆంగ్లమున వ్రాయుటకు తమకు తగిన ఆరోగ్యము లేదే యని చింతించుచున్నారు. ఆపని వీరిచేత చేయించుట ఆంధ్రుల కర్తవ్యము.

పై రెండు పుస్తకములును చరిత్రకారులకే కాక, విద్యార్థులకును పండితులకును, సామాన్య పఠితలకునుకూడ అవశ్యపఠనీయములు.

— శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి.

## రివ్యూ ఆన్ హిస్టరీ ఆఫ్ ది ఈస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగీ

( 610 ఎండ్ 1210 ఏ. డి.)

(శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు: ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీ, కళాభవన్, సయిఫాబాదు, హైదరాబాదు; మొదటి ప్రతి (1973): 596 పుటలు, ఇండెక్స్ 1—18 : వెల రు. 20.)

కీ. శే. భావరాజు వెంకట కృష్ణారావుగారు సుప్రసిద్ధులయిన పండితులు. ఆయన మరణించిన తరువాత వెలువడిన పుస్తకమే ఇప్పుడు సమీక్ష చెయ్యబడుతోంది. దీనికిముందు ఆయన రాసిన పుస్తకం, 'ఏ హిస్టరీ ఆఫ్ ది ఎర్లీ డయినాస్టీస్ ఆఫ్ ఆంధ్ర దేశ 200–625 ఏ. డి.', నేటికీ మూలవస్తువుకి ప్రమాణమయిన గ్రంథం. ప్రస్తుతం సమీక్ష చెయ్యబడుతున్న పుస్తకం దీనిలోని విషయాన్ని కొనసాగిస్తోంది అనాలి.

దీనితో 'రివయిస్డ్ క్రోనాలజీ ఆఫ్ ది ఈస్టర్న్ చాళుక్యాస్ అన్న అధ్యాయం పీఠిక వంటిది. ఇదికాక పదిహేడు అధ్యాయాలు వేరే ఉన్నాయి. నాలుగవ అధ్యాయంలో ఉండవలసినది లభ్యం కాలేదు కనుక ప్రచురింపబడలేదు. కొన్ని అధ్యాయాలు అసంపూర్ణంగా ఉండిపోయాయి - ఉదాహరణకి 43 వ పేజీ చూడండి. ఈ గ్రంథం చాలాకాలం కింద రాసినదయి ఉండాలి, దానిని రచయితే సంస్కరించినట్లు కనిపించదు. ఇందులో వెంనాటి లేక వెలనాంటి దుర్జయుల పతనంవరకూ వేంగీ చాళుక్యుల రాజకీయ చరిత్రకి సంబంధించిన సమాచారం ఉంది; ఈ సమాచారం ఆసక్తి కలిగించేటటువంటిది, ప్రామాణికమయినది. అయితే, గ్రంథంలో అచ్చు తప్పులే కాక పాఠ్యదోషాలుకూడా కనిపిస్తాయి. ప్రచురణ ముందు మరికొంతశ్రద్ధతో పరిష్కరణ జరిగిఉంటే బాగా ఉండేది. ఈ లోపాలు ఉన్నప్పటికీ ఇది ఉత్కృష్టమయిన గ్రంథం. ఆంధ్రాపథం ప్రాంతీయ చరిత్రని అనుశీలించే పండితులూ, విద్యార్థులూ దీనిని చదివితే మంచిది. ఇక అధ్యాయాల సంగతి—మార్చబడిన కాల నిర్ణయం గురించి రాస్తున్నప్పుడు ఈ పండితుడు కుబ్జవిష్ణువర్ధనుడు వేంగీ సింహాసనాన్ని క్రీ.శ. 624 మార్చి 26 నాడు—అంటే, తన అన్న రెండవ పులకేశి పరిపాలన మొదలయిన సుమారు పధ్నాలుగు సంవత్సరాల తరువాత—ఆరోహించినట్లు నిర్ధారణచేశారు. ఇది సరయిన నిర్ధారణ. దీనికి కొందరు అంగీకరించరు కాని మరికొందరి అభిప్రాయాలు దీనితో సరిపోతున్నాయి. (సరిపోవటానికి వేరే ఆధారాలు ఉండవచ్చు.) మారుటూరు దానశాసనాన్ని దృష్టిలో ఉంచుకున్నట్లయితే ఈ తేదీ చెల్లు

తుందని తెలుస్తుంది. క్రీ. శ. 616 నాటికి రెండవ పులకేశి వేంగిదేశాన్ని జయించి తనకి ఇష్టమయిన తమ్ముడిని తూర్పుప్రాంతానికి యువరాజుగా చేశాడని గట్టిగా చెప్పవచ్చు.

మొదటి అధ్యాయం చాళుక్యుల మూలం. జన్మస్థలాలని చర్చిస్తుంది. 'చలికి' అన్నమాట ఒకరి పేరుగా కనిపిస్తుందని ఇక్కడ చెప్పవచ్చు. ఉదాహరణకి, ఇక్ష్వాకుల శాసనాలలో 'స్కంద చలికి' వంటిపేర్లు కనిపిస్తాయి. మొదటిలో ఇది ఒక వ్యక్తి పేరు. క్రమంగా దాని ప్రాముఖ్యత పెరిగిపోయి వంశనామంగా మారిపోయింది. వంశనామం మాత్రమే కాక 'విషయనామం' కూడా అయిపోయింది—పూగీయ, హిరణ్యాక, ధనకుల పేరులవలె. 'చలికి' వంశంవలన ఒక రాజ్యవిభాగానికి చాళుక్యుల పేరు వచ్చింది. చాళుక్య 'విషయం' ముదిగేము అగ్రహారం నేటి కర్నూలు- కడప- మహబూబ్‌నగర్ (జిల్లాల) ప్రాంతంలో ఉండేవి. సరిగ్గా యెక్కడ, అన్న విషయం వివాదనీయం.

కరికాలచోళుడు, త్రిలోచన పల్లవులకి సంబంధించిన దీర్ఘమయిన చర్చ అనవసరం అనిపిస్తుంది, అసందర్భమయినదని కూడా అనిపిస్తుంది (పేజీలు 60–65). విష్ణు (లేక భట్టుసోమయాజి) పెంచిన వాడు కనుక విష్ణువర్ధనుడన్న బిరుదువచ్చి ఉండవచ్చునని రచయిత సూచించారు. ఇది గమనించదగిన సూచన. తూర్పు చాళుక్యులుచేసిన దానాల సాంప్రదాయాలని ఆధారంగా తీసుకుని శ్రీ వెంకటకృష్ణారావు గారు ఈ రాజు అసలు పేరు జయసింహుడయి ఉండవచ్చునని అన్నారు.

రెండవ అధ్యాయంలో తూర్పు చాళుక్యుల విజయాలు, వారి సామ్రాజ్యం స్థిరపడటం—వాటికి సంబంధించిన చర్చ ఉంది. మూడు, నాలుగవ అధ్యాయాలు సామ్రాజ్య విస్తరణ యుద్ధాలకి సంబంధించినవి. మిగిలిన వాటిలో పదకొండవ అధ్యాయం (సుప్రసిద్ధుడయిన) రాజరాజనరేంద్రుడి కాలంలో సాహిత్య పోషణని చక్కగా వర్ణిస్తుంది. ఈ కాలం నిజంగా 'ఆంధ్రోద్ధరణ' కాలాలలో ఒకటి.

పన్నెండునుంచి పధ్నాలుగవ అధ్యాయాలలో వేంగి చాళుక్యుల చరిత్రయొక్క ఉత్తరభాగం చర్చ, చాళుక్య—చోళ సామ్రాజ్య చరిత్ర చర్చ ఉన్నాయి. ఈ కాలంలో ఆంధ్రప్రాంతంలో మతం ప్రసక్తి చాలా కనిపిస్తుంది. రాజకీయ పరిస్థితి కల్లోలంగా ఉన్నప్పటికీ ఎన్నో ఆలయాలు వెలిశాయి.

వెలనాటి (చోళుల) వంశంయొక్క ఔన్నత్యం ఎలా అధికం అవుతూవచ్చిందో పదిహేను, పదహారవ అధ్యాయాలు వర్ణిస్తాయి. చివరి అధ్యాయం వెలనాటి దుర్జయులు కాకతీయులు కళింగ, తూర్పు ఆంధ్ర దేశాల విజయంవలన ఏవిధంగా పతనమయ్యారో తెలుపుతుంది.

పుస్తకం నిండా ఉపయోగకరమయిన 'ఉల్లేఖనాలు ఉన్నాయి. చివర అకారాది సూచిక ఉంది.

ఒక గొప్ప పండితుడు రాసిన ఈ ఉపయోగకరమయిన గ్రంథాన్ని వెలువరించినందుకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారిని అభినందించాలి. రచయిత జీవితకాలంలో ఈ పుస్తకం ప్రచురణ కాకపోవటం, అది అసంపూర్ణంగా ఉండిపోవటం దురదృష్టకరం.

—శ్రీ ఐ. కె. శర్మ.

(గమనిక: పయి సమీక్ష శ్రీ శర్మగారి ఇంగ్లీషు మూలానికి అనువాదం.)

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras 600001, Editor : S. Radhakrishna.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RLVA104 M 181 |
| పుస్తకం పేరు | o KBW· |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI, BCI, |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | HEMA |
| పరీక్ష చేసినది | |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |